

# గమనం 70

## గుత్తికొండ సుబ్బారావు సాహితీజీవనం

డా॥ జి.వి.పూర్ణచందు

# గమనం 70

## గుత్తికొండ సుబ్బారావు సాహితీజీవనం



కూర్పు :

**డా॥ జి.వి. పూర్ణచందు**

సంకల్పం :

**స్పందన, భారతి, కవిత**

ప్రచురణ :

**గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్**

# గమనం

గుత్తికొండ సుబ్బారావు సాహితీ జీవనం...

2016 ఆగస్టు 6

మచిలీపట్నం

ప్రచురణ :

**గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్**

గృహప్రియ ఫుడ్స్, 24-388,

రామానాయుడు పేట, మచిలీపట్నం - 521 001

చిత్రాలంకరణ :

గిరిధర్, విజయవాడ

ముద్రణ :

శ్రీశ్రీ ప్రింటర్స్

విజయవాడ - 2, 9490634849



మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు (2007) ప్రారంభిస్తున్న నాటి గవర్నర్ శ్రీ యన్.డి.. తివారి, డా॥ సి.నా.రె. శ్రీ బుద్ధ ప్రసాద్, శ్రీమతి దగ్గుపాటి పురందరేశ్వరి, శ్రీ కుక్కల నాగేశ్వరరావు, శ్రీ లగడపాటి రాజగోపాల్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్




రెండవ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు ప్రారంభ సభలో శ్రీ ఐ. రామకుమార్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, ఈనాడు అధినేత రామోజీరావు, డా. సి.నా.రె.



మూడవ ప్రపంచ రచయితల మహాసభలు ప్రారంభిస్తున్న కేంద్ర మంత్రి వెంకయ్యనాయుడు



తెలుగు భాషా సంస్కృతుల చైతన్యయాత్ర ప్రారంభిస్తున్న శ్రీ మండలి బుద్ధప్రసాద్, శ్రీ సుబ్బారావు, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, పూర్ణచంద్ ప్రభృతులు




శ్రీమతి గుత్తికొండ రామరత్నం గారిని రోటరీక్లబ్ సన్మానించిన వేళ

# మా నాన్న

స్పందన

భారతి

కవిత

మా బామ్మతో చీరాలలో మేము గడిపిన మండు వేసవి రోజులు మాకు ఇప్పటికీ జ్ఞాపకమే. మా నాన్న కాలేజీ రోజుల్లో తెలుగు సాహిత్యమంటే ఎంత ఆసక్తి చూపేవారో ఆ చిన్ని వయస్సులోనే సాహిత్య కార్యక్రమాలు నిర్వహించేందుకు ఎలా ఎప్పుడు ముందుకి వచ్చేవారో మా బామ్మ మాకు కథలు కథలుగా చెప్పేది.

మేము కొంచెం పెరిగి పెద్దవాళ్ళమయ్యాక ప్రాథమిక పాఠశాలలో చదువుతున్న రోజుల్లో మచిలీపట్నం వచ్చిన ఎందరో ప్రసిద్ధ సాహితీ మూర్తులు మా ఇంటికి వచ్చేవాళ్ళు. వారికి మమ్మల్ని పరిచయం చేసేవారు మానాన్న! మచిలీపట్నం టౌన్‌హాల్‌లో ఏ సాహిత్య కార్యక్రమం జరిగినా అది ఒక పండుగలా జరిగేది. ఆ పిన్న వయసులోనే మేము మా నాన్నతో కలసి ఇంటికీ టౌన్ హాల్‌కీ మధ్య, వచ్చిన అతిధులను ఆహ్వానించేందుకు, వారికి అవసరమైన వస్తువులను అందించేందుకు తిరిగేవాళ్లం.

అదే సమయంలో లంచ్‌కో, డిన్నర్‌కో మా ఇంటికి వచ్చే అతిధుల కోసం వంట చేసే కార్యక్రమంలో మా అమ్మ తలమునకలయి ఉండేది. మా నాన్న వాళ్ళతో చాలా సుదీర్ఘమైన సంభాషణలు జరిపేవారు. మేము ఆ సంభాషణలకు శ్రోతలుగా ఉండేవాళ్లం.

ఇక్కడ ముఖ్యంగా చెప్పవలసిన విషయం ఏమిటంటే, నాన్న సాహితీ మిత్రులను కలిసేందుకు మేము కూడా విభిన్న ప్రదేశాలకు ఆయనతో కలసి వెళ్ళేవాళ్ళం.

ఒక్కసారి వెనక్కు తిరిగి చూసుకుంటే, వారివారి రచనల ద్వారా సమాజాన్ని చూడగలిగే గొప్ప అవకాశాలు మాకు అలా లభించాయని అనిపిస్తుంది.

ఒకే రకమైన ఆలోచనా సరళి కలిగిన వ్యక్తుల కలయిక వల్లా, వారి ఆలోచనలు, అభిప్రాయాలవల్ల పసిపిల్లలుగా మేము పొందిన ప్రేరణ, ప్రపంచం పట్ల మాకు కలిగిన అవగాహన బహుశా చాలా కొద్దిమందికి మాత్రమే ఆ వయసులో కలుగుతాయి.

మా నాన్నకు సాహిత్యంపై ఉన్న మమకారం వల్లనే మా అమ్మ ప్రింటింగ్ ప్రెస్ పెడదామని ప్రతిపాదన చేసినప్పుడు ఆయన వెంటనే అంగీకరించారు.

తన పుస్తకాల విషయంలో గానీ, ఇతరుల పుస్తకాల విషయంలో గానీ, ప్రచురణకు సంబంధించి అప్పటికే అనుభవం ఉండటం వల్ల ప్రింటింగ్ ప్రెస్ నిర్వహణ మా నాన్నకు చాలా సులభమయింది.

తన సాహితీమిత్రుల పుస్తకాలను ప్రచురించడం మొదలుపెట్టాక వారితో నాన్నకున్న అనుబంధం మరింత బలపడింది. అయితే ఆ పుస్తకాలు ముద్రణ పూర్తయి ఒక రూపాన్ని సంతరించుకోవటానికి ఎంత సుదీర్ఘమైన పోరాటం ఉంటుందో ఆ వయసులోనే మేము చూశాము.

దీనివల్ల మాకు కలిగిన ప్రయోజనం ఏమిటంటే ఆ పుస్తకాలలోని విషయాన్ని మేము చదివి జీర్ణించుకొనే అవకాశం కల్గింది.

కవితలు, నవలలు, వ్యాసాలు - ఇలా ఎన్నో పుస్తకాలు ప్రెస్‌లో ప్రచురింపబడ్డాయి. మా ఇంట్లో ఆ పుస్తకాలవల్లా సాహిత్యం వల్లా ఏర్పడ్డ వాతావరణాన్ని మేము ఎంతగానో ప్రేమించేవాళ్ళం.

ఇంగ్లీషులో ఒక నానుడి ఉంది, "స్వర్గాన్ని ఒక గ్రంథాలయంగా నేనెప్పుడూ ఊహించుకుంటాను" అని.

మా ఇంట్లో టన్నుల కొద్దీ పుస్తకాలు మా చుట్టూ ఉండేవి. ఏసమయంలోనైనా మనసుకు నచ్చిన పుస్తకాన్ని ఎంచుకుని చదువుకునే అవకాశం మాకు ఉండేది.

ఈనాడు జీవితానికి సంబంధించి మాకున్న బలమైన అభిప్రాయాలకూ, ఎన్నో విషయాలపట్ల గల పరిపూర్ణ అవగాహనకూ మేము పసివాళ్ళుగా ఉన్నప్పుడే వేళ్లు మా మెదడులో బలంగా ఏర్పడ్డాయి.

మేము ఎలిమెంటరీ స్కూల్ నుండి హైస్కూల్‌కు వచ్చేసరికి కుటుంబ ఆర్థిక పరిస్థితుల దృష్ట్యా, పెరుగుతున్న అవసరాల దృష్ట్యా నాన్న రాష్ట్రంలో విభిన్న ప్రాంతాలలో జరిగే సాహిత్య కార్యక్రమాలకు మచిలీపట్నం వదిలిపెట్టి వెళ్ళటం మానేసి ఒకరకంగా ఆ కార్యక్రమాలకు దూరంగా ఉన్నారు.

1990 ఆ ప్రాంతాలలో సాంప్రదాయకమైన ముద్రణ మరుగుపడిపోయి ఆధునిక ఎలక్ట్రానిక్ ప్రింటింగ్ టెక్నిక్ బాగా అభివృద్ధి చెందటం మొదలయింది. దానితో తాము ఎంతగానో ప్రేమించిన ఆ ప్రింటింగ్ ప్రెస్‌కు వీడ్కోలు పలికేందుకు మా అమ్మనాన్న నిర్ణయం తీసుకున్నారు. ఆ తర్వాత మేమంతా కాలేజీల్లో చేరటం, మానాన్న, కుటుంబ బాధ్యతలను నిర్వహించటంలోనూ క్రొత్తగా ఆరంభించిన స్వీట్‌షాప్‌ను అభివృద్ధి చేయటంలోనూ పూర్తిగా అంకితమయ్యారు.

ఆయన ఎన్నో సాహిత్య కార్యక్రమాలకు వెళ్లనప్పటికీ, ఆ రోజుల్లో జరిగే సాహిత్య కార్యక్రమాలలో ప్రత్యక్షంగా పాలుపంచుకోనప్పటికీ నాన్న చిరకాల సాహితీ మిత్రులు ఆయనతో అనుబంధాన్ని కొనసాగించటమే కాక మళ్లీ క్రియాశీలకమైన పాత్ర నిర్వహించమని కోరుతూ ఉండేవారు.

ఏమయినా పిల్లల చదువు బాధ్యత, మా వివాహ బాధ్యతల వల్ల ఆయన ఎంతగానో ఇష్టపడ్డ సాహితీ ప్రపంచానికి దూరంగానే ఉండవలసి వచ్చింది.

చివరకు 2000 సంవత్సరం వచ్చేనాటికి బాధ్యతలన్నీ తీరిపోయాయి. ఎల్ఐసీ నుండి పదవీ విరమణ చేయవలసిన తరుణం కూడా ఆసన్నమయింది. పరిస్థితులు చక్కబడ్డాయి. అమ్మ స్వీట్‌షాప్ నడిపే బాధ్యతను స్వీకరించింది.

అప్పుడు నాన్నకు తాను ఎంతగానో ప్రేమించిన సాహిత్య కార్యక్రమాలలో ప్రత్యక్షంగా పాలుపంచుకునే అవకాశం లభించింది.

ఆనాటి నుండీ తన మేరకు సాధ్యమైన సహాయ సహకారాలను సాహితీరంగానికి అందిస్తున్నారు.

ఈ మధ్యనే మా అమ్మ చనిపోవటం ఆయనపై ప్రభావం చూపినా, మళ్ళీ ఆయన చిరకాల మిత్రులు ఆయనను ప్రోత్సహించి ముందుకు సాగేలా చేశారు.

ఈ సాహిత్య కార్యక్రమాలలో నాన్న భాగం పంచుకున్నా వాటి ప్రభావం

మా జీవితంపై పడకుండా చూసుకునేవారు. కానీ ఆయన సాహితీ ప్రయాణంలో మేము కూడా ఒక భాగం అయ్యాం.

ఆయనలో వున్న త్యాగశీలత నుండి మేము చాలా నేర్చుకున్నాం. అంతకుముందే చెప్పినట్లు ఆయన చిన్నతనం నుండీ సాహిత్యంతో అనుబంధాన్ని పెంచుకున్నా కుటుంబం కోసం పిల్లల కోసం ఆయన దానిని తాత్కాలికంగా ప్రక్కనపెట్టారు.

ఆయన్ను, సాహిత్యం పట్ల ఆయనకున్న ప్రేమనూ, దగ్గరగా గమనించిన మాకు అదెలా సాధ్యమయిందో అంతుపట్టేదికాదు.

అయినా ఆయన కుటుంబానికీ మాకూ ప్రథమ స్థానం ఇవ్వగలిగారు.

జీవితంలోని కొన్ని కొన్ని మలుపుల దగ్గర వేటికి ప్రాధాన్యత ఇవ్వాలో, వేటికి తర్వాత స్థానం ఇవ్వాలో మేము ఆయన దగ్గరనే నేర్చుకున్నాం. దీనివల్ల మేము మా వ్యక్తిత్వాన్ని గూడా మలుచుకోగలిగాం.

సాహిత్యం పట్ల ఆయనకున్న అనురాగాన్ని గమనించాక మేము కూడా మీ జీవితంలో ఎంచుకున్న విషయాలపై ఎలా ఏకాగ్రత చూపాలో మా కలలను నిజంగా ఎలా సాకారం చేసుకోవాలో నేర్చుకోగలిగాం. చాలా చిన్నతనంలోనే మా అభిప్రాయాలను స్పష్టంగా చెప్పగలగటం. చిన్న చిన్న ఆలోచనలను బృహద్కార్యక్రమాలుగా మలుచుకోవటం నేర్చుకున్నాం.

ప్రతి మనిషికీ ఈ భూమి మీద మనుగడ సాగించేందుకు ఒక కారణం ఉంటుంది. చాలా కొద్దిమంది మాత్రమే ఆ కారణాన్ని తెలుసుకొని దాన్ని సాధించేందుకు కృషి చేస్తారు. మిగిలిన వాళ్ళు వెనక్కు వాలి కూర్చుని ఆ సాధించిన వారి విజయాలను ప్రశంసిస్తూ కాలం గడుపుతారు.

గొప్ప వ్యక్తిత్వం గలవాళ్ళు తమ కలలను సాకారం చేసుకోవటమే గాక మిగతావారికి కూడా జీవితాన్ని సార్థకం చేసుకునేందుకు అవసరమైన దిశానిర్దేశం చేస్తారు. మేము పిల్లలుగా ఉండగానే ఆ సూచనలను అర్థం చేసుకున్నాం.

ప్రభావాత్మకమైన, శక్తివంతమైన, జీవితాన్ని గడిపేందుకు ఉపయోగపడే ఆ సూచలను సమాజాన్ని అర్థం చేసుకునేందుకు, కళపట్ల ప్రేమను పంచుకునేందుకు, మా జీవితాలను తదనుగుణంగా మలుచుకునేందుకు ఉపయోగించుకున్నాం.

మా నాన్న తాను ఎన్నుకున్న రంగంలో ఈ మధ్యరోజుల్లో పొందిన గౌరవాలను విజయాలను చూసి గర్వపడుతున్నాం.

ఇన్నాళ్ళూ ఆయనలో ఉన్న పట్టుదలనూ ఉత్సాహాన్ని మేము చూశాం.

ఇక ముందు కూడా సాహితీ రంగానికి ఆయన అమూల్య సేవలు అందుతూ ఉండాలనే ఆకాంక్షిస్తున్నాం!





ముగ్గురు కుమార్తెలతో....



మనుమలు, మనుమరాళ్ళతో...



ముగ్గురు అల్లుళ్ళతో....

# గమనం

## శ్రీ గుత్తికొండ సుబ్బారావు సాహితీ జీవనం

**– డా. జి వి పూర్ణచందు**

పుట్టి బుద్ధెరిగిన నాటి నుండీ ఇప్పటిదాకా నాకు కలిగిన ప్రేరణలు, నేను పొందిన అనుభవాలకు మూలకారకుడిగా ఉన్న శ్రీ గుత్తికొండ సుబ్బారావు గురించి నేను చెప్పాలనుకుంటున్న మాటలే ఈ “గమనం” పుస్తకం.

1975 నుండీ అంటే నాలుగు దశాబ్దాల కాలంలో సాహిత్యపరంగా సంపాదించుకున్న నా అనుభవాలు అపరిమితమే! వాటి ద్వారా నేను నేర్చుకున్న ముఖ్యమైన పాఠాల్లో నాకు సుబ్బారావు నేర్పినవే ఎక్కువున్నాయి.

సుబ్బారావు గురించి రాయటం అంటే ఆయన పాఠాల గురించి వ్రాయటమే!

భవిష్యత్తులో ఏ విశ్వవిద్యాలయమైనా సంస్థల నిర్వహణ, కార్యకర్తృత్వం, సభా మర్యాదలు, ఉద్యమాలు, పోరాటాలు – వీటి గురించి ఒక కోర్సును ప్రవేశ పెట్టి, అవి నేర్పే కార్యకర్తల కళాశాల ఏర్పాటు చేస్తే దానికి ప్రిన్సిపాల్ కాగల వ్యక్తి సుబ్బారావు గారే! నన్నడిగితే ఆయనే ఒక ‘కళాశాల’ అంటాను.

సుబ్బారావు సాహిత్యపరమైన పోరాట యోధుడు.

నిఖార్సయిన మార్క్సిష్టు. నిత్య సత్యాన్వేషి. ఎన్నడూ దేవుడి జోలికి వెళ్ళనివాడు. దారుణాఖండ శస్త్ర తుల్యమైన వాక్పటిమ ఆయన స్వంతం.

నిర్వహణలో తప్పు జరిగితే సర్దుకు పోవటం ఎరగని వాడు.

ఆయన గురించి నేను వ్రాయాలనుకున్నదంతా వీటికి సంబంధించిన అంశాలే!

సుబ్బారావు గురించి ఇలాంటి ముఖ్యమైన అంశాలు రాయాల్సినవి చాలా ఉన్నాయి.

ఆయన జీవితాన్ని ఆయనతో నా పరిచయానికి ముందు దశ, వారితో నా పరిచయం తరువాతి దశ... అని రెండు దశల్లో వర్గీకరిస్తే, నేను చెప్పాలనుకుంటున్న మాటల్లో స్పష్టత ఉంటుందనుకుంటాను.

నేను సుబ్బారావుకి పరిచయం అయిన తరువాత సుబ్బారావు చేపట్టిన సాహిత్య పరమైన కార్యక్రమాల్లో ఆయన సహచరుడిగా నా పాత్ర కూడా అంతో ఇంతో ఉంది. కాబట్టి, సుబ్బారావు సాహిత్య జీవన గమనానికి సంబంధించిన ఈ కథలో లక్ష్మణుడి పాత్రలో నేను కూడా తొంగి చూస్తుంటాను.

నిజాయితీగా చెప్పాలంటే, సాక్షాత్తు లక్ష్మణుడే రామాయణాన్ని వ్రాస్తే ఎలా ఉంటుందో ఈ "గమనం" కూడా అలానే ఉండబోతోంది.




ఉత్తర అమెరికా తెలుగు సంఘం వారితో కలసి కార్యక్రమ నిర్వహణలో

## తపన-తపస్సు

సుబ్బారావుకి రెండు ఇంటి పేర్లున్నాయి. ఒకటి తపన, ఇంకొకటి తపస్సు.

"తపన-తపస్సు లేనివాళ్ళు సాహిత్య సేవా కార్యక్రమాల జోలికి రాకుండా రచయితలుగా ఉండిపోవటమే మంచిది" అనేది నిర్మొహమాటంగా సుబ్బారావు చెప్పే ప్రాథమిక సూత్రం.

1975-76 సంవత్సరాలలో సుబ్బారావు బందరు కేంద్రంగా స్పందన సాహితీ సమాఖ్య కార్యక్రమాల్లో ఉధృతంగా పనిచేస్తున్న రోజులు. విజయవాడలో నేను ఇంటర్మీడియట్ చదివి మెడికోనైన తొలిరోజులు అవి.

"ఎలా చెయ్యకూడదో, ఏం చెయ్యకూడదో నేర్చుకోవటానికి నా దగ్గరకు రా! you must know, how not to do things" అని 42 యేళ్ళక్రితం ఆయన నాతో అన్నప్పటి నుండీ, నేను అదే పనిలో ఉన్నాను.

నాకు గుర్తున్నంత వరకూ ఒక్కసారి కూడా "నువ్వు అద్భుతంగా చేశావయ్యా..." అని ఒక్కముక్క నాతో అన్న పాపాన పోలేదాయన. ఎప్పటికైనా ఆయన్ని మెప్పించగలనేమో ప్రయత్నిస్తాను. ఆయన బాగాలేదని అనకపోవటమే మెచ్చుకోవటం అని నాకు బాగా తెలుసు.

"కార్యకర్తకు తపన ఉండాలి. అనితర సాధ్యం అనిపించుకోవాలనే లక్ష్యం ఉండాలి. అందుకోసం కలలు కంటూనే ఉండాలి. కలల సాకారం కోసం అనునిత్యం కష్టపడాలి. కష్టపడకుండా పనులు జరిగి పోతాయనుకోవటం భ్రమ. ఏ మాత్రం హోమ్‌వర్క్ లేకుండా జరిపిన సభ ఎలాతెలాగా ఉంటుంది. దాన్ని చూస్తే ఇట్టే అర్థం అయిపోతుంది" అంటారాయన.

అలా హోమ్‌వర్క్ చేయటమే పథక రచన. మంచి పథకం వేస్తేనే కార్యక్రమం దిగ్విజయం అవుతుంది. దానికి పరిణతి కావాలి. పరిణతి కలిగిన వ్యక్తులు సుబ్బారావుతో కలిసి పనిచేస్తే బంగారం 'మేలిమి బంగారం' అవుతుంది.

స్పందన సాహితీ సమాఖ్య పక్షాన నెలకి ఒకటీ రెండు భారీ కార్యక్రమాలు చేస్తూ రావటం, స్పందన వాణి పత్రిక నడపటం, 60కి పైగా పుస్తకాలు ప్రచురించటం - ఇలా ఒక దీక్షాయంత్రంలాగా పనిచేసుకుపోవటమే ధ్యేయంగా సాగిపోతున్న సుబ్బారావుని నిజంగా ఒక మలుపు తిప్పగలిగిన ఓ ముఖ్యమైన వ్యక్తిని ఈ పుస్తకంలో అందరికన్నా ముందు పేర్కొనాలి. ఆయనే శ్రీ మండలి బుద్ధప్రసాద్.

ఎందరినో ముప్పుతిప్పలు పెట్టి ఎన్నెన్నో మలుపులు తిప్పిన సుబ్బారావుని

తెలుగు భాషోద్యమంలోకి లాగి ఓ మహారథుడి పాత్ర ఇచ్చి, ఇంక దీన్నే పోషించమని, దీన్లో జీవించమనీ ఆయన సుబ్బారావుకి నిర్దేశం చేశారు.

అనతికాలంలోనే తెలుగు భాషోద్యమం ప్రజల గుండె తలుపులు తట్టగలగటంలో గణనీయమైన ఫలితాలు సాధించగలిగిందంటే సుబ్బారావు లాంటి సేనానులు ఆ సర్వసైన్యాధిపతికి అండగా నిలబడటమే కారణం.




ఒంగోలులో ప్రకాశం జిల్లా రచయితల సంఘం సమావేశంలో...
వేదికపై ఎస్వీ సత్యనారాయణ, ఎండ్లూరి సుధాకర్, కె. శివారెడ్డి, దేవిప్రియ

## కృష్ణాజిల్లా రచయితల సంఘం వ్యవస్థాపన

1982లో ఒకసారి శ్రీ మండలి బుద్ధప్రసాద్ కి ఒక సావెనీరు కనిపించింది. అది 1976లో మేము స్పందన సాహితీ సమాఖ్య పక్షాన జరిపిన 4వ కృష్ణాజిల్లా రచయితల మహాసభల ప్రత్యేక సంచిక.

అది చూశాక అవనిగడ్డలో కూడా కృష్ణాజిల్లా రచయితల మహాసభలు నిర్వహిస్తే బావుణ్ణనే ఆలోచన శ్రీ బుద్ధప్రసాద్ కి కలిగింది. ఆయన వెదుక్కుంటూ, బందరు యల్.ఐ.సీ ఆఫీసుకు వెళ్ళి సుబ్బారావు ఎవరని ఆరా తీశారు.

శ్రీ విడియాల చంద్రశేఖరరావు ద్వారా సుబ్బారావుని కలిసి, అవనిగడ్డ గాంధీక్షేత్రంలో కృష్ణాజిల్లా రచయితల 5వ మహాసభలు నిర్వహించటానికి మీకేమైనా అభ్యంతరం ఉంటుందా? అనడిగారు.

కార్యక్రమం చేయటానికి అవకాశం దొరకడం అంటే సుబ్బారావుకి ప్రాణం లేచి వచ్చినట్టే అవుతుంది.

అది కార్యకర్త లక్షణం.

సుబ్బారావు దృష్టిలో సాహిత్య కార్యక్రమం అనేది ఒక పవిత్ర యాగం. దాన్ని బాధ్యతగా నెరవేర్చాలనేదే ఆయన తపన. నిద్రలోనూ, మెలకువలోనూ సాహిత్య కార్యక్రమాల గురించే ఆయన ఆత్మ కలవరిస్తూంటుంది.

బుద్ధప్రసాద్ ఆహ్వానం మేరకు అవనిగడ్డ వెళ్ళి అక్కడ ఏర్పాట్లకు తగినంత వసతి సదుపాయాల గురించి పరిశీలించి వచ్చారు.

1982 జూలై 10,11 తేదీలలో అవనిగడ్డ గాంధీక్షేత్రంలో కృష్ణాజిల్లా రచయితల 5వ మహాసభలు ఘనంగా జరిగాయి. మండలి వెంకట కృష్ణారావు, యం.ఆర్. అప్పారావు లాంటి హేమాహేమీలు ఆ సభల నిర్వహణలో నిలబడ్డారు. వాళ్లతో కలిసి సుబ్బారావు, నేనూ పనిచేయటం అదొక అపూర్వ అనుభూతి మాకు.

ఆ సభలకు ఆరుద్ర, సంజీవదేవ్, లత, అద్దేపల్లి ప్రభృతులు విచ్చేశారు. దాశరథి సభలను ప్రారంభించారు. ఆయన ఆనాడు ఆస్థానకవిగా ఉన్నారు.

ఈ సభల సందర్భంగా పెద్దలు యం.ఆర్. అప్పారావు, మండలి వెంకట కృష్ణారావు వీరిద్దరూ ముఖ్యంగా కృష్ణాజిల్లా రచయితల సంఘం ఒకటి ఏర్పడటం అవసరం అని గట్టిగా భావించారు. వారిద్దరి ప్రసంగాలూ ఆ దిశగానే సాగాయి.

"కేవలం సభల నిర్వహణకు పరిమితం కాకుండా సాహిత్యోద్యమాలకు అంకితంగా పనిచేసే ఒక సంస్థ అవసరం ఈ నాడు ఉంది" అని మండలి వెంకట

కృష్ణారావు సభలో అన్నారు. ఆ సాయంత్రం సదస్సులన్ని అయిపోయాక విడిగా మమ్మల్ని కూర్చోబెట్టి రచయితల సంఘం ఎలా ఉంటే ప్రయోజనాత్మకంగా ఉంటుందో వివరించి చెప్పారు. వాళ్ళలో సుబ్బారావుతో పాటు బుద్ధప్రసాద్ కూడా ఉన్నారు. యమ్మార్ (రాజా మేకా రంగయ్య అప్పారావు ) "మీకు నేను అండగా ఉంటా"నని అన్నారు. అప్పుడు సీనియర్ పాత్రికేయుడు, అభ్యుదయవాది, సాహితీవేత్త శ్రీ ముక్కామల నాగభూషణం మాట్లాడుతూ సుబ్బారావు లాంటి యువకుడు ముందుకొస్తే, తాను కృష్ణాజిల్లా రచయితల సంఘం ఏర్పాటు బాధ్యతలు తీసుకుంటానన్నారు.

నాగభూషణం, శ్రీ బుద్ధప్రసాద్ తల్లి గారిని అమ్మాయ్ అని పిలిచేవారు. శ్రీ బుద్ధప్రసాద్, శ్రీ ముక్కామల నాగభూషణం గారిని తాత అనేవారు. ఆ రెండుకుటుంబాల మధ్య ఆత్మీయతా బంధాలు అలాంటివి. నాగభూషణం గారు నన్ను పూర్తి పేరుపెట్టి గంగరాజు వెంకట పూర్ణచందూ అనేవారు. ఆయన "అసురనాగరికత" పుస్తకం వ్రాసేప్పుడు నేను వారి పక్కనే ఉన్నాను. రచనలో సహకరించాను కూడా!

నా 'సప్తసింధు' నవలని ఆయన చదివి వివిధ రకాలుగా మార్పులు కూర్పులు చేసి పరిష్కరించి, ఆయనే తన 'అసురనాగరికత' పుస్తకంతో పాటు అచ్చు వేయించారు.

నాగభూషణంగారిని మెప్పించ గలిగానంటే ఇప్పటిక్కూడా నాకు ఆశ్చర్యమే! ఆయన 'ప్రగతి' వారపత్రికను దశాబ్దికి పైగా నడిపి, ఎందరో ప్రసిద్ధ రచయితల మొదటి రచనలను ప్రచురించి, వారిని ప్రోత్సహించిన గొప్ప సంపాదకుడు. వ్రాతప్రతిని చేత్తో పుచ్చుకుని లోపల సారం ఎంత ఉందో అంచనా వేయగల ధీశాలి.

ముక్కామల నాగభూషణంగారు, సుబ్బారావు పేరుచెప్పగానే మేమంతా చప్పట్లు కొట్టేశాం.

సాధారణంగా సుబ్బారావు ఏ విషయాన్నీ వెంటనే కమిట్ అయినట్టు కనిపించడు. మౌనం పాటిస్తాడు. కాసేపు చూసి నాగభూషణంగారే అన్నారు, "నేనే అధ్యక్షుడిగా ఉంటానయ్యా! మండలిని గౌరవాధ్యక్షుడిగా ఉండమందాం. యమ్మార్ మనకి ముఖ్య సలహాదారుగా ఉంటారు. నువ్వు ప్రధాన కార్యదర్శిగా ఉండి నడిపించు" అని.

సుబ్బారావు మౌనంగానే తలూపారు.

అదీ సుబ్బారావు సాహితీ జీవన గమనంలో ఒక మలుపు.

కృష్ణాజిల్లా రచయితల సంఘానికి, దాని పనితీరుకు అలా ఒక దిశా నిర్దేశం జరిగింది.

అప్పటిదాకా స్పందన సాహితీ సమాఖ్య కోసం అంకితమై పోయిన సుబ్బారావు పైన కృష్ణాజిల్లా రచయితల సంఘం నిర్మాణ నిర్వహణా బాధ్యతలు అదనంగా పడ్డాయి.

1983లో కృష్ణాజిల్లా రచయితల సంఘం రిజిష్టర్ అయ్యింది.

శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని ప్రారంభించారు.

మండలి వెంకట కృష్ణారావు గారు గౌరవాధ్యక్షుడిగా, ముక్కామల నాగభూషణం అధ్యక్షుడిగా, కళాప్రపూర్ణ తెన్నేటి హేమలత, డా. త్రిపురనేని వెంకటేశ్వరరావు, డా.పోతుకూచి వెంకటేశ్వర్లు ఉపాధ్యక్షులుగా, శ్రీ గుత్తికొండ సుబ్బారావు ప్రధాన కార్యదర్శిగా, శ్రీ మైత్రేయ కోశాధికారిగా, శ్రీ బుద్ధప్రసాద్, డా. జి. వి. పూర్ణచంద్ కార్యదర్శులుగా తొలి కార్యవర్గం ఏర్పడింది. యమ్మార్, దాశరథి, సినారె, కుందుర్తి, ముసునూరిజగన్నాథరావు ప్రభృతులు సలహా సంఘంలో ఉండేవారు.

గుత్తికొండ సుబ్బారావు శక్తియుక్తులు క్రమేణా కృష్ణాజిల్లా రచయితల సంఘం వైపు మళ్ళాయి.

అందుకు ప్రధాన కారకుడు శ్రీ మండలి బుద్ధప్రసాద్.

అదే సమయంలో 1983లోనే, సుబ్బారావు స్పందన పింటర్స్ పేరుతో ఒక ప్రింటింగ్ ప్రెస్సు వ్యవస్థాపించటంతో స్పందన సాహితీ సమాఖ్య కార్యక్రమాలు పుస్తక ప్రచురణకు అంకితం కాసాగాయి. దాదాపు అరవై పుస్తకాలను స్పందన సాహితీ సమాఖ్య పేరుతో ప్రచురించారు.

అటు యల్ఐసీ ఉద్యోగం, ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలు, ఇంకో వైపు అచ్చు పరిశ్రమ స్థాపన, స్పందన కోసం పుస్తక ప్రచురణలు, మరో వైపు కృష్ణాజిల్లా రచయితల సంఘం కార్యక్రమాలు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కార్యవర్గ సభ్యుడిగా బెజవాడ గోపాలరెడ్డితోనూ, దేవులపల్లి రామానుజరావుతోనూ నిరంతర సంఘర్షణలు... ఇంకా అనేక సాహితీ సంస్థల సాధకబాధకాల పరిష్కారం... ఇలా ఊపిరి తీసుకునే అవకాశం కూడా లేకుండా అవిరామ సాహితీ శ్రామికుడిగా మారిపోయారు సుబ్బారావు.

కృష్ణాజిల్లా రచయితల సంఘం పునరుద్ధరణ తరువాత శ్రీ బుద్ధప్రసాద్, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ – ఈ ఇద్దరూ సుబ్బారావు కాళ్లకు చక్రాలు కట్టారు. ఇంకా గట్టిగా చెప్పాలంటే, సుబ్బారావునీ నన్నూ కలిపి చక్రానికి కట్టేశారు. బ్యాలెన్సు చేసుకోవటం మా వంతయ్యింది. సుబ్బారావు ఉన్నారనే ధైర్యంతో నా పని నేను చేసుకుపోతూ ఉండేవాణ్ణి.

అందుకేనేమో, డా. రాళ్ళబండి కవితా ప్రసాద్, సుబ్బారావుని హార్డ్‌వేర్ అనీ, నన్ను సాఫ్ట్‌వేర్ అనీ వర్గీకరించారు. మా పని విధానాలు కూడా అలానే ఉండేవి.

మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలలో సినారె "ఈనాటి సాహిత్య సౌధానికి బుద్ధప్రసాద్, యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, గుత్తికొండ సుబ్బారావు, జి వి పూర్ణచందు- ఈ నలుగురూ నాలుగు స్తంభాలు" అన్నారు.

ఆచార్య శరజ్జ్యోత్స్నారాణి, సుబ్బారావుకు జ్యోత్స్న కళాపీఠం సాహితీ పురస్కారాన్ని అందిస్తున్న సభలోనే సినారె "ఈ సభ యావత్తూ ఒక ఉత్తరం అనుకుంటే ఆ ఉత్తరంలో సంతకం లాంటివాడు సుబ్బారావు" అని ప్రశంసించారు.

సుబ్బారావు జీవితాన్ని వడపోసి చూసినవారికి సినారె పలుకులు బాదం పలుకుల్లా రుచిగా అనిపిస్తాయి.

శ్రీ విహారి 1980ల్లో తన కవితా సంపుటి 'చలనం' సుబ్బారావుకి అంకితం ఇస్తూ, "ఎక్కడ ఏ పుస్తకం అచ్చవుతున్నా తన పుస్తకమే అచ్చవుతున్నంత సంబరపడే గుత్తికొండ సుబ్బారావుకు" అని వ్రాశారు. ఇది అక్షర సత్యం

మూడు పర్యాయాలు ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు, ఒక జాతీయ తెలుగు రచయితల మహాసభ, దాదాపు 15 జాతీయ సదస్సులు, 15కు పైగా పెద్ద తలగడ లాంటి పుస్తకాల ప్రచురణ...ఇలా ఒక సాహితీ పారిశ్రామిక యంత్రంలా పనిచేశారు సుబ్బారావు. మా అందరితోనూ పనిచేయించారు.

ఒక వైపు భార్య రమాదేవి తీవ్ర అనారోగ్యం. అయినా ప్రపంచ సభలు తల పెట్టిన ప్రతిసారీ విజయవాడ బందరు మధ్య ఆర్నెల్లపాటు రోజూ తిరిగారు. ఉదయం వచ్చి బెజవాడలో పనులు చూసుకోవటం, సాయంత్రానికి భార్య అనారోగ్యం రీత్యా బందరు వెళ్ళటం, అలా జరిగేది.

ప్రపంచ సభల నిర్వహణ అంటే ఆర్నెల్లపాటు అహోరాత్రాలు శ్రమించాల్సిన ఒక మహా సన్నివేశం. దానికి అంకిత భావం కావాలి. కార్యకర్తల మధ్య పరస్పర అవగాహన, గౌరవం ఉండాలి. నేనిలాంటి పని చెయ్యను అనే 'అహం' ఉంటే కార్యకర్తగా రాణించలేడు. కుర్చీలు, బల్లలు తుడవటం దగ్గర్నించీ ఏ పనైనా చేయటానికి సిద్ధపడగల వాళ్ళే అద్భుతాలు చేయగలుగుతారు. సుబ్బారావు పోలసీ అది.

అందుకు ఇష్టపడేవాళ్ళు ఆయన వెన్నంటి ఉంటారు. లేనివాళ్ళు క్రమేణా పక్కకు తప్పుకుంటూ ఉంటారు.



జ్యోత్స్న కళాపీఠం వారి సత్కారసభలో ఆచార్య ఎల్లూరి శివారెడ్డి,
ఆచార్య సి.నారాయణరెడ్డి, శ్రీ జె. బాపురెడ్డి గార్లతో




"మనిషి కోసం" ఆవిష్కరణ సభలో...

## సాహితీ సంస్థలు-పాలనాదక్షత

శ్రీరామచంద్రుడికి ఎవరైనా పరిచయస్తుడు కనిపిస్తే ముందు తనే నవ్వుతూ పలకరిస్తాడట, అందుకని ఆయన్ని స్మితపూర్వభాషీ అని పిలుస్తారు. ఇది కార్యనిర్వహణా దక్షుడైన ఒక సాహితీ సంస్థ నిర్వహకుడికి ఉండవలసిన లక్షణం. స్వయంకృషితో ఎదిగిన వ్యక్తుల్లోనే ఈ లక్షణం ఉంటుంది.

సాహితీ సంస్థలకు గానీ, సేవా సంస్థలకు గానీ, ట్రేడ్ యూనియన్‌లకు గానీ నాయకత్వ స్థాయిలో ఉన్నవారు స్థిరమైన నాయకుడుగా రాణించటానికి ఈ లక్షణం తోడ్పడుతుంది.

సుబ్బారావుని ఎరిగిన వారికి ముందుగా ఆయనలో కనిపించే లక్షణం ఇదే!

సుబ్బారావు సాహితీ జీవితంలో ఆయనకు అత్యంత సన్నిహితులుగా మెలిగిన వారు, ఆయన గురుస్థానం ఇచ్చి గౌరవించిన వారనేకమంది ఉన్నారు.

తొలిరోజుల్లో వచనకవితా పితామహుడు శ్రీ కుందుర్తి ఆంజనేయులు, డా. సి, నారాయణ రెడ్డి, మలిరోజుల్లో ప్రముఖ కథకుడు, విశ్లేషకుడు శ్రీ విహారి, ఆచార్య వంగపల్లి విశ్వనాథం వారిలో ముఖ్యులు. శీలా వీర్రాజు, కె. శివారెడ్డి, భైరవయ్య, నగ్నముని, జ్వాలాముఖి, చంద్ర ప్రభృతులు ఆయన సహచరులు.

మలిరోజుల్లో సుబ్బారావుని ఎక్కువగా ప్రభావితం చేసినవారిలో డా. బెజవాడ గోపాలరెడ్డి కూడా ఉన్నారు.

అప్పటి ఆం.ప్ర. సాహిత్య అకాడెమీలో సుబ్బారావు సహించలేని విషయాలు అనేకం జరుగుతున్నప్పుడు సుబ్బారావు అకాడెమీ అధ్యక్షులైన గోపాలరెడ్డితో ఘర్షణ పడవలసి వచ్చేది. ఆ ఇద్దరి మధ్య ఎంత వైరం ఉండేదో అంత ఆత్మీయత కూడా ఉండేది.

డా. గోపాలరెడ్డి, అత్యంత నమ్మకమైన వ్యక్తిగా సుబ్బారావును భావించేవారు.

తరువాతి రోజుల్లో అత్యంత సన్నిహితంగా సుబ్బారావు మెలిగింది శ్రీ బుద్ధప్రసాద్, ఆచార్య లక్ష్మీప్రసాద్ గార్లతో.

'Do' అనగానే 'Done' అనటం సుబ్బారావుకి వెన్నతో పెట్టిన విద్య. నిజానికి నాకు ఈ తత్వాన్ని నేర్పిందే ఆయన. దాన్ని నేర్పటం అనే కన్నా తర్ఫీదు ఇచ్చారనటం బావుంటుంది. నిజానికి మా ఇద్దరికీ ఈ గుణం విహారి దగ్గరి నుండి సంక్రమించింది, know తప్ప no తెలియని రీతిలో ఆయన మమ్మల్ని నడిపించారు. ఆ విషయాన్ని సుబ్బారావు అనేక సభల్లో సగర్వంగానూ, సగౌరవంగా కూడా ప్రకటించారు.

"స్వేచ్ఛగా పనిచేయాలంటే ప్రతిఫలాపేక్ష రహితంగా కార్యకర్త ఉండాలి. ఉన్నప్పుడే ఆ ధీమా ఉంటుంది" అనే సిద్ధాంతం మాది. మూడు ప్రపంచ మహాసభలు, ఇంకా అనేక సాహిత్య కార్యక్రమాలు చేసినందువలన మా వ్యక్తిగత వృత్తి వ్యాపారాల్లో కలిగిన నష్టాల సంగతి అలా ఉంచితే, పొందిన లాభం ఏకవచనంలో కూడా లేదు. అందుకే సుబ్బారావు సగర్వంగా చెప్తారు... "ప్రతిఫలాన్ని ఆశించని వాళ్ళు ఎవరినీ లెక్క చేయాల్సిన అవసరం లేదు" అని!

కుందుర్తి, విహారి, గుత్తికొండ, పూర్ణచందు...ఇలా మా గురుశిష్య పరంపర అదే ఒరవడిలో సాగుతోంది.

ప్రతిఫలాపేక్ష రహితంగా ఉన్నప్పుడు నిజాయితీతో కూడిన విధేయత ఏర్పడుతుందని మా ఇద్దరి అభిప్రాయం.

"మంచి అనుచరుడు కాని వ్యక్తి, మంచి నాయకుడు కాలేడు" అంటారు సుబ్బారావు.

"అనుచరత్వం తెలీకుండా నాయకులయిన వాళ్ళు చిరకాలం నాయకులుగా మనలేరు. వీళ్లలో అహం ఎక్కువగా ఉంటుంది. దానివలన చాలా త్వరగా వాళ్ళు నాయకత్వ స్థానాన్ని కోల్పోతుంటారు. అదృష్టం కలిసొచ్చినంత కాలం నోరు పెట్టుకుని బతికేయాలని చూస్తుంటారు. పదవులు బిరుదులు పొందవచ్చు. కానీ అనుచరుల అభిమానానికి దూరమై క్రమేణా కాలగర్భంలో కలిసిపోతారు" అన్నారొక సందర్భంలో సుబ్బారావు.

మన మంచితనాన్ని చేతకానితనం అనుకునే వాళ్ళు మనకు చాలా మంది తారస పడతారు. మన వ్యక్తిత్వాన్ని తక్కువగా అంచనా వేసుకునే వాళ్ళు- బదులుగా మన నుండి అంతే తక్కువ గౌరవాన్ని పొందుతారు.

ఎవరికి ఎంత గౌరవం ఇవ్వాలో తూకం వేయగలిగే సున్నితపు త్రాసు సుబ్బారావు దగ్గర ఉంది. ఆయన మిల్లీ గ్రాముల్లో కూడా అవతల వ్యక్తి బరువునీ, పరువునీ తూకం వెయ్యగలడు.

ఎంత విధేయంగా ఉండగలడో అంత కటువుగానూ వ్యవహరించ గలిగే వ్యక్తిత్వం సుబ్బారావుది. డా. బెజవాడ గోపాలరెడ్డికి సుబ్బారావు ఎంత విధేయుడో అంత వ్యతిరేకి కూడా! అభిమానం అనేది వ్యక్తిగతం, వ్యతిరేకత అనేది సిద్ధాంత పరమైంది. ఈ రెండూ వేర్వేరు అంశాలుగా ఉండాలని చాలాసార్లు అనేవారు సుబ్బారావు.

అణకువగా ఉండటాన్ని ఒక లోకువగా తీసుకున్న వ్యక్తులపట్ల సుబ్బారావు తీవ్రంగా స్పందించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. అలాంటి పోకడలు గల వ్యక్తులు నాయకత్వంలోకి రావటానికి ప్రయత్నిస్తే ముందే వాళ్లని గమనించాలి. కొంత గడిచాక ఆ మనిషి పోకడలో మార్పు గోచరించినప్పుడు మన విధేయతలను మార్చుకోవటం అవసరం కూడా!

యాభై యేళ్ళుగా నాయకుడిగా సుబ్బారావు స్థిరంగా నిలబడగలిగారంటే, నలభై యేళ్ళుగా ఆయనకు ముఖ్య సచివుడిగా నేను వెన్నంటి నడిచానంటే ఆయన గౌరవించి, గౌరవం పొందే తత్వం కలిగిన వాడు కావటమే కారణం!

ఒకసారి ఓ పెద్దాయన విషయంలో ఇలాంటి సందర్భమే మాకు ఎదురయ్యింది. ఆయన ఎందుకిలా ప్రవర్తిస్తున్నారని అడిగాను. "ఎంత గొప్పవాడైనా మనల్ని గౌరవించే విషయంలో ఏమాత్రం 'కొద్దితనం' కనిపించినా – గ్రక్కున విడువంగ వలయు" అని పెద్దగా నవ్వారు సుబ్బారావు.

నాయకత్వాన్ని నిలుపుకోవాలంటే ఎంతటి వారైనా అహంకరించి మాట్లాడటం, నోటి దురుసుతనం – ఈ రెండింటినీ మానుకోవటం తప్పనిసరి!

సుబ్బారావులోని అణకువతో కూడిన కాఠిన్యం మనకు నేర్పుతున్న పాఠం ఇదే!

"నాయకత్వ లక్షణాలు పుస్తకాల్లో చదివితే వచ్చేవి కావు. అవి వినయంతో, శ్రద్ధతో, పట్టుదలతో నేర్చుకోవలసినవి. ఈ మూడూ లేనివాడు అవసరాలు తీరుస్తూ అనుచరుల్ని కాపాడుకునే వాడుగా మాత్రమే ఉంటాడు. నాయకుడనిపించుకోలేడు" అని చెప్తారు.

సుబ్బారావు గురువులుగా భావించుకున్న వ్యక్తులంతా సాహితీ సంస్థల నిర్మాణ, నిర్వహణా దక్షులు. ఆయన అణకువగా ఉండేది కూడా అలాంటి వారికే! వాళ్ల వారసత్వం సుబ్బారావు నరాల్లో ప్రవహిస్తోంది.

ముఖ్యంగా కుందుర్తి ప్రభావం ఆయన మీద మరీ ఎక్కువ. కుందుర్తి లాంటి ఉద్యమ నాయకుడు అరుదనే మేం భావిస్తాం.

## కలలు కనే వాడే కార్యకర్త

ప్రపంచంలోని ముఖ్య కార్యకర్తలందరి లక్షణాలను ఒక విగ్రహంలా పోతపోస్తే, ఆ విగ్రహం సుబ్బారావులా ఉంటుంది. ఇది పొగడ్త కాదు. సాహిత్య కార్యక్రమాల నిర్వహణకోసం భార్య మెడలో తాళిబొట్టును అడిగేంత కార్యకర్త మరొకరు మీకు కనిపిస్తే, బహుశా ఆయనలా ఉండవచ్చని నేను కూడా ఒప్పుకుంటాను.

ఒక మంచి కార్యకర్త అంటే గొప్ప సాహితీ సంస్థ నిర్వాహకుడని అర్థం. సాహితీ కార్యకర్త, రాజకీయపార్టీల కార్యకర్త, ఈ రెండు పదాలూ ఒకే అర్థంలో ఏర్పడ్డవి కాదు. సాహితీ కార్యకర్తగా తనను ఘనంగా భావించుకో గలిగే వ్యక్తి ఉన్నత ఆదర్శాలకు అంకితంగా జీవిస్తాడు. ఇల్లూ, వాకిళ్లకు రెండో ప్రాధాన్యత నిస్తాడు. ఆరింటికి మీటింగ్ అంటే ఆరున్నరకు నీటుగా డ్రెస్ చేసుకుని వచ్చేవాళ్ళు జీవితంలో ఎన్నటికీ కార్యకర్తలు కాలేరు. అంటే, నాయకులుగా రాణించలేరు.

ఉన్నత లక్ష్యాన్ని నిర్దేశించుకుని, అందుకు తగిన పథక రచన చేసుకుని, ఒక్కొక్కటే నిచ్చెన మెట్లెక్కుతూ ఉన్నత శిఖరాలకు చేరినప్పుడు, ఒక కార్యక్రమం దిగ్విజయంగా జరిగినప్పుడు మహదానందానుభూతిని పొందుతాడు నిజమైన కార్యకర్త.

ఎవరైనా కార్యకర్తగా రాణించాలంటే ఏం చెయ్యాలో మీ అనుభవం మీద చెప్పమని అడిగితే సుబ్బారావు చెప్పిన మాటలు ఇవి: “మొదట వీటిని చేయాలని కొన్ని ప్రాజెక్టులను అనుకోండి. అనుకుంటే చాలదు. కానీ అనుకోకపోతే సాధించేది కూడా ఏమీ ఉండదు. అందుకని మొదట అనుకోండి. ఆ అనుకొనేదేదో గట్టిగా అనుకోండి. తిరుగులేనంత గట్టిగా అనుకోండి. అనుకోవటంలోనే ఉంది సృష్టి రహస్యం అంతా. ఘనకార్యాలు చేయాలనే గట్టి తపన ఉన్నవాడికే ఈ అనుకోవటం అనేది సాధ్యపడ్తుంది” అని!

ఒక కార్యక్రమంకోసం తపించీ తపించీ ఒక తపస్సులా పని చేయగలిగితేనే ఆ కార్యక్రమంలో నాణ్యత కనిపిస్తుంది. అదే ‘కలలు’ కనడం అంటే. ‘కలలు కనే వాడే కార్యకర్త’ అనేది సుబ్బారావు నిర్వచనం. తను నిద్రపోడూ, పక్కవాడు నిద్రపోతే సహించడు.

1976లో మచిలీపట్టణంలో కృష్ణాజిల్లా రచయితల 4వ మహాసభలు జరుగు తున్నప్పుడు ఒకసారి ఇదే చర్చకి వచ్చింది. “కార్యకర్త నిద్రపోకూడదంటావు, కలలు

కనాలంటావు...రెంటికీ పొంతన ఎలా కుదుర్తుంది" అని అడిగారు శ్రీ విహారి.

ఆయన నాకు వత్తాసుగా వచ్చారన్నమాట. అప్పటికి నా వయసు 19 యేళ్ళుంటాయి.

దానికి సుబ్బారావు చెప్పిన సమాధానం నాకింకా గుర్తుంది... "నేను కనాలన్నవి నిద్రపోయి కనే కలలు కాదు, నిద్రపోనీకుండా చేసే కలల గురించి..." అని! నిజమే! అంత కార్యభారం నెత్తికెత్తుకున్నప్పుడు కార్యకర్తకు నిద్ర ఎలా వస్తుంది? అనితర సాధ్యంగా ఆ సభలు నడపాలనేది ప్రధాన కార్యదర్శిగా సుబ్బారావు కల. తను చాలా కలలు కంటాడు. ఆయన కలలనేవి అనితరసాధ్యం అన్నట్టుగా ఉంటాయి. అవి సాధ్యం చేయాలనేది ఆయన తపన.

కృష్ణాజిల్లా రచయితల సంఘం ఏర్పడ్డాక దాదాపు ఆరు సభలు నిర్వహించారు. రష్యా పతనం, తూర్పు యూరప్ పరిణామాల నేపథ్యంలో తెలుగు సాహిత్యంలో రావలసిన మార్పుల గురించి కూడా మహాసభలు నిర్వహించారు.

ఒక సాహితీ సంస్థ అనేది అనేకమంది రచయితలకు మార్గనిర్దేశం చేసేదిగా ఉండాలనేది ఆయన ఆలోచన. వాటికోసం ఆయన కలలు కనేవారు.

1975లో కృష్ణాజిల్లా రచయితల మహాసభలు చేయటం ఒక కల.

1978లో ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభలు చేయటం మరో కల.

1979లో స్పందనవాణి మాసపత్రిక నిర్వహించటం ఇంకో కల.

1981లో తెలుగు సాహితీ సంస్థల సమన్వయ సమాఖ్య వ్యవస్థాపన, 1982లో అవనిగడ్డలో కృష్ణాజిల్లా రచయితల 5వ మహాసభల నిర్వహణ, 1983లో కృష్ణాజిల్లా రచయితల సంఘం స్థాపన - ఇవన్నీ ఎన్నో కలల పర్యవసానాలే!

1978-79లలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీలో ఎన్నికలలో గెలిచి సభ్యత్వం పొందటం, ఆ తరువాత అకాడెమీలోని అవ్యవస్థ మీద బాణాలు ఎక్కుపెట్టి ఒక విప్లవ వీరుడిగా పోరాడటం, ఆనాటి యువ రచయితల దృష్టిలో ఒక యంగ్ & డైనమిక్ హీరోలా వెలగటం - ఇవన్నీ సుబ్బారావు సాకారం చేసుకున్న కలలే!

1995-2002 మధ్య కాలంలో సుబ్బారావు దృష్టి పూర్తిగా ట్రేడ్ యూనియన్ రంగం మీదకు మళ్ళింది.

2003లో స్వచ్ఛంద పదవీ విరమణ చేశాక తిరిగి సాహిత్య కార్యక్రమాలవైపు దృష్టి సారించారు.

2005లో కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని పునర్వ్యవస్థీకరించిన తరువాత సుబ్బారావులోని కార్యకర్త తన విశ్వరూపాన్ని ప్రదర్శించాడు.

అనితర సాధ్యం అనదగిన ఎన్నో కార్యక్రమాలకు ఆయన రూపకర్త, నిర్వాహకుడు. అనేక సందర్భాలలో కథ, మాటలు, పాటలు, దర్శకత్వం అన్నీ తానై వ్యవహరించాల్సి వచ్చింది కూడా

హైదరాబాదులో పోస్టల్ డిపార్ట్‌మెంటులో ఉద్యోగిగా ఉన్నరోజుల్లో సుబ్బారావు కార్యకర్తృత్వాన్ని ఆయన సాహితీ జీవితంలో మొదటి దశగా చెప్పుకోవచ్చు.

1971 నుండీ బందరు యల్ఐసీ ఉద్యోగంలో చేరిన నాటి నుండీ జరిగిన పరిణామాలు రెండవ దశ.

ఉద్యోగ విరమణానంతరం జరిగిన అంశాలన్నీ మూడవ దశగా చెప్పుకోవచ్చు.

మొదటిది పుడుతూనే పరిమళించిన దశ. గౌతమ బుద్ధుడు ఇల్లు వీడి సత్యాన్వేషణకోసం అవస్థలు పడటం లాంటిది.

రెండవది పువ్వు కాయై, కాయ పండైన దశ. ఇది బుద్ధుడు బుద్ధత్వం పొందిన దశలాంటిది.

మూడవది సుబ్బారావు జీవితంలో అత్యంత ముఖ్యమైన దశ. ఇది చెట్టు మహావృక్షమై విస్తరించిన దశ. బుద్ధుడు తన బోధనలతో విశ్వం అంతా వ్యాపించటం లాంటిది.

## తాత్త్విక చింతన - తార్కిక పోకడ

సాహిత్యపరమైన పరమ ప్రయోజనాన్ని ఆశించటం ఒక కల. తాత్వికార్థంలో చెప్పాలంటే, దాన్ని 'భావవాదం' అనవచ్చు. ఆ కలని నిజం చేయటానికి ఉద్యుక్తుడు కావటం అనుభవవాదం.

భావం అంటే ఊహ, కల్పన, పథక రచన ఇవన్నీనూ! అనుభవం అంటే, పరిశ్రమతో ఉద్యమాన్ని నిర్వహించటం! భావానుభవాలు సాహిత్యానికి రెండు కళ్ళు లాంటివి.

భావం బాహ్య ప్రాపంచిక స్థితిలోంచి పుడుతుంది.

అనుభవం ఉద్యమ కర్తలు సాధించి చూపిస్తేనే సాకారం అవుతుంది.

సాధారణ కార్యకర్త అనుభవంలో భాగస్వామి అవుతాడు. విశిష్ట కార్యకర్త 'భావంలో' కూడా భాగస్వామి అవుతాడు.

మామూలు కార్యకర్తకీ, సుబ్బారావుకీ తేడా ఇదే! సుబ్బారావుని అందుకోవాలంటే 'అనుభవం'లోంచి లోపలికి వెళ్లి, దాని మూలకమైన 'భావం' లోకి తొంగి చూడగలగాలి.

"చెట్టులోంచి విత్తులోకి రావటం అంటే ఇదే..." అని ఆయన అంటూన్నప్పుడు ఆయనలో ఒక తాత్వికుడు, తార్కికుడు కూడా కనిపిస్తారు.

ఒకసారి ఏదో మాటల్లో "నేను" గురించి చర్చ వచ్చింది. సుబ్బారావు " 'నేను' చావాల్సిందే" అన్నారు.

మళ్ళీ ఆయనే అందుకుని, "చావాలని నేను చెప్తున్నది 'వ్యక్తిగతమైన నేను' గురించి" అని వివరణ ఇచ్చారు. సమష్టి 'నేను' బతకాలంటే వ్యక్తిగత 'నేను' చావాలి. కార్యకర్త వ్యక్తిగత 'నేను' వదిలి, సమష్టి 'నేను'లో బతికే వాడుగా ఉండాలి" అన్నారు.

కార్యకర్తృత్వానికి కూడా ఒక గతి తార్కిక వాదాన్ని సుబ్బారావు ప్రతిపాదిస్తారు–

"మానవుడు సంఘ జీవి. సంఘం అనే మాటకు సరైన నిర్వచనం మనకు కావాలి. రచయితల సంఘం మానవ సంఘానికి భిన్నమైనదేమీ కాదు. సోక్రటీస్, బుద్ధుడు, మార్క్సు లాంటి తాత్వికులు జీవుణ్ణి సమష్టి సంపదగా భావించారు. వ్యక్తి మానవ సంఘానికి ఎంత బాధ్యుడో, కార్యకర్త తాను ప్రాతినిధ్యం వహించే సంఘానికి అంతే బాధ్యుడు... కార్యకర్తృత్వాన్ని తాత్వికంగా ఆలోచించకపోతే ఈ సభలు, సమావేశాలు, పుస్తకాలు ఇవన్నీ ఎందుకు చేస్తున్నామో మనకే తెలీకుండా పోతుంది. మామూలు మనుషులకు ఇదంతా పిచ్చి గోలలా అనిపిస్తుంది కూడా! మనం పిచ్చివాళ్ల స్వర్గంలో ఫూల్స్ ప్యారడైజ్‌లో విహరించకూడదు" అని!

కార్యకర్తృత్వం విషయంలో సుబ్బారావు తర్కం చాలా మంది ఆలోచనలకన్నా భిన్నమైందని అనుకుంటాను. ఒక సందర్భంలో ఆయన ఇచ్చిన వివరణ ఇలా ఉంది.

'నేను రచన చేస్తున్నాను' ఈ వాక్యంలో 'నేను' వ్యక్తిగతమైన నేను.

'నేను రచన ద్వారా సమాజాన్ని ప్రభావితం చేస్తున్నాను'–ఈ వాక్యంలో 'నేను' సమష్టికి సంబంధించిన నేను.

'నేను సమాజాన్ని బాగా చదివి అర్థం చేసుకోవటం ద్వారా రచన చేస్తున్నాను' ఈ వాక్యంలో "నేను" వ్యష్టి, సమష్టి కలిసిన అద్వైతం.

'నేను ఈ సమాజానికి బద్ధుడను కాను, అన్నింటికీ అతీతుణ్ణి, నా రచనలు నా సంతృప్తి కోసం, నా రచన 'రచన' కోసమే! సమాజంతో నిమిత్తం లేదు – ఇలాంటి

వాక్యాల్లో "నేను", "సమాజం" అనేవి వేర్వేరు అంశాలుగా ఉండిపోతాయి. ఈ రెంటికీ పొంతన లేదనుకోవటం 'ద్వైతం'.

అందరి కోసం 'నేను' అనే భావనని వదిలి తనచుట్టూ తానే పరిభ్రమించే వాళ్ళూ కార్యకర్తలుగా పనికిరారు. నన్నడిగితే రచయితగా కూడా పనికి రారు. అలాంటి వ్యక్తులకు సాహితీ సంస్థల్లో పెద్ద పీట వేయనవసరం లేదు..." అని సుబ్బారావు తన తాత్వికతకు ఒక నిర్వచనం ఇస్తారు.

"సమాజాన్ని ప్రభావితం చేయాలనుకునే వాడు స్వేచ్ఛను కోరతాడు. సమాజంతో నిమిత్తం లేనివాడు మోక్షం కోరతాడు" ఇలా వివరిస్తారాయన.

సమాజవాదులు, సామ్రాజ్యవాదులు, మతవాదులు రచయితల్లో అన్ని రకాలవాళ్ళూ ఉంటారు. కార్యకర్త అయిన వాళ్లలో కేవలం సామాజికవాది మాత్రమే ఉంటాడు. అతను స్వేచ్ఛను మాత్రమే కోరతాడు. రచయితల్లో ఎక్కువమంది మోక్షాన్ని కోరతారు.

సుబ్బారావు తాత్విక చింతన ఈ దిశలో సాగుతుంటుంది.

రచయితకన్నా పై స్థాయిలో ఆలోచించవలసిన వ్యక్తి కార్యకర్త. ఎందుకంటే ఉద్యమాలను నిర్వహించేది, ప్రచారంలోకి తెచ్చేదీ కార్యకర్తే కాబట్టి. కార్యకర్తకు తాత్విక చింతన మరింతగా ఉండాలంటారు సుబ్బారావు.

ఎందుకు ఈ సభలు పెడుతున్నట్టు...? ఎందుకు ఇన్నిన్ని పరిశోధనా గ్రంథాలు, పుస్తకాలు ప్రచురిస్తున్నట్టు...? ఎందుకు స్వంత వ్యాపకాలు, వ్యక్తిగత జీవితాలను పక్కన బెట్టి సాహిత్య కార్యక్రమాలలో లీనం అవుతున్నట్టు?

ఈ ప్రశ్నలకు తనకు తానే సమాధానం చెప్పుకోవాలి. ఆ సమాధానాలకొక తర్కం కావాలి. సుబ్బారావు తర్కం ఇది! సుబ్బారావు 'నేను' సమష్టి. అందులో వ్యక్తిగతం అనేదే ఉండదు.

ఆయన అనునిత్యం ఉద్యమ జీవి. సాహిత్య ఉద్యమాల కోసం నిలిచిన మనిషి కాబట్టి!

'నానృషిః కురుతే కావ్యం' అన్నారు. ఋషి కాని వాడు కావ్యాన్ని వ్రాయలేడు అని దాని భావం! సుబ్బారావు గారంటారు, 'ఋషి కాలేనివాడు కార్యకర్తృత్వం కూడా చేయలే'డని! వ్యక్తిగతంగా నా రచనలేవో నేను చేసుకుంటాను అనే దశనుండి, అంటే వ్యష్టి నుండి సాహిత్య కార్యకర్తగా ఎదగటం అంటే సమష్టిలోకి ప్రవహించటం అన్నమాట!

## కార్యకర్తలకు స్వేచ్ఛ

కొంతమంది ఉన్నతోద్యోగులు, పెద్ద పదవుల్లో ఉన్నవాళ్ళు, కొత్తగా ధనవంతులైన వాళ్ళు, చిల్లర దాతలు సాహిత్య సంస్థల్లో ప్రవేశించి భోజరాజు పాత్రనో, కృష్ణదేవరాయలు పాత్రనో పోషిస్తుంటారు. వీళ్ళ కర్రపెత్తనం ఒక్కోసారి ఇబ్బందికరంగా ఉంటుంది.

కార్యక్రమాల మీద ఉత్సాహం కొద్దీ పనిచేయటానికి ముందుకొచ్చిన కార్యకర్తలు అన్ని ఇతర పనులనూ వదిలి వీళ్ళ చుట్టూ తిరగటం సరిపోతుంది. వీళ్లకు చెప్పకుండా ఏమీ చేయటానికి వీలవదు, ఏదైనా చెప్పాలంటే వీళ్ళు దొరకరు. వీళ్ళలో కొంతమందికి సాయంత్రం అయ్యేసరికి భాష మారిపోతుంటుంది. వీళ్ళ వలన చివరికి ఏదీ సమయానికి జరక్కుండా పోతుంది. అలాంటి నేతలతో పనిచేయటం కార్యకర్తలకు ఇబ్బందే!

వీళ్ళు కార్యకర్తల ఉత్సాహం మీద నీళ్ళు చల్లి కార్యక్రమాల్లో రసాభాసకు కారణం అవుతుంటారు కూడా!

మోరల్ సపోర్ట్ అలాంటిది ఇచ్చి, ప్రోత్సహిస్తూ, పైనుండి మార్గదర్శకత్వం ఇచ్చే పెద్దలు సంస్థలో ఉన్నప్పుడు ఆ సంస్థ పక్షాన కార్యకర్తలు అద్భుతాలు చేయగలుగుతారు. కృష్ణాజిల్లా రచయితల సంఘం రథసారథులమధ్య అలాంటి అనుబంధం ఉంది కాబట్టే, సుబ్బారావు అధ్యక్షతన కార్యక్రమాలు ఉవ్వెత్తున జరిగాయి. ఈ హార్మోనీ అనేది ఏమాత్రం సడలినా సంస్థ కుంటుపడే ప్రమాదం ఉంటుంది.

సందర్భం వచ్చింది కాబట్టి ఒక విషయాన్ని ఇక్కడ స్పష్టంగా చెప్పుకోవాలి. గత పుష్కర కాలంగా శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారితో చెయ్యీ చెయ్యీ కలిపి సుబ్బారావు, ఆయనతో పాటు నేనూ వందల సంఖ్యలోనే కార్యక్రమాలు నిర్వహించాం. నిజం చెప్పాలంటే సాహిత్య కార్యక్రమాలే మా జీవితాలలో ప్రధానం అయ్యాయి. ఒక కార్యక్రమంలోంచి ఇంకో కార్యక్రమంలోకి దూకటం తప్ప మధ్యలో కాలు కిందకు పెట్టటానికి సమయం చిక్కని పరిస్థితి.

బుద్ధప్రసాద్ గారు ఆలోచన చెప్తారు. మేం కూడా మా ఆలోచనలు చెప్తాం. చర్చించుకుంటూ ఉండగానే కార్యక్రమం ఫైనలై పోతుంది. చూస్తుండగానే అది జరిగి పోతుంది.

విజయవాడ యస్.వీ.యస్ కళ్యాణమంటపంలో 2006లో జాతీయ సభలు




"బంభరాలు" ఆవిష్కరణ సభలో
శ్రీమతి లత, శ్రీ మండలి వెంకట కృష్ణారావు, డా॥ సి.నారాయణ రెడ్డి గార్లతో...

దిగ్విజయంగా చేశాం, చివరి రోజు భయంకర వాన. మచిలీపట్టణంలో రోడ్లమీద పడవలు వేసుకుని తిరిగారు, అంత వాన వచ్చిందా రోజున!

ఆ రాత్రి సభలు అయిపోయాక అందరూ వెళ్ళిపోయారు. బుద్ధప్రసాద్ గారూ, సుబ్బారావు, నేనూ, బుద్ధప్రసాద్ గారి సెక్యూరిటీ మాత్రమే వరండాలో నిల్చుని మాట్లాడుకుంటున్నాం.

"ఆంధ్రప్రదేశ్ అవతరణ జరిగి 50 యేళ్ళయిన సందర్భంగా మనం ఈ జాతీయ సభలు గొప్పగా చేశాం. 'తెలుగు పసిడి' ఉద్గ్రంథం తెచ్చాం. జనం బాగా వచ్చారు. అందరూ సంతోషించారు. వచ్చే ఏడాది 2007 భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి అరవైయేళ్ళయిన సందర్భం. దేశ వజ్రోత్సవాలు జరుగుతాయి. దాని గుర్తుగా మనం ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు చేద్దామా...? 'వజ్రభారతి' పుస్తకం తెద్దాం. అది ఆంధ్రప్రదేశ్ దర్శినిలా ఉండాలి" అన్నారు బుద్ధప్రసాద్ గారు.

వాన తుంపర్లు మా మీద పడ్తున్నాయి. తడిసి ముద్దయి పోయాం. చలిగా ఉంది. బుద్ధప్రసాద్ గారు ప్రపంచ సభలు అనగానే ఆ చలీ గిలీ మాయమై పోయి, నూట నాలుగు డిగ్రీల జ్వరం వచ్చినట్టయ్యింది.

"చేయగలమా?" అని మళ్ళీ బుద్ధప్రసాదుగారే అడిగారు.

"డిఫికల్ట్, బట్ నాట్ ఇంపాజిబుల్" అన్నారు సుబ్బారావు.

నాయకుడు అలా బుద్ధప్రసాద్ గారిలా ఉన్నప్పుడు, సుబ్బారావు లాంటి ముఖ్య కార్యకర్తలకు స్వేఛ్ఛ ఉంటుంది కాబట్టి, అసాధ్యాన్ని సుసాధ్యం చేయగలుగుతారు.

పరస్పర అవగాహన ఉన్న వ్యక్తులు కలిసి ఒక ఐక్యతా భావంతో పనిచేస్తే అనాయాసంగాను సునాయాసంగానూ, అవలీలగానూ విజయాన్ని సాధించవచ్చునని చెప్పటానికే ఈ ఉదంతాన్ని ఇక్కడ ప్రస్తావించటం.




విజయవాడ లయన్స్ క్లబ్ కార్యక్రమంలో (1988)
శ్రీ నండూరి రామమోహనరావు, శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ,
డా॥ జి.వి. పూర్ణచంద్‌లతో...

## రచయితా? కార్యకర్తా? ఎవరు గొప్ప???

నిజానికి ఇది పిచ్చి ప్రశ్నలా కనిపిస్తుంది. దీనికి సమాధానాన్ని నేను చాలామంది రచయితలను అడిగాను.

కొద్ది మంది మాత్రం సాహిత్యోద్యమాలన్నీ కార్యకర్తలైన రచయితలు నిర్మించినవే ననీ, రచయితలు ఆ ఉద్యమ వరవడిలో వ్రాస్తారనీ అన్నారు.

నా దృష్టిలో అది అక్షర సత్యం.

"కార్యకర్త రచయిత అవునా కాదా అనేది కార్యక్రమానికి సంబంధించినంత వరకూ అప్రస్తుతం. కార్యక్రమం వరకూ కార్యకర్త తాను రచయితనన్న సంగతి మరిచి పోయి పని చేయాలి. అలా పనిచేయ గలిగితేనే కార్యకర్తగా ఉండాలి. లేకపోతే ఇతర రచయితల్లాగా సాహితీవేత్త ముద్ర వేసుకుని సభలో కూర్చోవాలి" అంటారు సుబ్బారావు.

ఆయన దృష్టిలో రచయితకన్నా కార్యకర్త గొప్పవాడు. ఎందుకని అడిగాను.

"రచయిత తాను వ్యక్తిగత లబ్ది కోసం వ్రాస్తాడు. వ్రాయటం అనే పని వలన వ్యక్తిగతంగా అతడు లేక ఆమె నష్టపోయే దేమీ ఉండదు. కానీ, కార్యకర్తకు అలా కుదరదు. వ్యక్తిగతాన్ని, వ్యక్తి-గతాన్ని, త్యాగం చేయగలగాలి" అని సమాధానం ఇచ్చారు.

కుందుర్తి ఒకచోట అంటారు - "రచయిత పాఠకుడికన్నా పై అంతస్తులో ఉన్నాననుకునే రచన చేయాలి" అన్నారు. సుబ్బారావు అంటారూ..."కార్యకర్త కూడా రచయితను గౌరవిస్తూనే, రచయిత కన్నా పై అంతస్తులో ఉన్నాననుకుని కార్యక్రమాలు నిర్వహించాలి" అని!

అవును! అలా అనుకోకపోతే గొప్ప సభలు నిర్వహించటం కష్టం అవుతుంది.

"రచయిత, కార్యకర్త ఇద్దరూ సాహితీవేత్తలే! కార్యకర్తలో రచయితతో పాటు కర్తృత్వం చేసే మరో శక్తి అదనంగా ఉంటుంది. అందుకని, కార్యకర్తే ఎక్కువ" అనేది సుబ్బారావు తీర్పు.

"కవిని గౌరవించు..."అని నారాయణరెడ్డి అంటారు.

"కార్యకర్తను గౌరవించు" అని సుబ్బారావు గారంటారు.

రచయిత, కార్యకర్త ఇద్దరూ సమానమేనని మీరనవచ్చు. సుబ్బారావు మీ అభిప్రాయంతో ఏకీభవిస్తూనే "రచయిత కన్నా కార్యకర్త ఎక్కువ సమానం" అంటారు.

"పూర్ణచందూ! నువ్వు అర్థం చేసుకో, గిడుగువారు కార్యకర్తగా పనిచేయకపోతే భాషోద్యమం నడిచేదే కాదు. నడిమింటి వారిగురించి అనుకుంటాను, మన పెద్దవాళ్ళు చెప్తారు... 'నేను బతికున్నంతకాలం నిర్వాహకుణ్ణి, పోయేప్పుడు కూడా నిర్వాహకుణ్ణే...' అన్నారని.

ఒక మహా రచయిత పోతే ఆయన ఇంటిముందు కోలాహలం ఒక సాహితీ కార్యకర్తపోయినప్పుడు అతని ఇంటిముందు ఉంటుందా? నిర్వాహకుడుగా.. మోసేవాళు ళ్ళ లేని పరిస్థితి ఉండవచ్చు.

ఎందరు రచయితల్ని మోసీమోసీ వాళ్లను గొప్పవాళ్ళుగా చేసి ఉంటాడూ...... కార్యకర్త!

కానీ, చాలామంది రచయితలు పేరొచ్చాక ఆ విషయాన్నే మరిచిపోయినట్టు ప్రవర్తిస్తారు. ఇదే సృష్టి విచిత్రం" అని నాకు జ్ఞానబోధన చేశారు సుబ్బారావు.

సుబ్బారావు ఆ మాటలు అంటున్నప్పుడు ఆయన కళ్లలో నీళ్ళు తిరిగాయి.

సుబ్బారావు గారన్నమాటల్లో కొన్ని సాక్ష్యాలు చూపించగలను.

మినీ కవిత ప్రారంభం రోజుల్లో దాన్ని భుజాన వేసుకుని ఊరూరా ప్రచారం చేస్తూ, యువతరాన్ని మినీకవితవైపు ఆకర్షితు లయ్యేలా చేయటంలో కొంతమంది వ్యక్తులు ప్రధాన పాత్ర పోషించారు.

శ్రీయుతులు సుబ్బారావు, అద్దేపల్లి, రావిరంగారావు, నేనూ, కొల్లూరి, అలిశెట్టి ప్రభాకర్ ఇలా మాలాంటి వాళ్ళం, అంతా రచయితలమూ, కార్యకర్తలం కూడా!

కార్యకర్తలైన రచయితలం అంటే ఇంకా బావుంటుంది.

ఉద్యమ నిర్మాణ నిర్వహణ కార్యకర్తలైన రచయితల వలన సాగింది కాబట్టి మినీ కవిత అనతి కాలంలోనే జనాదరణ పొంది, ఒక రూపపరమైన మార్పుకు దోహదపడింది.

ఆ తరువాత వచ్చిన హైకూలు, నానీలు, రెక్కల్లాంటి లఘు కవితా ప్రక్రియలకు మినీ కవిత ఆధ్యక్షం వహించింది. ప్రక్రియపరంగా హైకూ, నానీ, రెక్కల్లాంటివి వేర్వేరు అయినప్పటికీ, రూపపరంగా 'మినీకవిత' సాధించిన నవీనతని ఈ ప్రక్రియలు నేటికీ కొనసాగిస్తున్నాయి. ఇప్పుడు తెలుగు కవిత లఘురూపి!

తెలుగు భాషోద్యమం కూడా అంతే! సాధారణ రచయితలుగానీ, విద్యాలయాలలో తెలుగు మీద ఆధారపడి జీవిస్తున్న వారుగానీ ఈ ఉద్యమంలో భాగ

స్వాములైన వారు బహుకొద్దిమంది. బుద్ధప్రసాద్, ఆచార్య లక్ష్మీప్రసాద్, సుబ్బారావు, నేనూ, డా. సామల రమేష్ బాబు...ఇలా కార్యకర్తలే భాషోద్యమాన్ని నడిపారు.

కలిసి వచ్చిన భాషావేత్త లెందరినో కలుపుకుంటూ ప్రాచీనతా హోదా సాధించారు. అందరి సమష్టి కృషి ఇది.

"ఎందరో ఔత్సాహికులైన మీ వంటి రచయితలు ముందుకొచ్చి తెలుగు భాష కోసం నిరంతర శ్రామికుల్లా పనిచేశారు. మీరంతా భాషా సత్యాగ్రహులు, మీ వలనే భాషోద్యమం విజయవంతమైంది" అని బుద్ధప్రసాద్ గారు 2008 నవంబరు 1న జరిగిన ప్రాచీనతాహోదా విజయోత్సవ సభలో అన్నారు.

ప్రాచీనతా ఫలాలు అందుకుని భాషా పరిశోధనలు కొనసాగించవలసిన బాధ్యత విశ్వవిద్యాలయాలది! 2008లో మనకు ప్రాచీనతా హోదా ప్రకటన వస్తే గత ఐదేళ్ళుగా లక్షల రూపాయలు నిధులు వస్తుంటే ఏ విశ్వవిద్యాలయమూ సరిగా వినియోగించుకోని కారణంగా వెనక్కి పోతున్నాయన్న సంగతి విన్నప్పుడు బాధ కలుగుతుంది.

కార్యకర్త లేకుండా ఏదీ విజయవంతం కాదని దీని భావం. ఆచార్యులు, భాషావేత్తలు కూడా కార్యకర్తలుగా మారాలి. మారితేనే భాషకు మేలు జరుగుతుంది.

"ఒక మహారచయితకన్నా ఒక సాహిత్య సంస్థ, దాని నిర్వాహకులైన కార్యకర్తలే గొప్ప. ఒక పోతుకూచి సాంబశివరావు, ఒక వంగపల్లి విశ్వనాథం, ఒక విహారి, ఒక గుత్తికొండ సుబ్బారావు, ఒక జానమద్ది హనుమచ్ఛాస్త్రి, ఒక కాళీపట్నం రామారావు లాంటి మహానుభావులు ఎంత రచయితలో అంతటి కార్యకర్తలు.

రచయితలుగా కన్నా కార్యకర్తలుగా వారు ఎక్కువ సాధించినవారు కూడా!

స్వీయ సాహిత్య సేవని అలా ఉంచితే వీరిలో ఒక్కొక్కరు ఒక్కొక్క రచయితల కార్ఖానాగా మారి ఎంతమంది చేత ఎన్ని రచనలు చేయించారన్నది చరిత్ర.

బంగారు పళ్ళానికి గోడ చేర్పు లాంటి వాడు కార్యకర్త.

నా "తరతరాల తెలుగు రుచులు" పుస్తకాన్ని సుబ్బారావుకు అంకితం ఇస్తూ, మాబోటి రచయితలం అంతా ఒకరు కూర, ఒకరు పప్పు, ఒకరు స్వీటూ, ఒకరు హాటూ లాంటివాళ్ళం ఈ వంటకాలన్నింటినీ వడ్డించాల్సిన విస్తరి మా సుబ్బారావని వ్రాసుకున్నాను.

రచయిత రుచికరమైన వంటకం అయితే, కార్యకర్త దాన్ని తినేందుకు ఉపయోగించే పళ్ళెం లాంటివాడు.

## తలవంచని వ్యక్తిత్వం

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి సభ్యుడిగా ఎన్నికైన తరువాత అకాడెమీలో యువ రచయితల పట్ల, ఆధునిక సాహిత్య ప్రక్రియల పట్ల తరచూ కనిపించే వ్యతిరేక ధోరణిమీద బాణాలు ఎక్కుపెట్టడం మొదలు పెట్టారు.

అదే సమయంలో కార్యవర్గంలోంచి శ్రీ పురిపండా అప్పలస్వామి పదవీ విరమణ జరగటంతో ఆ పదవి ఖాళీ అయ్యింది. ఆయన స్థానంలో ఒక ప్రముఖుణ్ణి నామినేట్ చేయటానికి గోపాలరెడ్డి సిద్ధపడ్డారు.

అకాడెమీ పుట్టిన నాటి నుండీ అదే ఆనవాయితీ. సిద్ధాంత రీత్యా అలా కుదరదనీ, ఆ ఖాళీకి చట్టప్రకారం ఎన్నికలు జరపాలనీ సుబ్బారావు ఎదిరించారు.

ఆ రోజుల్లో గోపాలరెడ్డికి ఎదురు చెప్పటం సాహసమే!

"వెయ్యిమంది సైనికులకు భయపడను గానీ ఒక్క అకాడెమీ సభ్యుడికి భయపడతాను...అన్నాడు నెపోలియన్ తెలుసా?" అని ఒక సభ్యుడు ఆ మీటింగులోనే ఎద్దేవా చేశాడు. "పిల్లకాకివి, నీకేం తెలుసు ఉండేలు దెబ్బ" అనటం ఆయన



కృష్ణాజిల్లా న్యూ మాన్యువల్ కమిటీ సమావేశంలో
ఆనాటి మునిసిపల్ కార్పొరేషన్ కమిషనర్ శ్రీమతి ఉషారాణి ఐ.ఏ.ఎస్.,
ఆనాటి కృష్ణా జిల్లా కలెక్టర్ శ్రీ ప్రభాకర్ రెడ్డి ఐ.ఏ.ఎస్., తదితరులతో...

ఉద్దేశం. సుబ్బారావు అప్పట్లో 35 యేళ్ళ యువకుడు. సన్నగా నాజూగ్గా ఉండేవాడు. ఇతనికి గోపాలరెడ్డిగారిని ఎదిరించేంత సీను లేదని ఆయన నమ్మకం.

"ఎన్నిక జరపటానికి ఇదేమైనా పంచాయితీ బోర్డు అనుకున్నారా? పెద్దవాళ్ళ సభ. ఇక్కడ అలాంటి రాజకీయ వాతావరణం ఉండకూడదు. ఏం వద్దండీ, మీరే ఎవరినో ఒకరిని నామినేట్ చేసేయండి సార్!" అని గోపాలరెడ్డిగారికి ఎక్కువమంది మద్దతుగా బ్లాంక్ చెక్కు ఇచ్చేశారు అని ఎక్కువమంది అభిప్రాయపడ్డారు.

"అకాడెమీలో సాధారణ సభ్యుడిగా నేను ఎన్నికల్లో పోటీ చేసి గెలిచే వచ్చాను. అక్కడ లేని రాజకీయం ఇక్కడ ఎలా వుంటుంది...? కార్యవర్గంలో ఖాళీకి ఎన్నికలు ప్రకటించండి" అని అడిగారు సుబ్బారావు.

"పోటీ చేసే దమ్ములెవరికి ఉన్నాయి...?" అని ఎకసెక్కంగా నవ్వాడింకో సభ్యుడు.

"దమ్ములు నాకున్నాయి. నేనే పోటీ చేస్తాను" అన్నారు సుబ్బారావు.

వెంటనే కళాప్రపూర్ణ తెన్నేటి హేమలత లేచి, "సుబ్బారావు పేరు నేను ప్రతిపాదిస్తున్నాను" అని ప్రకటించింది.

అరక్షణం ఆలస్యం చేయకుండా డా. కొర్రపాటి గంగాధరరావు లేచి "నేను సపోర్ట్ చేస్తున్నాను" అన్నారు.

లత అప్పట్లో అకాడెమీ ఉపాధ్యక్షురాలిగా ఉండేది. గంగాధర రావు సాధారణ సభ్యుడిగా ఉండేవారు. ఇదంతా అప్పటికప్పుడు ఊహాతీతంగా జరిగిపోయింది.

దేవులపల్లి రామానుజరావు నిర్ఘాంత పోయారు. గోపాలరెడ్డి మౌనం వహించారు.

సుబ్బారావు మీద గోపాలరెడ్డి తాను ప్రతిపాదించ దలచిన అభ్యర్థిని పోటీకి పెట్టక తప్పలేదు.

అకాడెమీ చరిత్రలో తొలిసారిగా ఒకే ఒక కార్యవర్గ సభ్యుని పదవికి ఎన్నిక అనివార్యం అయ్యింది.

ఎన్నికల తతంగం హోరాహోరీగానే జరిగింది. పట్టాభి ఓటమి నా ఓటమి అని ప్రకటించి, గాంధీగారు, డా. భోగరాజు పట్టాభి సీతారామయ్య తరపున ప్రచారం చేసినట్టు, గోపాలరెడ్డిగారు తన అభ్యర్థి కోసం తన పలుకుబడి వినియోగించ వలసి వచ్చింది కూడా! కానీ అక్కడ చివరికి గెలుపు నేతాజీదే అయినట్టు, ఇక్కడ సుబ్బారావుగారే మంచి మెజారిటీతో గెలిచారు.

ఆనాటి నుండీ అకాడెమీలో లొసుగులమీద పోరాటం ప్రారంభించారు

సుబ్బారావు. ఆధునిక సాహిత్యానికీ, వచన కవితకూ సమాన ప్రోత్సాహం ఇచ్చే పరిస్థితిని అకాడెమీలో తెచ్చారు.

1981-82లో డా. బెజవాడ గోపాలరెడ్డి అకాడెమీ సభ్యత్వంలోంచి రిటైరైన సందర్భంగా వీడ్కోలు సభ జరిగింది. ఆ సభలో ప్రసంగించిన వక్తలంతా గోపాలరెడ్డి గురించి బాగా మాట్లాడారు. సుబ్బారావు కూడా ఆయన వ్యక్తిత్వాన్ని ప్రస్తుతించి, తాను చాలాసార్లు ఆయనతో ఘర్షణ పడవలసి వచ్చిందనీ, అయినా అయన పెద్దమనసుతో స్వీకరించి తనను పోత్సహించారే తప్ప, ఆగ్రహించలేదని అన్నారు.

అప్పుడు గోపాలరెడ్డిగారన్నారు:

"సుబ్బారావూ! నువ్వు నాతో పోట్లాడింది నీ కోసం కాదు. జనం కోసం. నీతోటి రచయితల కోసం, ప్రతిఒక్కరూ తమకోసం ఏదో ఒకటి వచ్చి నన్నడిగిన వారే! నువ్వు నీకోసం ఏదీ అడగలేదు. అందుకే నువ్వు నాకు నచ్చావు" అన్నారు. వాళ్ళిద్దరిదీ తాతా మనవళ్ళ బంధం. ఆనాడు సుబ్బారావుని వ్యతిరేకించిన దేవులపల్లి రామానుజరావుగారే చివరికి అకాడెమీ పనితీరు మెరుగుపరచటానికి సుబ్బారావుగారితో ఒక 'సింగిల్‌మాన్' కమిటీ వేశారు. సుబ్బారావుగారి నివేదికని ఈ పుస్తకం అనుబంధంలో ప్రచురిస్తున్నాం.




"అమరిన శృంగారం" ఆవిష్కరణ సభలో

శ్రీ టి.ఎల్. కాంతారావు గార్లతో..

## మహాసభలంటే ఏమిటీ?

"న సా సభాయత్ర నా భాతి కశ్చిత్" అంటూ ఓ సంస్కృత శ్లోకం ప్రారంభం అవుతుంది. దాని భావం ఇది: "ఒక మహాసభలో జ్ఞానవంతుడు అనేవాడు ఒక్కడు కూడా లేకపోతే, ఇసకేస్తే రాలనంతమంది, నేల ఈనిందా అన్నట్టు కుప్పలు కుప్పలుగా మానవరాశి ఉన్నప్పటికీ, అది సభ అనిపించుకోదు. ఒకరిద్దరున్నా అది సభ అవబోదు. సభలో ఉన్నవాళ్ళంతా జ్ఞానవంతు లైనప్పుడు ఒకరి నొకరిని ప్రభావితుల్ని చేస్తూ, ఒకరివలన ఒకరు ప్రకాస్తి పొందే సభ ఏదో అదే మహాసభ అనిపించుకుంటుంది. అలాంటి సభకు నమస్కరిస్తున్నాను" అంటుంది ఈ శ్లోకం.

జ్ఞానమూర్తులైన వాళ్ళు పదిమంది ఉన్నా అది గొప్ప సభే. సభలో ఎంతమంది ఉన్నారన్నది కాదు, ఎలాంటి వాళ్ళు ఉన్నారన్నది ముఖ్యం అని ఈ శ్లోకం చెప్తోంది. చాలామందికి ఈ శ్లోకం తాత్పర్యం బోధపడదు. సభతోనూ, సభ జరుగుతున్న అంశం తోనూ సంబంధం లేని వాళ్లు వందల సంఖ్యలో ఉన్నప్పటికీ దాన్ని సభ అనవచ్చేమోగానీ, సాహిత్య సభ అనటానికి వీల్లేదు. సభ సాహిత్య సభ ఎప్పుడౌతుందంటే అది సాహితీవేత్తల కూటమిగా ఉన్నప్పుడు మాత్రమే!

"జనసామాన్యం ఎక్కువ అవసరం అయిన రాజకీయ సభలు చాలా ఉంటాయి. అక్కడ ప్రసంగాంశాలతో నిమిత్తం ఉందదు. పుట్టలు బ్రద్దలైనట్టు జనం రాజకీయ నాయకులకు అవసరం. సాహిత్యానికి ఆ అవసరం లేదు.

అరసికులకు సంగీతం వినిపించే దుర్గతి నాకు పట్టించవద్దని కాళిదాసు వేడు కున్నాడు ఇందుకే! సినిమా పాటలు వినటానికి వచ్చే జన సందోహమూ, సంగీత కచ్చేరీ వినటానికి వచ్చే కళాభిమానులూ ఒక్కరు కాలేరు.

సాహిత్య సభల కార్యకర్తలు ఈ విషయాన్ని గుర్తించాలి" అంటారు సుబ్బారావు.

కాలక్షేపానికి వచ్చి కాసేపు కూర్చుని వెళ్ళేవారి కోసం వినోద కార్యక్రమాలు, సందేశ కార్యక్రమాలు, ప్రచార కార్యక్రమాలు అనువుగా ఉంటాయి. అలాంటి సభలు ధర్మాన్ని ప్రబోధించ గలవేమోగానీ, ధర్మాన్ని చర్చించి నిగ్గు తేల్చలేవు. అలాగని ఇద్దరో ముగ్గురో మేధావులు కూర్చుని చర్చించి సాధించ గలిగేది కూడా ఉండదు.

సుబ్బారావు సభలన్నీ మేధావుల కూటములే! అవి భారీగా ఉంటాయి. ఆ మేధావులు దూర సుదూర ప్రాంతాల నుండి తరలి వచ్చిన వాళ్ళు. భాషకోసం, సాహిత్యం కోసం, సంస్కృతి కోసం ఏమైనా చేయాలని దీక్ష పూనిన వాళ్ళు...! వాళ్లలో అధిక సంఖ్యాకులు సాహిత్య సంబంధీకులు, ఉద్యమ స్ఫూర్తి కలిగిన వాళ్ళు, నలుగురిని

ప్రభావితం చేయగలిగిన వాళ్ళుగా ఉంటారు. వాళ్ళవలన సభ ప్రభావితం అయి, తన ప్రయోజనాన్ని పొందగలుగుతుంది.

సుబ్బారావు పాఠాలలో 'సభా నిర్వహణ' అంటే మొదటగా గుర్తుంచుకోవాల్సిన విషయం "ఏ అంశం మీద సభను జరుపుతున్నామో ఆ విషయానికి సంబంధించిన మేథావులు ఎక్కువమంది ఉండేలా చూడాలి" అని!

ఈ మధ్య చూస్తున్నాము... చాలా గ్రంథావిష్కరణ సభల్లో హాలులోపల సాహిత్యేతర వ్యక్తులు ఎక్కువగా ఉంటారు. రచయిత తన పెన్షను డబ్బులో, లేకపోతే బ్యాంకు అప్పులో ఖర్చు పెట్టి తన రచన అచ్చు వేసుకుంటాడు. అనేక వేలు వెచ్చించి పుస్తకావిష్కరణ సభ పెడ్తాడు. ఆ అచ్చువేసిన పుస్తకాలను ఆ సభలో ఉచితంగా పంచుకుంటున్నాడు.

పుస్తకాన్ని ఉచితంగా పుచ్చుకున్న వ్యక్తుల్లో ఆ పుస్తకాన్ని తెరిచి చూసేవారు బహుకొద్దిమందే ఉంటారు. చదవని వారికి పుస్తకాన్ని ఇవ్వటం జాతీయ వృధా అవుతుంది. రచయిత ఆత్మ సంతృప్తి కోసం తప్ప ఆ సభ సాధించిన ప్రయోజనం ఏమీ ఉండటంలేదు.

సుబ్బారావు ఇలాంటి సభలకు కడు వ్యతిరేకి. ఒక విధంగా ఆ రచయితకు కూడా ఇది గౌరవప్రదమైన విషయం ఏమీ కాదు. సభ అంటే సన్మాన సభ, బిరుదు ప్రదాన సభ, పురస్కార సభలే ఎక్కువగా జరుగుతాయి. బేరసారాలతో కూడిన ఇలాంటి సభలు సభాగౌరవాన్ని దిగజారుస్తున్నాయి కూడా.




ద్వానా శాస్త్రి గారి పుస్తకం ఆవిష్కరణ సభలో శ్రీ మండలి బుద్ధ ప్రసాద్, శ్రీ ద్వానా శాస్త్రి, శ్రీ రావూరి భరద్వాజ, శ్రీ వి.సిమ్మన్న ప్రభృతులతో...

## సభా నిర్వహణాచాతుర్యం

సభా నిర్వహణ అనేది కత్తిమీది సాములాగా, అసిధారావ్రతంగా చేపట్టాలంటారు సుబ్బారావు.

సభకు లక్ష్య నిర్దేశం మొదట జరగాలి. ఆ లక్ష్యం చిన్నదిగా కాకుండా బృహత్తరంగా ఉండాలి. అది నెరవేరేందుకు కావాల్సిన వేదికను ఎంచుకోవాలి.

ముచ్చటైన ఆహ్వాన పత్రిక రూపకల్పన జరగాలి. అవి సంబంధిత వ్యక్తులకు సకాలంలో అందేలా చూడాలి. ఒకప్పుడంటే అవకాశం ఉండేది కాదు గానీ, ఇప్పుడు సెల్ఫోన్ల యుగంలో సమాచారం అందించటం చాలా సులువయ్యింది.

మెయిల్సు ద్వారా ఆహ్వానాన్ని పంపినా, ఆత్మీయంగా ఫోను చేసి పిలిస్తే మూడొంతుల మంది తప్పకుండా ప్రతిస్పందిస్తారు.

సభాంశం ఉత్సాహభరితం అయినప్పుడు ఆ అంశానికి చెందిన వ్యక్తులకు సభలో ఎక్కువ ప్రాధాన్యత కల్పించాలి. అతిథుల ఎంపికలో గానీ, ఆహ్వానితుల ఎంపికలో గానీ సమీకరణాలన్నింటినీ పాటించాలి. కొంత హోమ్‌వర్క్ చేస్తేనే ఇవన్నీ సాధ్యం అవుతాయి.

సుబ్బారావు ఆహ్వానం పత్రం వ్రాయించే పద్ధతి గమ్మత్తుగా ఉంటుంది. ఆహ్వానంలో లైను తరువాత లైను ఎలా అచ్చవుతాయో అలా పాదాలను వ్రాయించేవారు. లెటరుప్రెస్ రోజుల్లో కరెక్షన్లు చేయాలంటే కష్టంగా ఉండేది కాబట్టి, స్క్రిప్టు ఇచ్చేప్పుడే జాగ్రత్తలన్నీ తీసుకునే వాడాయన. ఆహ్వానం అచ్చుకిచ్చిన తరువాత కార్యక్రమంలో గానీ, తేదీలలో గానీ, ప్రసంగాంశాల్లో గానీ, వక్తల్లో గానీ మార్పులు చేయటానికి ఆయన ఇష్టపడేవారు కాదు.

2007లో కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు ఏర్పాట్లు ముమ్మరంగా జరుగుతున్నాయి. తేదీలు దగ్గరపడుతున్నాయి. ఆహ్వాన పత్రిక అచ్చుకాలేదు. స్పాన్సర్లు తేలకపోవటం, అందవలసినంత డబ్బు అందక పోవటం, ముఖ్యమైన వ్యక్తులు తమ రాకను నిర్ధారించకపోవటం లాంటి ఇబ్బందులు కలిగాయి.

వెంటనే సుబ్బారావు, శ్రీ బుద్ధప్రసాదు, పద్మశ్రీ లక్ష్మీ ప్రసాదు గార్లకి ఫోను చేసి, "అరకొర సమాచారంతో ఆహ్వానాలు వేయించటం వద్దు, ఒక నెలరోజులు పాటు సభలు వాయిదా వేద్దాం, పూర్తి సమాచారంతోనే సభలు చేద్దాం" అన్నారు.

ఆ ఇద్దరూ పెద్దమనసుతో అంగీకరించటం వలన వాయిదా తరువాత అనితర సాధ్యంగా తొలి ప్రపంచ మహాసభలు నిర్వహించ గలిగాము.

నిర్ణయాలు తీసుకునేప్పుడు సుబ్బారావు చాలా పట్టుదలతో ఉంటారు. సభ జరిగినంత సేపూ దీక్షలో ఉన్నట్టే ఉంటారు. చాలామంది తెల్సిన వాళ్ళు ఆ సమయంలో ఆయన్ని పలకరించరు కూడా!

ఏ నిర్ణయాన్నైనా ఒక సమష్టి సూత్రం ఆధారంగానే ఎవరైనా తీసుకోవాల్సిందే! ఆ సమష్టి సూత్రాన్ని కాదని చేయగలిగేది కూడా ఉండదు.

అలా చేయాలనుకుంటే అది తిరోగమనమే అవుతుంది.

సాహిత్య సంస్థల్లో నానాత్వ భిన్నత్వాలు ఎక్కువగా ఉంటాయి. సాహితీ సంస్థలద్వారా వెలుగులోకి రావాలని చూసే వారి సంఖ్య ఎక్కువగా ఉంటుంది.

ఒకసారి ఒక రచయిత "కృష్ణాజిల్లా రచయితల సంఘంలో చేరాలనుకుంటూన్నానండీ, చేరితే లాభం ఏమిటండీ?" అని సుబ్బారావుని అడిగారు.

దానికి ఆయన నిర్మొహమాటంగా చెప్పిన సమాధానం ఇది:

"లాభం ఏమీ ఉండదండీ... భారీ కార్యక్రమాలు జరుగుతుంటాయి. వాటి కోసం కార్యకర్తగా మీ కొంత సమయాన్ని, మీ కొంత మేథాశక్తినీ, మీ కొంత జేబు డబ్బునీ ఖర్చు పెట్టవలసి వస్తుంది. రచయితల సంఘాల్లో సభ్యత్వం అనేది మీరు కార్యకర్తగా పనిచేయటానికే గానీ, మీకు ఎవరో ప్రయోజనాలు చేకూర్చి పెట్టడానికి కాదు"

సుబ్బారావు సమాధానాలెప్పుడు ఇలా నిర్మొహమాటంగా, కత్తితో కోసినట్టుగా ఉంటాయి.

కానీ, ఆయన మాటల్లో నిజాయితీ అవతలి వ్యక్తిని ఆకట్టుకుంటుంది.

ఇలా చెప్తే సుబ్బారావుకి రచయితలంటే గౌరవం లేదని అర్థం కాదు. సుబ్బారావు గురుస్థానం ఇచ్చి గౌరవం ఇచ్చిందీ, పురస్కారాలిచ్చి గౌరవించిందీ కార్యకర్త మనస్తత్వం ఉన్న రచయితలను మాత్రమే! ప్రభుత్వ సంస్థలు, అకాడెమీలు, డబ్బు తీసుకుని సన్మానాలు చేసే సంస్థలు తక్కిన రచయితల్ని గుర్తిస్తాయి. కార్యకర్తృత్వం ఎరిగిన రచయితల లోని ప్రతిభను సాహిత్య సంస్థలు గుర్తించాలంటారు సుబ్బారావు

సుబ్బారావు తరచూ చెప్పే ఒక సత్య వాక్యాన్ని ఇక్కడ తప్పకుండా ఉదహరించాలి:

"సభలు పెట్టడం అంటే ఆహ్వానాలు వేయటం, పోస్టు చేయటం, మీటింగు పెట్టడం ఇంత మాత్రమే అనుకునే వారు అంతకన్నా గొప్ప పనులు చేయటానికి సాహసించలేరు.

'సాహిత్య ప్రయోజనం' ఎంత ముఖ్యమో 'సభాప్రయోజనం' కూడా అంతే ముఖ్యం. నలుగురు గుమికూడే ప్రతిచోటా సభలు చేసి సందేశాలను ప్రచారం చేయవచ్చు. కానీ, సాహిత్య సభలు పెట్టకూడదు.

సాహిత్య సభ అంటే ధర్మాన్ని చర్చించే సభ, ఆ సభకు ఆహ్వానించబడిన అధికారులూ, యమ్మెల్యేలూ, మంత్రులను బట్టి కాక, ఆ సభకు విచ్చేసిన సభాసదుల స్థాయిని బట్టి సభ ఔన్నత్యం తూకం వేయబడుతుంది.

సభకు సభాసదుల నాణ్యత ముఖ్యం. ఎందుకంటే చెప్పేవారికీ వినేవారికీ సిద్ధాంత ఐక్యత ఏర్పడినప్పుడు కలిగే మానసిక తాదాత్మ్యత ఆ సభ విజయానికి ఒక గుర్తుగా మిగులుతుంది".



శ్రీ మండల బుద్ధ ప్రసాద్, శ్రీ పూర్ణచంద్‌లతో
కార్యక్రమ నిర్వహణా విజయాన్ని ఆనందిస్తూ...

## వ్యూహ రచన

కొన్ని అంతర్జాతీయ సేవా సంస్థలు మీ కొంత సమయాన్ని, మీ కొంత మేథా శక్తిని, మీ కొంచెం ధనాన్ని వెచ్చించి సమాజ సేవ చేయాలని సూచిస్తుంటాయి. సుబ్బారావుకి ఈ వ్యాఖ్యతో పూర్తి ఏకీభావం లేదు. కొంచెం త్యాగం వలన సంస్థలకు, సాహిత్యానికి, సమాజానికి ఒరిగేదేమీ ఉండదు. లోకం అంతా సుబ్బారావు లాగా సర్వసంగ పరుత్యాగులు కాలేకపోవచ్చు. కానీ నిబద్ధత అనేది ముఖ్యం కదా! కార్యకర్త అనిపించుకోదలచిన వ్యక్తి కొంచెం కొంచెం సేవాభాగ్యం వలన కలిగించే ప్రయోజనం ఏమీ ఉండదు.

ఎప్పుడో ఒకసారి హలో చెప్పి వెళ్ళి పోయేవాడు స్నేహానికి ఎలా పనికి రాడో, అలాగే చిన్న చిన్న కార్యక్రమాలకు పరిమితమై, అప్పుడప్పుడూ మేమూ ఉన్నామని దర్శనం ఇచ్చే సంస్థల వలన కూడా సాహిత్య ప్రయోజనం నేరవేరేది తక్కువ.

సంస్థల ద్వారా సాహిత్య ప్రయోజనాన్ని పూర్తిగా అర్థం చేసుకోగలిగిన సుబ్బారావు ఆలోచన, అంతటి మరో కార్యకర్తకే అర్థం అవుతుంది.

ఆయన్ని అర్థం చేసుకోలేని వ్యక్తులు ఆయన అవసరానికి మించి కష్టపడ్తున్నట్టు, కష్టపెడ్తున్నట్టు అనుకుంటారు. కానీ ఇక్కడ తెలుసుకోవాల్సిన సూత్రం ఒకటి ఉంది. ఇదీ సుబ్బారావు కొటేషనే:

"వర్క్ ఈజ్ ఏ వర్షిప్ అనుకునేవాడికి ప్రతీదీ సులభంగానే సాధ్యపడ్తుంది. వర్క్ ఈజ్ ఏ బర్డెన్ అనుకునే వాడికి ప్రతీదీ తనకు మించిన, తలకు మించిన భారంగానే కనిపిస్తుంది. ఈ అవగాహన ఉంటేనే నువ్వు కార్యకర్తగా నిలబడగలుగుతావు" అంటారాయన..

సుబ్బారావుగారొక సారి ఓ కథ చెప్పారు: "ప్రతీ కార్యకర్తలోనూ ఒక సైతాన్ ఉంటాడు. వాడి పనేమిటంటే 'ఇది నీవలన అయ్యేపనికాదు, నీ శక్తికి మించింది, ఇలాంటివి చేపడితే నువ్వు మునిగి పోతావు. నీతో ఎవరూ కలిసిరారు...' ఇలా ఆ సైతాన్ కార్యకర్తని అన్నిట్లోను వెనక్కి లాగాలని చూస్తుంది. దాని మాటకు తలొగ్గామా కార్యకర్తృత్వం అనేది గాలికెగిరిపోతుంది" అని!

ఆయన ఏది చెప్పినా దాంట్లో లాజిక్ ఉంటుంది.

"కార్యకర్తగా మనల్ని అంకితమై పనిచేయనీయకుండా, వెనక్కి లాగే అంశాలు

కొన్ని ఉన్నాయి. వాటి విషయంలో జాగ్రత్తగా ఉండాలి" అంటూ ఆయన చెప్పిన హెచ్చరికలివీ...

1. ఇల్లు, ఇల్లాలు, పిల్లలు సంసార జంజాటం,
2. వృత్తి వ్యాపారాల కోసం సమయం తగినంత వెచ్చించలేపోతున్నాననే బాధ,
3. కార్యక్రమాలకోసం కాలం వృధా చేస్తున్నాననే బెరుకు,
4. ఇంట్లో వాళ్ళ సహకారం తగ్గిపోవటం, వాళ్ల తిట్లూ శాపనార్థాలు,
5. కార్యక్రమాలకు స్పాన్సర్లనుండి, దాతలనుండి సహకారం లేక పోవటం,
6. పని చేసేందుకు ఆరోగ్యం సహకరించకపోవటం,
7. ఎంతచేసినా పెద్దలైన వాళ్లనుండి మెప్పు లేకపోవటం, వ్యంగ్య వ్యాఖ్యానాలు ఇవన్నీ కార్యకర్తలోని సైతాన్ మన బుర్రలో ఏకరువు పెడుతుంటాడు. ఆ సైతాన్ని తరిమేసేయ గలవాడు మాత్రమే కార్యకర్తగా నిలబడగలుగుతాడు. గత 40 యేళ్ళుగా వ్యక్తిగతంగా నా మట్టుకు నేను వందలాది సంస్థల్ని, వాటి కార్యకర్తల్ని ఎరుగుదును. కానీ, వాటిలో వ్రేళ్ళ మీద లెక్కబెట్టగలిగినవే మిగిలి ఉన్నాయి. దానికి కారణం కార్యకర్తల కొరతే! కార్యకర్తల్ని సైతాన్ మింగేస్తే జరిగేది ఇదే!"అంటారు సుబ్బారావు.

"మీరు మంచి కార్యకర్త. గొప్ప కార్యక్రమం చేశారు. సంతోషం. దానివలన బదులుగా మీరు ఆశించే ప్రయోజనం ఏమిటీ?" అని ఎవరైనా అడిగితే సుబ్బారావు ఇలా చెప్తారు:

"ఏం ఆశిస్తాం?? ఆశించేందుకు ఏమీ లేదు, కేవలం ఆదరపూర్వకమైన పలకరింపు తప్ప!" అని.

"ఏ లాభం లేకుండా ఎందుకు చేస్తాడులే! ఏదో ఉండే ఉంటుంది" అనేవాళ్ళను చాలామందిని విన్నాము.

అలాంటి వాళ్ళు సాహితీ సంఘాలకు శత్రువులే! ఏదో కొంచెం చేసి ఎక్కువ పదవిని ఆశించే వాళ్ళు ఎంత ప్రమాదమో, ఏదో ఒక స్వార్థ ప్రయోజనాన్ని అంటగట్టేవాళ్ళు కూడా అంతే ప్రమాదకరం.

## కార్యనిర్వహణా దక్షత పెరగాలంటే?

ఒక మంచి కార్యకర్తగా కార్యనిర్వహణలో మెళకువలు తెలుసుకుని దీక్షాదక్షులుగా రాణించటానికి సుబ్బారావు మాకు చెప్పిన పాఠాలు ఇలా ఉండేవి.

1. కార్యకర్తగా రాణించాలనే ఒక బలమైన రగిలే కోరిక మీలో ఉన్నదా అని మొదట మిమ్మల్ని మీరు ప్రశ్నించుకోండి.
2. అద్భుతమైన కార్యకర్త అనిపించుకోవాలని తపన పడండి.
3. పనిలోనే పరమాత్మ ఉన్నాడని భావించండి. నిచ్చెనెక్కి బ్యానర్లు కట్టడం, కుర్చీలు సర్దటం, కుర్చీలు, బల్లలు తుడవటం లాంటివి చేయటానికి నామోషి లేకుండా పనిచేయండి. అదే వర్క్ ఈజ్ వర్షిప్పంటే!
4. ఆత్మవిశ్వాసం పెంచుకోండి. మీ ప్రతిమాట, మీ ప్రతి చేత ఒకే తీరులో ఉండాలి.
5. సభ్యులందరికీ సమాచారాన్ని సకాలంలో, సమర్థవంతంగా అందేలా చూడండి. ఆధునిక సాంకేతిక ఉపకరణాల ద్వారా యస్సెమ్మెసులూ, మెయిల్సూ పంపినా సరే, ఫోను చేసి సగౌరవంగా ఆహ్వానించటాన్ని అశ్రద్ధ చేయకండి. సభకు



అమెరికాలోని న్యూజెర్సీ రాష్ట్ర అసెంబ్లీ డిప్యూటీ స్పీకర్
శ్రీ చివుకుల ఉపేంద్ర గారిని సత్కరిస్తూ...

నమస్కారం అంటున్నాం కదా! సభాసదులు ఉన్నప్పుడే అది సభ అవుతుంది. ఆ సభాసదుల్ని సగౌరవంగా అహ్వానించండి. జనంతో నిమిత్తం లేకుండా, సంబంధీకులు లేకుండా జరిపే సభలు సభలు కావు. అవి నెరవేర్చే ప్రయోజనం తక్కువ.

6. ఎక్కువ మందికి హాజరయ్యేందుకు అవకాశం ఉన్న సమయంలోనే సభలు జరపండి.
7. ఎప్పుడో నాలుగైదు నెలల తరువాత జరిగే కార్యక్రమానికి ఇప్పుడే ప్రణాళిక వేసుకోండి. plan ahead అంటారు దీన్నే! హడావిడిగా జరిపే సభలు నిస్సారంగా ఉంటాయి.
8. కార్యక్రమానికి స్వంత డబ్బు ఖర్చు పెడుతున్నా సరే జమా ఖర్చులు వ్రాసి ఉంచండి.
9. చిన్న కార్యక్రమమే అయినా బడ్జెట్ వేసుకోవటం అలవాటు చేసుకోండి.
10. సంస్థ పేరుతో అప్పులు అట్టేపెట్టకండి.
11. ఎన్నిసార్లు పిలిచినా హాజరు కాని సభ్యులగురించి ప్రత్యేక శ్రద్ధ తీసుకోండి. సాహిత్య సభల్లో సభ్యులు, మామూలు సందర్శకులు ఇలాంటి తేడాలేమీ వుండవు. మన సభలకు వచ్చి, మనతో సహకరించేవాళ్లంతా మన సభ్యులే!
12. అర్ధరాత్రి దాటే దాకానూ, మధ్యాహ్నం రెండు దాటే దాకానూ సభలను సుదీర్ఘంగా కొనసాగించకండి. కాలాన్ని వక్తలు అతిక్రమిస్తుంటే హెచ్చరించి సమయపాలనకు పూనుకోండి.
13. సభలకోసం ఆసక్తిదాయకమైన అంశాలను ఎంచుకోండి. అంశం కోసం వచ్చేవారి సంఖ్య ఎక్కువగా ఉంటుంది.
14. పెద్ద సభల్లో కవిసమ్మేళనాలు, వినోద కార్యక్రమాలు కూడా జోడించండి. సభ శ్రోతలు, ప్రేక్షకులకు పరిమితం కాకుండా జాగ్రత్త పడండి. సభను భాగస్వామ్యం చేసినట్టౌతుంది.
15. మంచి సభావాతావరణం కలిగించాలి. వ్యక్తుల్లో మీటింగ్ కల్చర్ని పెంపొందించాలి. సభలు ఆ దిశలో జరగాలి.

సుబ్బారావుతో కూర్చుని ఒక మంచి సభకు ప్లాన్ చేయటం చాలా ఉత్సాహంగా ఉంటుంది. ఆయన ఆలోచనలన్నీ గతి తార్కికంగా ఉంటాయి.

ఎదుటివాడు చెప్పేదాంట్లో విషయం ఉంటే ఆయన తప్పకుండా అంగీకరిస్తారు. ఊకదంపుడుగా ఉంటే ముఖానే ఖండిస్తా రాయన.

మొదటి ప్రపంచ మహాసభలు జరిగేప్పుడు సభానిర్వహణా బాధ్యతలను డా. ద్వా.నా. శాస్త్రి, ఆచార్య వెలమల శిమ్మన్న గార్లకు అప్పగిస్తూ సుబ్బారావు అన్న మాట గొప్పది:

"కార్యనిర్వహణా దక్షత అంటే ప్రతీదీ మన కనుసన్నల్లో జరగటం కాదు, అక్కడ ముఖ్య కార్యకర్త లేకపోయినా సభ నిరాఘాటంగా జరిగేలా పథక రచన చేయాలి. ప్లానింగే ముఖ్యం. అది సజావుగా ఉన్నప్పుడు ముఖ్య కార్యకర్తకు సభ లోపల పని ఉండకూడదు. అందుకని, నేనుగానీ, పూర్ణచందుగానీ మీకు వేదిక పైనో వేదిక ఎదురుగానో కనిపించం. మీకు సహాయకులు ఎవరు కావాలో ముందే నిర్ణయించుకుని తీసుకోండి. సమయపాలన నిర్మొహమాటంగా చేయండి" అంటూ ఆ బాధ్యతలను వాళ్ళిద్దరికీ అప్పగించారు.

ప్రపంచ సభలు మూడింట్లో కూడా ఆరువేల ఫోటోలుంటే నావీ, సుబ్బారావువీ ఐదో ఆరో ఫోటోలు వెదికితే దొరుకుతాయి. ఏ కార్యకర్త ఎక్కువ ఫోటోల్లో కనిపించాడో ఆయన ఆ సభల్లో పనిచెయ్యనట్టే లెక్క అని తీర్మానిస్తారు సుబ్బారావు.

సుబ్బారావు ఒక వెయ్యి కార్యక్రమాలు నిర్వహించి ఉంటారు. పదివేల ఫోటోలు కనీసంలో కనీసం ఉండి ఉండాలి. కానీ వాటిలో ఆయన ఉన్న ఫోటోలు వందకూడా దొరకలేదు. సుబ్బారావు పనితీరుని చెప్పటానికి సాక్ష్యాలు, నిరూపణలూ కావాలా?

సుబ్బారావు కఠిన నియమాలు అలా ఉంటాయి. ఆయన నిషేధించే మరో ముఖ్యాంశం ఉంది: కార్యకర్త కార్యక్రమంలో ఎట్టి పరిస్థితుల్లోనూ శ్రోత/ప్రేక్షకుడు కారాదనేది ఆయన నియమం.

ప్రపంచ సభల సమయంలో ఇలాంటి ఇబ్బందులు మాకు చాలా ఎదురయ్యాయి. కార్యకర్తలందరూ హాల్లోనే ఉన్నారు. ఆ మహా జనసంద్రంలో ఎవరు ఎక్కడ ఉన్నారో తెలీలేదు. కార్యకర్త సభలోనో వేదికమీదో కూర్చుంటే, రైల్లో వచ్చిన అతిథిని రూముకి తీసుకెళ్ళి దింపేదెవరు? హోటల్ నుండి హాలుకు తోడ్కొని వచ్చేదెవరు? కార్యకర్త దృష్టి ప్రసంగాల మీదో, అతిథుల మీదో కాక పని మీద ఉండాలంటారాయన. అందుకు ఇష్టపడితేనే కార్యకర్తగా ఉండాలి. పాపం కొత్తగా

వచ్చే కార్యకర్తలకు అది ఇబ్బందిగా ఉండొచ్చు, కానీ కార్యకర్తగా రాణించాలంటే ఈ నియమం పాటించాలి.

సభకు వచ్చిన కొందరు వక్తలు తాము మాట్లాడింది ఎలా ఉందని అభిప్రాయం అడుగుతుంటారు. మొహమాటానికి బావుందని చెప్తుంటాం, మీ ప్రసంగం వినలేదని చెప్తే బావుండదని! వింటూ కూర్చుని పని మానేయటమే నేరం.

ఒకసారి సభలో ఎవరో పెన్నడిగితే నా జేబులోది ఇచ్చాను. అదే సమయంలో సుబ్బారావు నన్ను పిలిచి, తర్వాత సదస్సు ఎజెండా రాసివ్వమన్నారు. నేను పెన్నుకోసం వెదుక్కొని, పెన్ను లేకుండా సభకు వచ్చినందుకు సుబ్బారావుతో గట్టి తిట్లే తినాల్సి వచ్చింది.

ఎన్ని తిట్లు తిని ఇంతవాళ్లం అయ్యామంటారూ...?

కార్యకర్తల బాధ్యతలు వడ్డించిన విస్తరిలా ఉండవు. చేతులు కాల్చుకుని కార్యకర్త వండి వడ్డిస్తాడు. విందు మాత్రం సభాసదులకే!

కార్యనిర్వహణాదక్షుడికి రాగద్వేషాలుండవు. సభ జరిగే అంశాన్ని బట్టి, ఆయా రంగాలలో నిష్ణాతుల్ని ఎంచుకుని వారిని వక్తలుగా ఆహ్వానిస్తాం మనం. ఒక్కోసారి దీని ప్రభావం కార్యకర్తలమీద వ్యక్తిగతంగా పడుతుంది.

చాలా మంది కొత్తగా వ్రాస్తున్న రచయితల్లో గతంలో లేని వింత లక్షణాలు కనిపిస్తున్నాయి. వెయ్యి నించి పాతిక వేలు దాకా వసూలు చేసి అంతర్జాతీయ పురస్కారాలు, గౌరవ డాక్టరేట్లు ఇచ్చే సంస్థలు పెరిగి పోయాక ఈ మధ్య చాలామంది తాము వ్రాసిన దాన్ని గురించి కాక, తమకు వచ్చిన అవార్డులగురించి మాత్రమే మాట్లాడటం ఎక్కువయ్యింది.

ఎక్కడ ఏ సభ జరిగినా వీళ్ళ తాకిడి ఎక్కువయ్యింది. కొంతమంది సీనియర్ రచయితలు కూడా సభలకు సభాసదులుగా వచ్చి సర్దాగా తోటి రచయితలతో కలిసి గడపవచ్చనే భావన తగ్గిపోయింది. తాము ఆ స్థాయిని దాటిపోయామని స్వయంగా మాతో చాలామంది అన్నవాళ్ళున్నారు. కొత్తగా చెప్పే సరుకు లేనివాళ్లను వేదిక ఎక్కించవలసిన అవసరం లేదనేది సుబ్బారావు గీత.

ఒక సభ జరిపితే పదిమంది కొత్త మిత్రులు వస్తే, పదిహేను మంది పాత మిత్రులు స్నేహాన్ని వదులుకుంటూ ఉంటారు. ఇది మాకు సర్వ సామాన్యమైన విషయమే!

ఇలా అంకుశంగా (నిరంకుశం కాని నియంత్రణ) ఉండటం వలన కార్యక్రమం దేదీప్యమానం అవుతుంది. అక్కడికది సంతోషమే! కానీ, అందువలన మా మిత్రుల జాబితా మైనస్'లో పడుతుంది. అయినా సుబ్బారావు 'డోంట్ కేర్' అంటాడు.

"అలా మనల్ని భయపెట్టే సైతాన్ని నీలోంచి తరిమేయ్-డ్రైవ్ ది డెవిల్ ఔట్" అని అరుస్తాడు.

నిజంగా ప్రతిభ ఉండి లోకానికి తొలిసారిగా సుబ్బారావు ద్వారా పరిచయం అయిన రచయితలెందరో ఉన్నారు.. డా. ద్వానాశాస్త్రి, శ్రీమతి డి సుజాతాదేవి, డా. రాధేయ లాంటి ఎందరో ప్రసిద్ధులు ఈ విషయాన్ని తమ పుస్తకాల్లో ప్రకటించారు కూడా!

అలాంటి మిత్రుల్ని సంపాదించుకో గలిగినందుకు గర్వించాలంటాడాయన.

కార్యక్రమాల నిర్వహణ విషయంలో సుబ్బారావుది కృష్ణ సారధ్యంలా ఉంటుంది. ఎవరి డ్యూటీలు వాళ్ళు చేసేలా చూడటమే కృష్ణ సారధ్యం అంటే. ఎందుకూ ఏమిటీ అని అడక్కుండా చెప్పింది చేయాలన్నాడు కృష్ణుడు. Do your Duty...Duty First అంటాడు. మీ పనులు మీరు చేసుకోండి... నేను పైనించి చూస్తూ ఉంటాను అంటాడు. అదే కార్యదక్షత అంటే.

ఒక ఆఫీసులో ఆఫీసరు, ఒక కార్యాలయంలో సి ఈ వో, ఒక ప్రభుత్వంలో ముఖ్యమంత్రి, ఒక కార్యక్రమంలో ముఖ్యకార్యకర్త ఇలానే పని చేయాలి. డెలిగేషన్ ఆఫ్ వర్క్ అండ్ అథారిటీ అనేది కార్యక్రమ విజయానికి చాలా అవసరం. అది సుబ్బారావుకి చేతనైనంతగా చాలామందికి చేతకాదు.

2007లో మొదటి ప్రపంచ తెలుగురచయితల మహాసభలు జరుపుతున్నప్పుడు జాతీయ కవి సమ్మేళనం జరిపాం. అందులో దూర ప్రాంతాలనుండి వచ్చిన ఒకరిద్దరు కవులను పక్కకు పిలిచి చార్జీల వరకూ ఇచ్చారు సుబ్బారావు.

అది విజయవాడ స్థానికుడైన ఓ కవి కంటపడింది. తనకు డబ్బులివ్వలేదనీ, వేరెవ్వరికో ఇచ్చారనీ సభలోనే అల్లరి చేయటానికి ప్రయత్నించా రాయన. ఇది బాధ కలిగించిన విషయమే! ఎందుకంటే సిట్టింగ్ ఫీజులు ఇస్తామని ముందు చెప్పి పిలిచిన సభ కాదది!

ఆ విషయాన్ని పరిష్కరించాక, సుబ్బారావు మమ్మల్ని పిలిచి చెప్పారు:

"రచయితల్లో కార్యకర్త మనస్తత్వం లేనివాళ్ళు సభల నిర్వహణకు పెద్దగా ఉపయోగపడరు. వాళ్ళలో చాలామంది ఊరికే వచ్చి సభలో కూర్చోవటానికి కూడా పెద్దగా ఇష్టపడరు. అగ్రాసనం వేస్తే వచ్చి కూర్చుంటారు. తమ పాండిత్యం ఏదో తాము ప్రదర్శించి వెడతారు. సాహిత్యం – సామాజిక ప్రయోజనం లాంటి విషయాలు తమ కేమీ పట్టనట్టే ఉంటారు. వచ్చినందుకు కూర్చున్న రుసుము (sitting charges) అడిగే వారూ ఉంటారు. వీళ్ళకు సాహిత్య సంస్థలంటే సరైన అవగాహన లేకపోవటం ఇందుకు కారణం. వాళ్లని క్షమించి వదిలేయండి" అన్నారు.

ఇది విమర్శ కోసం కాదు గానీ, కొంతమంది రచయితల్లో సాహితీ సంస్థలు నిర్వహించే వారంటే, రచనా సామర్థ్యం లేని వాళ్లనే చిన్న చూపు ఏ కారణం చేతో ఉంది. అంచేత, మగపెళ్ళివారి మర్యాదలను వాళ్ళు ఆశిస్తారు.

పూర్వం రోజుల్లో జమీందారుల ఆదరణ ఉండేది కాబట్టి, వాళ్ళు చలువ పందిళ్ళు కప్పి ఐదు రోజుల పెళ్ళి మాదిరి సభలు నిర్వహించేవాళ్ళు. ఇవ్వాళ ఆ జమీందార్లను తలదన్నేంత ధనికులున్నారు గానీ, వాళ్లకు అంత సీను లేదు.

సాహిత్యానికి ఖర్చు పెట్టేవాళ్ళు తక్కువ. అందుమూలాన మర్యాదలను ఆశించే వాళ్లకు పెద్ద పీట వేయాల్సిన అవసరం లేదని సుబ్బారావు నిశ్చితాభిప్రాయం.

"సాహితీ సంస్థని విమానం టిక్కెట్టు ఇవ్వమని అడిగే వాడు సభకొచ్చి సామాన్యుడి కవిత్వ ప్రయోజనాల గురించి మనకు ఉద్బోధిస్తానంటే ఎలా ఒప్పుకుంటాం...?" అని కరాఖండిగా చెప్పేస్తాడు. బెజవాడలో 'రసభారతి'లాంటి సంస్థలు ఆహ్వానితులందరికీ ఎంతోకొంత పారితోషికం ఇచ్చే ఆచారంపాటిస్తున్నారు. కానీ, ఆ కొద్దిమొత్తం కోసమే ఆ సంస్థ నిర్వాహకులు అనేక మంది దాతల్ని ఆశ్రయించవలసి వస్తోన్న సంగతి మరిచిపోకూడదు. కార్యకర్త రచయితకన్నా మహానుభావుడయ్యేది ఇక్కడే!

కార్యకర్తల నడవడి

అందుకే "ఏ రచయితల సంఘంలోనైనా ఎవరైనా సభ్యులుగా చేరాలంటే పని చేయటానికి ఉత్సాహం ఉంటేనే చేరండి. పనులు మీకెవరూ పిలిచి చెప్పరు. మీకై మీరే స్వచ్ఛందంగా వచ్చి భాగస్వాములు కండి" అని చెప్తారు సుబ్బారావు.

కార్యకర్తల క్కూడా "ఐచ్ఛికంగా ముందుకువచ్చి సహకరించే వాళ్ళకే పని అప్పగించండి. బలవంతంగా అసైన్‌మెంట్లివ్వకండి. పని చెడుతుందే తప్ప ఉపయోగం ఉండదు" అని హెచ్చరిస్తారు.

నా మటుకు నన్ను చాలా సార్లు హెచ్చరించారు "ఎవరో వస్తారని ఏదో చేస్తారని ఎదురు చూడకు. వచ్చారా సంతోషం, రాకపోయినా నువ్వొక్కడివే చేయటానికి సిద్ధంగా ఉండు. నీ శక్తి ఎంతో అంతే కార్యభారాన్ని ఎంచుకో! ఇష్టపడి ఎంచుకో... ఎంచుకున్నందుకు సంతోషంగా చెయ్యి. అంతే!" అని!

పని రాక్షసుడు కాని వాడు కార్యకర్త కాలేడన్నది నిజం.

సంస్థల్లో కొందరు అధికారులు లేదా డబ్బున్నవాళ్ళు, లేదా నోరున్నవాళ్ళూ కర్రపెత్తనం చేస్తుంటారు.




ఒంగోలు కళామిత్రమండలి వారి సత్కారం స్వీకరిస్తూ...

కార్యకర్త దృష్టి కార్యక్రమం మీద ఉంటుంది. అది చెడకూడదని ఈ కర్రపెత్తందారుని కార్యకర్తలు అప్పుడప్పుడూ భరించాల్సి వస్తుంది. కార్యకర్తలకు కొండంత సహనం అవసరం కూడా!

కార్యక్రమానికి ప్రాధాన్యం ఇచ్చి, అవమానాలను దిగమింగే స్వభావం ఉన్నవాళ్ళే నిజమైన కార్యకర్తలు కాగలుగుతారు.

గుత్తికొండ సుబ్బారావు స్పందన సాహితీ సమాఖ్యకు, కృష్ణాజిల్లా రచయితల సంఘానికీ కార్యదర్శిగానూ, అధ్యక్షునిగానూ వ్యవహరించారు. ఫ్రీవర్స్ ఫ్రంట్ సంస్థకు కార్యదర్శిగా పనిచేశారు.

ఆయన పని తీరుని చూసినప్పుడు ఆయనలో కార్యదర్శి, అధ్యక్షుడూ ఇద్దరూ కనిపిస్తారు. ఇతర సంస్థల్లో ఉన్నట్టు అధ్యక్షుడు, కార్యదర్శి, కోశాధికారి ఇలా ఎవరి డ్యూటీలు వాళ్లకు ఉన్నప్పటికీ కార్యకర్త అన్నింటినీ సమన్వయం చేసుకోగలిగినవాడుగా ఉండాలి.

అలాంటి కార్యకర్తలు ముగ్గురు నలుగురు ఉంటే ఏ సంస్థ అయినా అద్భుతాలు చేయగలుగుతుంది.

కార్యకర్తల నడకమీదే సంస్థ నడక ఆధారపడి ఉంటుంది. సంస్థ లేకపోతే కార్యకర్త లేడన్నది ఎంత నిజమో, కార్యకర్త లేకపోతే సంస్థ కూడా లేనిదే అవుతుంది. సంస్థలో అధ్యక్షుడు రథసారధి పాత్ర వహిస్తే, కార్యదర్శి అర్జునుడి పాత్ర నిర్వహిస్తాడు. సభ్యులు ధర్మరాజాది ఇతర పాత్రల్లో కనిపిస్తారు. అందరూ కలసిన కూటమి 'సాహితీ సంస్థ'.

దాని వ్యవస్థాపన నుండీ పదికాలాలపాటు నడిచేలా తగిన జాగ్రత్తలు తీసుకొంటూ కొనసాగించటమే కార్యకర్తల బాధ్యత.

సాహిత్య సభలు సంస్థ అస్తిత్వానికి నిదర్శనాలు. కేవలం సభలు పెట్టడంతో సరి పుచ్చుకుంటే సంస్థ సాధించే ప్రయోజనం అతి స్వల్పం.

సాహితీ సంస్థ సమాజం మీద ప్రభావాన్ని కనబరిచే స్థాయిలో పనిచేయాలి. అందుకు కావలసిన కార్యక్రమాలకు పథక రచన చేసుకోగలగాలి. ప్రజలు ఈ సంస్థ కావాలని, దాన్ని నిలుపుకునేందుకు ముందుకువచ్చే స్థితిలోకి సంస్థను తీసుకు వెళ్ళాలి. అదీ కార్యకర్తకు అంతిమ లక్ష్యం.

స్వాగతం చెప్పటం, వందనసమర్పణ చేయటం లాంటి చిన్నచిన్న బాధ్యతలతో సరిపెట్టుకుంటే కార్యకర్తలో ఎదుగుదల ఉండదు.

ఈ మధ్య వందన సమర్పణ అనేది ఒక పెద్ద ప్రహసనంలా తయారయ్యింది. కొందరు వందన సమర్పకులు ప్రధాన వక్తల్ని మించి ఉపన్యాసం దంచేవారిగా బాధిస్తుంటారు.

వందన సమర్పణ పూర్తికాకుండానే సభాసదులు కుర్చీల్లోంచి లేచి వెళ్ళిపోతున్నారు. అందుకని ఆ కృత్ఞతలేవో పలుసార్లు ఏదో ఒక విధంగా చెప్తూనే ఉంటాం కాబట్టి, ఈ వందన సమర్పణ అనే అంశాన్ని సాధారణ సమావేశాల్లో పాటించ నవసరం లేదనే సుబ్బారావు చాలా సభల్లో చెప్పారు.

అలాగే గ్రంథావిష్కరణ సభల్లో అసలు ఆవిష్కర్తతో పాటు అందరూ తలా ఒక పుస్తకం పుచ్చుకుని నుంచుంటే ఆవిష్కర్త అనామకంగా మిగిలిపోతున్నాడు. అందుకని ఒక్క కాపీనే 'దూముడి' వేసి తేలికగా అవిష్కరించే విధంగా ఏర్పాటు చేయాలని సూచిస్తుంటారాయన.

తిలకాష్ట మహిష బంధనం లాగా అనేక తాళ్లతో అనేక కాయితాలతో పుస్తకాలను కట్టగా కట్టి ఆవిష్కరణకు తెస్తుంటారు. ఆవిష్కర్త ఆ పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్నాడో బహిష్కరిస్తున్నాడో అర్థం కాని దృశ్యం ఆ కాసేపు స్టేజీ మీద ప్రదర్శితం అవుతుంది.

ఇలాంటి సంఘటనలు సభను నవ్వులపాలు చేస్తాయి, సభా నిర్వాహకులు కొంత మారాల్సిన అవసరం ఉంది.

సంస్థలకు కొందరు చిన్నపాటి విరాళాలిచ్చి ముఖ్య అతిథి, జ్యోతి ప్రకాశనం లాంటి బాధ్యతలు పుచ్చుకుని పేపర్లో పడాలని చూస్తారు.

పత్రికల వాళ్ళు కూడా చాలా సందర్భాల్లో అసలు కార్యకర్తల్ని విస్మరించి ఇలాంటి చిల్లర దాతలకే ప్రాధాన్యత నివ్వటాన్ని మనం గమనిస్తున్నాం. తనిచ్చిన ఆ స్వల్ప విరాళంతోనే ఆ కార్యక్రమం అంతా జరిగిపోయిందనే భ్రమలో ఆ దాత కూడా ఉంటాడు. అందుకే, కార్యకర్తలు ఇలాంటి దాతల విషయంలో జాగ్రత్తగా వ్యవహరించాలని చెప్తుంటారు. కార్యక్రమం మీద గౌరవంతో కాక, తన పేరు పేపర్లో పడటం కోసం దానం ఇచ్చేవాళ్ళ దగ్గర, తీసుకోకుండా ఉండటమే మంచిదని ఆయన సలహా ఇస్తుంటారు.

ఒక పెద్దావిడ ఇలాగే కృష్ణాజిల్లా రచయితల సంఘం కార్యాలయానికి వచ్చి, 'తెలుగు పసిడి' పుస్తకంలో తన వ్యాసం ప్రచురిస్తే 5,000 డొనేషన్ ఇస్తానని బేరం పెట్టారామె.

ఇలాంటి వాళ్లను చూసినప్పుడు సుబ్బారావు నిజంగానే కోపం అణచుకోలేరు. నేను పక్కనే ఉన్నాను కాబట్టి, ఏదో జోకు వేసి సంభాషణను మళ్ళించాలని చూశాను. ఆవిడ మళ్ళీ తన డిమాండును చెప్పారు.

అప్పుడు సుబ్బారావు అన్నారు:

"డబ్బులు తీసుకుని కవిత్వం అచ్చు వేయటం, డబ్బులు తీసుకుని సన్మానాలు చేయటం లాంటివి చేసే సంస్థలను వ్యాపార సంస్థలనే పిలుస్తారు. అవి సాహిత్య సంస్థలు కావు. ఏ సాహిత్య సంస్థ అయినా అలాంటి పని చేస్తే వాళ్ళని క్షమించకూడదు. రచయిత దగ్గర డబ్బు పుచ్చుకునే వాణ్ణి దళారిగానే భావించాలి. కాబట్టి, మీ డొనేషన్ కోసం మీ రచన వేయటం సాధ్యం కాదు. ఇంక మీ రచన ప్రచురణకు యోగ్యమైంది కాదని ఎడిటోరియల్ కమిటీ తిరస్కరించింది. కాబట్టి, ప్రచురించటమూ సాధ్యం కాదు" అని చెప్పారు.

ఆవిడ ముఖం చిన్నపుచ్చుకున్నారు. అది నాకూ బాధాకరమే! కానీ, ఆవిడ చిన్నపుచ్చుకోవాల్సింది సుబ్బారావు అన్నందుకు కాదు, ఒక రచయితల సంఘంతో ఆమె అలా మాట్లాడినందుకు ఫీలై ఉండాలి.



శ్రీకాకుళంలో శ్రీకృష్ణ దేవరాయల వారి విగ్రహం వద్ద
శ్రీ శీలా వీర్రాజు గారితో...

## అధ్యక్ష-కార్యదర్శులు

అధ్యక్షుడు, కార్యదర్శి ఇద్దరూ భట్టి-విక్రమార్కుల్లా ఉండాలి. తెలివిగానూ, చాకచక్యంగానూ, నేర్పు-ఓర్పులతోనూ ఆ ఇద్దరూ వ్యవహరించినప్పుడే సంస్థ ఘనమైన కార్యక్రమాలను చేయగలుగుతుంది. సాహిత్య సభ విజయవంతం కావటానికి తగిన ప్రణాళికలను రచించుకోవటం ముఖ్యం. వాస్తవానికి ఇదే ముఖ్యమైన పని!

"కార్యదర్శి అంటే మీటింగులు పెట్టేవాడనే ఒక అభిప్రాయం బలపడిపోయింది. నిజానికి ఈ పనిని ఒక షాపు యజమాని తన కొట్లో గుమాస్తాని పంపి బ్యానరు కట్టించి, కుర్చీలు సర్దించి మీటింగ్ ఏర్పాట్లు చేయించగలడు. అంతమాత్రాన సదరు షాపు యజమాని గానీ, అతని గుమాస్తా గానీ కార్యకర్త కాలేరు" అంటారు సుబ్బారావు.

సుబ్బారావు భాషను ఇక్కడ మనం జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. "కార్యకర్త అంటే రచయితను సమాజానికి చేరువ చేసే వాడు! సాహిత్య ఉద్యమాలలో శంఖం పూరించేవాడు ఊపిరి ఊదేవాడు. సమాజాన్ని సాహిత్యానికి ప్రభావితం అయ్యేలా చేసేవాడు...." అని నిర్వచిస్తారు సుబ్బారావు.

ఈ పనులు రచయిత స్వయంగా చేసుకోగలిగేవి కావు. వీటికోసం త్యాగ నిరతితో పనిచేసే వాడే కార్యకర్త.... అనేది సుబ్బారావు మాట!

సాహిత్యసంస్థల నిర్మాణంలో కార్యదర్శి పాత్ర తక్కువదేమీ కాదు. secrener అనే లాటిన్ పదానికి "పాలనూ నీళ్ళనూ వేరు చేసి చూడగల వివేకం కలిగిన వాడు" అని అర్థం. వివేకంతో ఒక సంస్థని నడపటాన్ని secretum అంటారు. ఒక మహా చక్రవర్తికి, పోపు లాంటి మతాధిపతికి ముఖ్య సలహాదారుడిగా ఉన్న వ్యక్తిని సెక్రటరీ అనటం అలా మొదలయ్యింది. సుబ్బారావు కృష్ణాజిల్లా రచయితల సంఘానికి గానీ, అంతకుమునుపు స్పందన సాహితీ సమాఖ్యకు గానీ అలాంటి బాధ్యతనే నిర్వహించాడు. నిజమైన సెక్రటరీకి ఆయన నిలువెత్తు రూపం.

వ్యక్తిగతంగా సుబ్బారావు గానీ, నేను గానీ సెక్రటరీగా ఉండటానికే ఎక్కువ ఇష్టపడతాము. ఎందుకంటే, వివేకానికి విచక్షణకూ పెద్ద పీట వేసే అవకాశం ఈ పదవిలో ఉంటుంది కాబట్టి.

1888లో టైపు రైటర్ కనుగొన్నాక సెక్రటరీని టైపిస్టు స్థాయికి కుదించారు.

1990 తరువాత కంప్యూటర్లు పూర్తిగా వాడకంలోకి వచ్చాక ఈ సెక్రటరీ టైపు ఇన్‌స్టిట్యూట్లలో ప్రూఫులు దిద్దుకునే స్థాయికి మారిపోయాడు.

2000 మిలీనియం తరువాత స్వంత కంప్యూటర్లు వాడకంలోకి బాగా వచ్చాక సెక్రటరీ అనే వ్యక్తి మెయిల్స్, యస్సెమ్మెస్ సందేశాలను పంపేవాడుగా మారిపోయాడు.

ఇటీవలి కాలంలో సంబంధిత సాహితీ పరమైన వ్యక్తుల రాక గురించి పట్టించుకోవటం మానేసే ఒక కొత్త సంస్కృతి మొదలైంది.

ముందే మనం చెప్పుకున్నాం... సాహిత్యేతరులతో జరిపేవి సభలే అవుతాయి గాని సాహిత్య సభలు కాబోవు. కార్యక్రమాలు వాటి మానాన ఎలా జరగాలో అలా జరుగుతాయనే ఆలోచన, ఎలాగోలా అయ్యిందనిపించాలనుకోవటం సుబ్బారావు దృష్టిలో ప్రమాదకరమైన ధోరణే!

ముందే మనం చెప్పుకున్నాం, ధర్మాన్ని చర్చించి నిగ్గు తేల్చేవే సాహిత్య సభలు అనిపించుకుంటాయి. అవి సిద్ధాంత ప్రాతిపదికమీద విజ్ఞులైన ఉన్నతులైన సభాసదుల సమక్షంలో జరగాలి.

ఈ పుస్తకంలో మనం సాహిత్య సభల గురించి మాట్లాడుకునేదంతా ఇలాంటి మహత్తర సభల గురించి మాత్రమే! మామూలు వేడుకగా జరిగే సభల్లో సాహిత్యం గురించి మాట్లాడేదేముంది.

వేడుక సభలన్నీ వ్యక్తిగతం. వ్యక్తిగత సభలకు రూల్సేమీ ఉండవు.

సాహిత్య సభలు శాస్త్రీయంగా జరగాలంటే కొన్ని జాగ్రత్తలు తప్పనిసరి!

లక్ష్య నిర్దేశం: ముందే మనం చెప్పుకున్నాం, సభకు లక్ష్య నిర్దేశం ముఖ్యం అని! ఆ లక్ష్యం విషయంలో కార్యకర్తకు స్పష్టత ఉండాలి.

వ్యయ అంచనాలు: ఎంత స్థాయిలో సభను నిర్వహించాలో ఒక అంచనా ఉండాలి. ఆహ్వాన పత్రికల అచ్చునుంచీ ప్రతి రూపాయి ఖర్చుని అంచనా వేసి బడ్జెట్టు రూపొందించుకోవాలి.

నిధుల సమకూర్పు: ఈ వ్యయాన్ని ఎక్కడనుంచి తెచ్చి ఖర్చు పెట్టాలన్నది ముఖ్యం. లక్ష్యాన్ని బట్టి స్పాన్సర్లు లేదా దాతలు ముందుకు వస్తారు.

చేయాల్సిన పనుల పట్టిక: కార్యక్రమ నిర్వహణకు ఏఏ పనులు అవసరమో ముందుగానే వ్రాసుకుని, వాటిని చేసేందుకు తగిన్న వ్యక్తులకు ఆ యా బాధ్యతలు అప్పగించటం జరగాలి.

ఆరు గంటలకు మీటింగంటే 5-00 గంటలకే అక్కడ ఉండి ఇంకేమైనా పనులు ఉన్నాయా అనడిగే వాళ్ళు అరుదుగా దొరుకుతారు. అలాంటి వాళ్లు సంస్థలో ఉంటే సంస్థలు పదికాలాలపాటు మనగలుగుతాయి. అలాంటి వ్యక్తులకే బాధ్యతలు అప్పగించండి.

జాతీయ తెలుగు రచయితల సభలు నిర్వహిస్తున్నప్పుడు ఒకాయన సుబ్బారావుకి ఫోను చేసి, "చాలా పెద్ద కార్యక్రమం నిర్వహిస్తున్నారు, నా వంతు సాయం నేను కూడా చేస్తా" అన్నారు.

సుబ్బారావు సంతోషించి, "మా కార్యాలయంలో ఎంతమంది వచ్చినా ఇంకో మనిషికి సరిపడిన పని మిగిలి ఉంటోంది. మీరెప్పుడైనా వచ్చి మాతో సహకరించవచ్చు" అన్నారు.

దానికా పెద్దమనిషి, "పనులంటే అవి కావండీ, మీ సభల్లో అధ్యక్షత వహించటం, ముఖ్య అతిథిగా రావటం లాంటి పనులేవైనా ఉంటే నాకు చెప్పండి...నేను చేసి పెడతాను" అన్నారు.

అప్పుడు సుబ్బారావు, "సభల కోసం బాగా పనిచేసిన వాళ్లకే అలాంటి బాధ్యతలు ఇవ్వాలని అనుకుంటున్నాం..." అన్నారు. నిజానికి అలానే ముఖ్య బాధ్యతలను ఇవ్వటం కూడా జరిగింది.

ఆచార్య సిమ్మన్న, డా. ద్వానా శాస్త్రి, శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్, డా. గుమ్మా సాంబశివరావు, డా వెన్నా వల్లభరావు, శ్రీ రేపాక రఘునందన్, శ్రీ యస్.వి.డి ప్రసాదరావు, శ్రీ శిఖా ఆకాష్, శ్రీ చింతపల్లి వెంకట నారాయణ, శ్రీ టి. శోభనాద్రి, డా. పాలపర్తి శ్యామలానంద ప్రసాద్, శ్రీమతి పుట్టి నాగలక్ష్మి, శ్రీమతి భమిడిపాటి బాలాత్రిపురసుందరి, శ్రీమతి కోకా విమలకుమారి, శ్రీమతి రెజీనా, శ్రీమతి చలసాని వసుమతి ఇంకా మరికొందరు సాహితీ వేత్తలు ఐచ్ఛికంగా ముందుకొచ్చి, మాతో కలిసి అహోరాత్రాలు పనిచేసి కృష్ణాజిల్లా రచయితల సంఘం ముఖ్య కార్యకర్తలుగా ఈ పుష్కర కాలం నుండీ సంస్థను నిలబెట్టుకుంటూ వస్తున్నారు. వారికి సహజంగానే కార్యక్రమాల్లో ప్రాధాన్యత వుంటుంది.

ఆహ్వాన పత్రాల రూపకల్పన: కార్యక్రమం భారీదైనప్పుడు అతిథుల ఎంపిక క్లిష్టతరమౌతుంది. చిన్నస్థాయిదైనా ఒక్కోసారి కార్యకర్తలను చాలా ఇబ్బందిపెట్టే సన్నివేశాలు జరుగుతాయి.

తమను అతిథులుగా ఆహ్వానించవలసిందిగా ఫోనుల్లోనో, వ్యక్తిగతంగానో కార్యకర్తల మీద చాలా మంది తీవ్రంగా వత్తిడి తెస్తుంటారు. వాటికి లొంగని వాడే కార్యకర్త.

కొన్ని చోట్ల ఇస్తినమ్మా వాయనం, పుచ్చుకొంటినమ్మా వాయనం పద్ధతిలో కార్యక్రమాలు జరుగుతుంటాయి. దాని వలన సభ పలచబడుతుంది. కార్యక్రమం వన్నె తగ్గిపోతోంది.

"ఏ కార్యకర్త అయినా సరే ప్రతిఫలాపేక్ష రహితంగా కార్యక్రమాన్ని రూపొందించుకుంటేనే విజయం సాధిస్తాడు. సామాజిక ప్రయోజనం తప్ప స్వంత ప్రయోజనం ఆశించేవాడు కార్యకర్త కాలేడు.

స్వంత ప్రయోజనాలకోసం సభ్యు లయ్యేవాళ్ళు, సభలు పెట్టేవాళ్ళు ఆ సంస్థలకు కొరకరాని కొయ్యలే!" అనేది సుబ్బారావు మతం. అలాంటి దృఢమైన నిర్ణయశక్తి, అంకిత భావం కలిగిన నిర్వాహకులు ఉంటేనే గొప్ప విజయాలు సాధించగలుగుతాయి సంస్థలు. లేకపోతే జేబు సంస్థలకు, వీటికీ తేడా ఉండదు.

అతిథుల ఎంపిక అనేది సభ లక్ష్యానికి అనుగుణంగా జరగాలి. సాధ్యమైనంత వరకూ ఆ అంశం మీద స్వంత అభిప్రాయాలను కలిగిన వారిని ఎంపిక చేయాలి. ఎంపిక అనేది ఆ వ్యక్తి హోదాని బట్టి, కులాన్ని బట్టి కాక జ్ఞానం ఆధారంగా జరగాలి. అదే కత్తిమీద సాము నిజానికి! నిజంగా ఆ రంగంలో కృషి చేస్తున్న వాళ్ళను దుర్భిణి వేసి వెదికేవాడు నిజమైన కార్యకర్త. వాళ్లకు తగిన ప్రసంగాన్ని, సమయ నిర్దేశాన్ని చేయగలగాలి.

ఆహ్వానపత్రం సాధ్యమైనంత ముందుగా చేరినప్పుడు, ఇతర ఎలక్ట్రానిక్ సాధనాల ద్వారా సమాచారాన్ని విస్తృతంగా అందేలా జాగ్రత్తలు తీసుకున్నప్పుడు, సభలో ఆత్మీయమైన స్వాగత వాతావరణం ఉన్నప్పుడు ఆ సంస్థ నిర్వహించే సభలకు పిలవకపోయినా విజ్ఞులు రాగలుగుతారు.

దాన్నే మనం గుడ్‌విల్ అంటాం. కార్యకర్తలు దాన్ని సంస్థకు సాధించి పెట్టాలి.




హైదరాబాద్‌లో శ్రీ ఎ.బి.కె. ప్రసాద్, శ్రీ మండలి బుద్ధ ప్రసాద్,
శ్రీ కవితా ప్రసాద్ గార్లతో...

## హైదరాబాదులో సుబ్బారావు

'వచన కవితా వాచస్పతి కుందుర్తి' సుబ్బారావు వ్రాసిన ఏకైక కవితా సంపుటి "మనిషికోసం" పుస్తకానికి "మనిషికోసం కవిత్వం" పేరుతో ముందుమాట వ్రాస్తూ ఇలా అంటారు:

"సాహిత్య సంస్థల నిర్మాణమూ, వాటి కార్యక్రమాల నిర్వహణల్లో పడితే సృజనాత్మకమైన కవితాశక్తి వెనుకబడి పోతుందేమో, చూసుకుంటూ వుండమని నేను హెచ్చరించిన యువ కవిమిత్రుల్లో గుత్తికొండ సుబ్బారావు ఒకరు.

కాని, అబద్ధాన్ని పూలతోటల్తోనూ, నిజాల్ని ముళ్లకంచెలతోనూ పోలుస్తూ ఈ కావ్యారంభంలో చక్కగా కుదిరిన మొదటి రెండు పంక్తులు చదవగానే నిజంగానే నేను అదిరిపోయాను. అంటే అమితానందం చెందాను.

ఎందుకంటే, నేను మిత్ర భావంతో చూసినా ఆయనకు నా పట్ల గురుభావం ఉంది.

1969లో ఆయన హైదరాబాదులో ఉంటూ "స్పందన" అనే సాహితీ సంస్థను ప్రారంభించి, అదే పేరుతో ఒక కవితా సంకలనం ప్రకటించిన రోజుల్లో

ఒకరోజు నన్ను తన గదికి తీసుకుపోయి, తన కవిత్వమంతా వినిపించాడు. ఇది అచ్చు వేయాలని ఉంది, మీ అభిప్రాయం చెప్పండని కోరాడు.

నేను కొంచెం నిర్మొగమాటంగా మాట్లాడే తత్వం గల వాడిని కదా...నీకింకా పరిపక్వత రాలేదు. ఇప్పుడు విన్నంతలో ఏదీ నన్ను కదిలించలేదు. కొన్నాళ్ళు ఆగి, సాధన చేసుకుంటే మంచిదని సలహా ఇచ్చాను.

అప్పుడు చదివిన గేయాలు ప్రస్తుత సంపుటిలో వున్నాయో లేదో నాకు గుర్తు లేదు కాని, ఉంటే ఒకటో రెండో వున్నా, మొత్తం మీద వచనకవిత రాయడంలో ఆయనకు ఒక పట్టు చిక్కినట్టు కనిపించింది. కనుక ఆ మొదటి రెండు పంక్తులనూ ఉదహరించాను.

కావ్యప్రచురణతో కవిగా ప్రజలముందుకు నిలబడటానికి కొంత ఆలస్యం జరిగినా, ఆ తప్పు నాదే అయినా, దానివల్ల మేలే జరిగిందని నేను సంతృప్తి పడ్తున్నాను" అని వ్రాశారాయన.

సుబ్బారావు 1968 నుండీ కుందుర్తి ఆంజనేయులు అనుయాయి. ఒక్కమాతలో చెప్పాలంటే ఆయన మస్తిష్కంలోంచి ఊడిపడ్డాడంటే సబబుగా ఉంటుంది. కుందుర్తి అధ్యక్షుడుగానూ, సుబ్బారావు కార్యదర్శిగానూ ఫ్రీవర్స్ ఫ్రంట్ సంస్థ గొప్ప కార్యక్రమాలు నిర్వహించింది అప్పట్లో!

"కార్యకర్తృత్వం మితిమీరితే నీలో రచయితను త్యాగం చేసుకోవలసి వస్తుంది సుమా..." అంటూ కుందుర్తి చేసిన హెచ్చరిక సుబ్బారావు లక్ష్యపెట్టలేదు. కుందుర్తి దగ్గర వచన కవిత్వానికన్నా కార్యకర్తృత్వాన్నే ఎక్కువ నేర్చుకున్నారు సుబ్బారావు.

'మనిషికోసం' కవితా సంపుటిని మెరుగుపరిచి అచ్చు వేసుకున్నా, ఆ తరువాత తన కవనాన్ని ఆయన కదిలించింది లేదు.

కుందుర్తి భయపడినట్టే జరిగింది. సుబ్బారావు రచనా విన్యాసాలకు దూరంగా అయిపోయాడు.

అంతమాత్రాన ఆయన కవిత్వానికి కాకుండా పోయిన వాడు కాదు.

వచన కవిత్వానికి సంరక్షకుడుగా ఆం.ప్ర.సాహిత్య అకాడెమీలో ఆయన చేసిన పోరాటాన్ని నాబోట్లు అతి సన్నిహితంగా చూశాం. సుబ్బారావు వ్రాసినా భాస్కరుడే! వ్రాయక పోయినా భాస్కరుడే!!

హైదరాబాదులో ఉన్న రోజుల్లో తంతితపాలా శాఖలో పనిచేసేవాడు.

అప్పట్లోనే తంతితపాల శాఖ రచయితల సమాఖ్యని స్థాపించాడు. చేసే చెయ్యి ఊరుకోదు కదా! పోస్టుమాన్ పేరుతో తిలక్ ఒక కథ వ్రాశారు. అంతకు మించి, తంతి-తపాలా శాఖ మీద పెద్దగా సాహిత్య ఉత్పత్తి జరగలేదు.

తను పని చేసే శాఖలో సాహిత్యాభిమానులందరినీ ఒక చోటకు చేర్చటం ఆయన లక్ష్యంగా పెట్టుకున్నారు.

పోస్టల్ శాఖకు బయట 'స్పందన సాహితీ సమాఖ్య' పేరుతో ఒక సంస్థను స్థాపించి దాని ద్వారా విస్తృతంగా కార్యక్రమాలు నిర్వహిస్తూ ఉండేవారు.

అప్పట్లోనే ప్రముఖ కవి శివారెడ్డితో కలిసి వేకువ పత్రిక వ్యవస్థాపనలో భాగస్వామి అయ్యారు. దాని నిర్వాహకుడిగా ఉన్నారు.

ఆ రోజుల్లో శ్రీయుతులు శివారెడ్డి, శీలా వీర్రాజు, నగ్నముని, వరవరరావు, జ్వాలాముఖి, భైరవయ్య, వేమూరి సత్యనారాయణ, స్వాతి బలరాం, యన్.గోపి, ...వీళ్లంతా కొంచెం అటూ ఇటూగా ఒక యీడు వాళ్ళు. అందరూ ఆవేశపరులే! అందరూ కలిసికట్టుగా సాహితీ యానం సాగించేవారు

అప్పట్లో సుబ్బారావులో సాహితీ చైతన్యం ప్రధానంగా ఉండేది. అప్పటి సుబ్బారావునీ, ఆ తరువాతి సుబ్బారావునీ తూకం వేస్తే, హైదరాబాద్ రోజుల్లో సుబ్బారావులో సాహిత్యం పాలు ఎక్కువగా కనిపిస్తుంది.

బందరొచ్చాక సుబ్బారావు ఉద్యమాలకు అంకితమై పోయారు. వ్యక్తిగత రచనావ్యాసంగం పూర్తిగా అడుగంటిపోయింది. నూజివీడు చేంతాడు వేసి తోడినా ఉపయోగం లేని స్థితి.

"ఇప్పుడు నేను రాయను" అనేది జవాబు. వ్రాసేవాళ్లను చూసి తానే వ్రాస్తున్నంతగా సంబరపడతారు.



శ్రీ విహారి, శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరి, శ్రీ మూర్తి గార్లతో...

## సుబ్బారావుతో నా తొలిపరిచయం

తంతి తపాలాశాఖ నుండి ఉద్యోగం మారి, యల్.ఐ.సి.లో ఉద్యోగం రావటంతో మకాం మచిలీపట్టణానికి మారింది. అప్పటికే బందరు యల్.ఐ.సీ.లో శ్రీయుతులు విహారి & శాలివాహన, సింగరాజు రామచంద్రమూర్తి, పువ్వాడ తిక్కన సోమయాజి, లంక సుందర రామయ్య, విడియాల చంద్రశేఖరరావు లాంటి లబ్ధప్రతిష్టులు ఉండేవారు. కొత్తగా ఉద్యోగంలో చేరి బందరులో పోస్టింగ్ పుచ్చుకున్న సుబ్బారావుని విహారి పక్క సీట్లో వేశారు. ఈ కొత్త కుర్రాడికి వర్క్ నేర్పించండి అంటూ సుబ్బారావుని ఆయనకు అప్పగించారు.

విహారి పాఠాలు ఏ విషయాన్నైనా ఎలా చేయకూడదో నేర్పించేవిగా ఉంటాయి. "ఏం చెయ్యాలో నీకు నీ జీవితమే నేర్పుతుంది. ఏం చెయ్యకూడదో నేను నేర్పుతాను" అన్నారట ఆయన.

1975లో నా మెడిసిన్ చదువు మొదలయ్యింది. బందరులో నా క్లాస్‌మేట్స్ ఉన్నారు. యం.వి.పి. కృష్ణమాచారి, నాగలింగం నాగేశ్వరరావు అని! నేనూ, చలపతి, కె.యస్.రావు అనే ఇంకో మిత్రుడు కలిసి వేసవి శలవుల్లో బందరు మా మిత్రుల

దగ్గరికి వెళ్ళి, సరదాగా రెండు రోజులు వాళ్లతో గడిపాము. బెజవాడ నుంచి బందరు సైకిల్ల మీద వెళ్ళాం ఇద్దరం. ఆ సమయంలో మా నాగేశ్వరరావును తీసుకుని యల్.ఐ.సి. ఆఫీసుకు వెళ్ళి సుబ్బారావునీ, విహారినీ, శాలివాహననీ కలిశాను. నాలో స్పార్కును ఎక్కువగా గుర్తించింది సుబ్బారావుగారే! నన్ను చూడగానే హుర్రే అన్నంత సంబర పడ్డారు. బెజవాడలో మనకో కుడిచెయ్యి దొరికింది అన్నారు శ్రీ విహారితో. విహారిగారు ప్రశంసాత్మకంగా నన్ను చూశారు. "సుబ్బారావు నీకు తగిన గురువు. మనవాడితో టచ్చిలో ఉండు" అన్నారు నాతో! అప్పుడే సుబ్బారావు you must know, how not to do things అన్నారు నాతో.

నిజానికి 1970 నుండీ మేఘమాల అనే లిఖిత మాసపత్రికని నడపటం, చిన్నచిన్న రచనలు చేయటం, బొమ్మలు వేయటం ఇలాంటి అలవాట్లు ఉండేవి. పెద్ద వాళ్లను పరిచయం చేసుకోవాలనే కోరిక బాగా ఉండేది. ఈ యల్లైసీ ప్రముఖుల గురించి విని ఉండటం చేత కావాలని వెదుక్కొంటూ వెళ్ళాను. వీళ్ళంతా నన్ను సమాదరించారు. శిక్షణ ఇస్తే పైకొస్తాడనే నమ్మకం ఏదో నామీద వాళ్లకు కలిగింది...ముఖ్యంగా సుబ్బారావుకీ, విహారికీ.

అది మొదలు బందరు స్పందనలో నేను భాగస్వామ్యం అయిపోయాను. మొదట నన్ను కార్యవర్గంలోకి తీసుకున్నారు. ఆ తరువాత జాయింట్ సెక్రటరీ అన్నారు. స్పందనలో అంతకన్నా పెద్ద పదవులేవీ నేను చేయలేదు. కానీ ప్రతీ చిన్న అవసరానికీ బెజవాడ రావటం వాళ్లకు తప్పనిసరి. బెజవాడలో నేను ఉండటం చేత కొంత సౌలభ్యం కలిగింది.

1980లో అనుకుంటాను, స్పందన వాణి పత్రిక ప్రారంభించినప్పుడు ఒక రోజు సుబ్బారావు నాకు ఉత్తరం వ్రాశారు. ఆ రోజుల్లో సుబ్బారావుకి ఫోను లేదు, నేను స్టూడెంటుని. మా ఇంట్లో కూడా ఫోను లేదు. ఉత్తరాలే రాయబారాలు మాకు.

"నువ్వు అర్జంటుగా టిక్కెట్టు కొనుక్కుని శ్యాంబెనెగల్ సినిమా 'అనుగ్రహం' చూసి మంచి రెవ్యూ వ్రాసి పంపు, స్పందన వాణిలో ప్రచురిద్దాం" అని ఆ ఉత్తరం సారాంశం.

అప్పుడు మాకు మెడిసిన్ ఫోర్త్ ఇయర్ పరీక్షలు జరుగుతున్నాయి. సుబ్బారావు ఉత్తరాన్ని నిర్లక్ష్యం చేయటం ఎలా...? మొత్తానికి టిక్కెట్టుకొని, "అనుగ్రహం" చూశాను. ఇంటికొచ్చి మర్నాడు పరీక్ష సంగతి చూసుకుని, పరీక్ష అయ్యాక సమీక్ష వ్రాశాను. దాన్ని పోస్టులో పంపుతూ, సుబ్బారావుకి ఇలా ఉత్తరం వ్రాశా...

"అనుగ్రహం సినిమా స్క్రిప్ట్ మొత్తం కలిపినా ఐదు పేజీలకి మించి రాదు. కానీ నా సమీక్ష మొత్తం 10 పేజీలు వచ్చింది. మీకు నచ్చినంత ఉంచి మిగతాది కొట్టేయండి" అని !

ఆ తరువాత పోస్టులో పత్రిక వచ్చింది. నా వ్యాసం ఏ మాత్రం కొట్టేయకుండా పూర్తిగా వేశారు.

అప్పటికి కొత్త రచయితని కదా... పైగా సినిమా సమీక్షలు వ్రాయటం అదే మొదలు... చాలా అనందం వేసింది. నా వ్యాసం అచ్చయిన పేజీ మీద ఓ కాయితం ముక్క పిన్ చేసి దానిమీద– "నీ సమీక్ష బావుంది, ప్రతినెలా ఒక మంచి సినిమా చూసి ఇదే పద్ధతిలో మంచి విశ్లేషణ వ్రాయి" అని వ్రాశారు సుబ్బారావు. ఒక పత్రికలో ఫీచర్ వ్రాయటం అనే అవకాశం అదే నాకు మొదలు.

"మా అమ్మ ఈ ఉత్తరం చూసి" మీ సుబ్బారావుకు నచ్చిందంటే నువ్వు బాగానే రాశావని అర్థం" అంది. అమ్మకి ఎందుకు చూపించానంటే నెలకో సినిమా చూడాలంటే అమ్మేకదా డబ్బులివ్వాలి... అందుకని.

సుబ్బారావు మా ఇంట్లో ఒక భాగమే! బెజవాడ వచ్చినప్పుడల్లా విహారి, శాలివాహన, బూదరాజు శ్యాం సుందర్ వీళ్లంతా మా ఇంట్లోనే దిగేవారు. సుబ్బారావుకి నిమ్మకాయ ఊరగాయ అంటే ఇష్టం. ఆయన కోసం మా అమ్మ ప్రత్యేకంగా నిమ్మకాయ పచ్చడి పెట్టి వేరే జాడిలో అట్టేపెట్టేది.

స్పందనలో భాగస్వామి నయ్యాక నాకు సుబ్బారావు సహచరులు శ్రీయుతులు వైజికె ప్రసాద్, పువ్వాడ తిక్కన సోమయాజి, అక్కల సరస్వతీ బాబురావు, వాళ్లబ్బాయి కిరణ్, డా. మాదిరాజు రామలింగేశ్వర రావు, మల్లాప్రగడ ప్రభాకరరావు ప్రభృతులతో బాగా సాన్నిహిత్యం ఏర్పడింది. వాళ్ళంతా నాకన్నా వయసులో చాలా పెద్దవాళ్ళు. నేను నూనూగు మీసాలవాణ్ణి.

నా సారస్వత ఎదుగుదలకి వీళ్ళందరి ప్రభావం అంతో ఇంతో తప్పకుండా ఉంది. మేం ఎప్పుడు కలిసినా, ఈనాటికీ లోకాభిరామాయణం ఎప్పుడూ చర్చకు రాదు. సాహిత్య పరమైన విషయాలు మాత్రమే మాట్లాడుకునే వాళ్లం. విహారి ఎక్కడో ధార్వార్ నుండి పనిగట్టుకుని నా కోసం బెజవాడ వచ్చి, నా సప్తసింధు నవల చదివి సరిచేసి పెట్టారు. ఇలాంటి మిత్రులు దొరకటం పూర్వజన్మ ఫలం అంటే తప్పులేదు.

1980ల్లోనే గుంటూరు టెలిగ్రాఫ్ ఆపరేటర్ ఉద్యోగం వదిలేసి, డా. రావి

రంగారావు బందరు ఆంధ్ర జాతీయ కళాశాలలో లెక్చరర్‌గా చేరారు. సుబ్బారావు మా ఇద్దరినీ కలిపారు. ఇద్దరం కూడబలుక్కుని మినీకవితా ఉద్యమానికి పథక రచన చేసుకున్నాం. సంధానకర్త సుబ్బారావు మాకు ఒక చోదక శక్తిగా నిలిచారు. మినీకవితా ప్రదర్శనలు ఏర్పాటు చేస్తూ నేను ఊరూరా తిరిగాను. శ్రీ సుబ్బారావుని ఆం.ప్ర. సాహిత్య అకాడెమీ కార్యవర్గసభ్యుడి హోదాలో మినీకవిత సదస్సులకు అధ్యక్షుడుగా గానీ, ముఖ్య అతిథిగా గానీ ఆహ్వానించేవారు. రావి రంగారావు మినీకవితా స్వరూప స్వభావాలను వివరిస్తూ ప్రసంగాలు చేసేవాడు. రావి రంగారావునీ నన్నూ నరనారాయణులనే వాళ్ళు. సుబ్బారావు అండ ఉండటంతో మా లక్ష్యం బాగా నెరవేరేది. సుబ్బారావు, రంగారావు, నేనూ మినీకవిత పుచ్చుకుని చాలా ఊళ్ళు తిరిగాం. అదొక ఊపు. ఇప్పుడైతే చేయగలమా అనిపిస్తుంది.

1981లో కడపజిల్లా రచయితల మహాసభలు జరిగాయి. జానమద్ది హనుమచ్ఛాస్త్రి , డా. మల్లెమాల వేణుగోపాలరెడ్డి, నన్నూ, రావిరంగారావునీ వేదికమీదకు పిలిచి శాలువా కప్పి సత్కరించారు. నాకు గుర్తున్నంత వరకూ మా ఇద్దరికీ అదే మొదటి సన్మానం.

జానమద్ది వారు మినీకవితా ప్రచారానికి నేనూ, రంగారావు చేస్తున్న కృషి గురించి పొగడ్తలు చెప్తుంటే మేమిద్దరం సిగ్గు మొగ్గలయి పోయాం.

ఈ సన్మానాలు శాలువాలు ఇవన్నీ ఫ్యూడల్ సంస్కృతి అనే అభిప్రాయం ఏదో మాలో బలంగా ఉండేది. అందుకని వేదిక పైకి రావటానికి తటపటాయించాం. అప్పుడు సుబ్బారావు కిందికి దిగి వచ్చి మా ఇద్దరి భుజాలమీదా చేతులు వేసి వేదిక పైకి సాదరంగా తీసుకు వెళ్ళారు.

ఆచార్య కేతు విశ్వనాథ రెడ్డి, సుబ్బారావునీ, నన్నూ, రావిరంగారావునీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం తెలుగు శాఖకు ఆహ్వానించారు. రంగారావు పరీక్ష పేపర్లు దిద్దటానికి భాగ్యనగరం వెళ్ళాల్సి రావటంతో మాతో కలిసి తిరుపతి రాలేక పోయారు. కడపనుండి సుబ్బారావు నేనూ తిరుపతి వెళ్ళాము. ఆచార్య విశ్వనాథరెడ్డి మమ్మల్ని నేరుగా ఆచార్య జి.యన్.రెడ్డిగారి దగ్గరకు తీసుకు వెళ్ళారు. అంతటి మహానుభావుణ్ణి అంత సమీపంగానూ, సన్నిహితంగానూ చూడటం, ఒక విశ్వవిద్యాలయం ఆచార్యుల్ని, పరిశోధక విద్యార్థుల్ని ఉద్దేశించి ప్రసంగించటం 23 యేళ్ళ వయసులో అదో గొప్ప అనుభూతి. అందుకు కారకుడు సుబ్బారావు. ఇవి

థ్యాంక్సుతో సరిపెట్టే విషయాలా? కేవలం నా వ్యక్తిగత విషయం అయినప్పటికీ ఒక సంగతి ప్రస్తావించాలి : 1982లో పెళ్ళిచూపుల తంతు జరిగింది. అప్పుడే కొత్తగా ఆస్పత్రి పెట్టుకున్నాను. ఏదో అర్జంటు కేసు వచ్చింది. నేను పెళ్ళి చూపులకు వెళ్ళలేదు. నాకుబదులు సుబ్బారావు, మైత్రేయగారు వెళ్ళారు. వాళ్ళిద్దరూ ఎంపిక చేసిన అమ్మాయినే నేను పెళ్ళి చేసుకున్నాను.




డా॥ పరుచూరి రాజారామ్ ప్రభృతులతో...



చెన్నైలో "భారత జ్యోతి" అవార్డు స్వీకరిస్తూ...

## బందరులో స్పందన

చుట్టూ చీకట్లను తిడుతూ కూర్చునే కన్నా చేరి ఒక దీపం వెలిగించటం మిన్న అనే ఖలీల్ జీబ్రాన్ సూక్తిని నమ్మిన వ్యక్తి సుబ్బారావు.

సుబ్బారావు బందరులో ఉద్యోగంలోకి రాగానే అద్దేపల్లి రామమోహనరావు ప్రభృతులు వ్యవస్థాపించిన ఆంధ్ర సారస్వత సమితిలో ప్రవేశించారు.

1972-73 సంవత్సరాలలో ఆ సంస్థకు ప్రధాన కార్యదర్శి అయ్యారు. శ్రీయుతులు విహారి అధ్యక్షుడుగానూ, బోయిన వెంకటేశ్వరరావు ఉపాధ్యక్షుడు గానూ ఉండేవారు. ఆ సమయంలో తెలుగు కథ పేరుతో ఒక పరిశోధనాత్మక వ్యాస సంపుటి తెచ్చారు. అప్పటివరకూ వచ్చిన తెలుగు కథా సాహిత్యాన్ని పురాణం ప్రభృతులు విశ్లేషించి గొప్ప వ్యాసాలు వ్రాశారు.

ఇంకా, జె. యస్.ఆర్.కె. ప్రసాదరావు, రావ్ & యాజి (కాళేపల్లి యోగేశ్వర రావు, పువ్వాడ తిక్కన సోమయాజి) ప్రభృతుల రచనలు ఆ సంస్థ పక్షాన వెలువడ్డాయి.

ఆ తరువాత హైదరాబాదులో తాను వ్యవస్థాపించిన స్పందన సాహితీ సమాఖ్యను బందరులో పునః ప్రారంభించారు. స్పందన తిరిగి మొదలయ్యాక ఆయన వ్యక్తిత్వంలో గణనీయమైన మార్పొచ్చింది. ఆయనలోని కార్యకర్త విశృంఖలం అయ్యాడు.

ఒకటా రెండా అరవైకి పైగా పుస్తకాలను ఒక సాహితీ సంస్థ ప్రచురించటం అంటే మాటలా! ఒక వాణిజ్య సంస్థ ఆ పని అవలీలగా చేయగలదు. ఎందుకంటే, అది వ్యాపారం కాబట్టి. కానీ, ఒక వ్యక్తి అరవై పుస్తకాలు ప్రచురించి రచయితలకు సేవ చేయటానికి ఒక వ్యక్తి తన శక్తి యుక్తులను ధారపోయటం అరుదైన విషయం.

దాదాపుగా ఈ అరవై మంది రచయితల్లో సినారె ప్రభృతులను మినహాయిస్తే, ఎక్కువమందికి వారి సాహిత్య జీవితంలో అవి మొదటి పుస్తకాలు కావటం గమనార్హం.

“ఎక్కడ ఏ పుస్తకం అచ్చయినా తన పుస్తకమే అచ్చయినంతగా సంబర పడే సుబ్బారావు” అని శ్రీ విహారి అన్నదానికి ఈ నిరూపణే సాక్ష్యం. రచయిత అంటే తనదైన పుస్తకం వచ్చి ఉండాలనే వారు సుబ్బారావు. ఆ మేరకు తనే ప్రోత్సహించి, వీలైనంత సాయం చేసి పుస్తక రూపంలో రచయితను వెలుగులోకి తెచ్చేవారు. ఇలా అందరి పుస్తకాలు వేయటమే ధ్యేయంగా పెట్టుకుని తన పుస్తకాలు వేయటం మరిచి పోయారాయన. ఇల్లంతా అలికి ఒక ఈగ తన ఇంటి పేరు మరిచిపోయిందట. సుబ్బారావు ఈ సాహితీ సేవలో మునిగి తాను కవిననే సంగతే మరిచిపోయాడు.

మనం సాయం చేశాక ఆ సాయాన్ని సాయం పొందిన వారు గుర్తుంచుకోవాలి. సాయ పడ్డ వ్యక్తి మరిచిపోవాలి.

సుబ్బారావు జ్ఞాపకాల్లో ఇప్పుడు ఏ పుస్తకం లేదు. ఆయన దగ్గిర ఒక్క పుస్తకం కూడా మచ్చుకు లేదు. పుస్తకాలన్నీ లైబ్రరీలకు వర్ధమాన రచయితలకు ఇచ్చేశారు.

ఫోటోలు దాచుకోవటం, న్యూస్ పేపర్ కట్టింగులు అట్టే పెట్టుకోవటం లాంటి అలవాట్లు సుబ్బారావుకు లేవు. ఆయన ముక్కులోంచి ఊడిపడ్డాను కదా... ఆ అలవాటు నాకూ లేదు. అందుకనే ఆ పాతకాలం నాటివి ఫోటోలు ఎక్కువ సేకరించలేకపోయాం.

నాకు గుర్తున్నంతవరకూ స్పందన పక్షాన ప్రచురించిన కొన్ని పుస్తకాలను ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

తొలిగ్రంథం స్పందన, ఆ తరువాత శ్రీ భైరవయ్య 'రా!',
బందరులో స్పందన వచ్చాక "సాధన" కవితా సంపుటి, డా. సి. నారాయణరెడ్డి "తరతరాల తెలుగు వెలుగు",
శ్రీ గుత్తికొండ సుబ్బారావు "మనిషికోసం",
డా. వి.వి.యల్. నరసింహారావు "వినరా సుమతీ!",
శ్రీ రొంపిచర్ల కృష్ణశాస్త్రి "ఆంధ్ర చంపూ రామాయణం",
కుందుర్తి పీఠికలు,
శ్రీ బూదరాజు శ్యాం సుందర్ శ్యాం నాటికలు, ప్రబుద్ధ భారతం,
శ్రీ యద్దనపూడి గోపీకృష్ణ "భ్రమరగీత",
డా. పెళ్లకూరు జయప్రద "అమ్మకానికో అమ్మాయి",
శ్రీమతి మందరపు హైమవతి "సూర్యుడు తప్పిపోయాడు",
శ్రీమతి సి వేదవతి "ముంగిటముత్యం", "తెలుగు వెలుగు",
డా. జి వి పూర్ణచందు "కాంతిస్వప్న",
శ్రీ విహారి "చలనం",
శ్రీ కిరణ్ "వేసవి",
శ్రీమతి డి సుజాతా దేవి "వేకువ రేఖలు", "ఆటల్లో అరటిపండు",
శ్రీ శీలా వీర్రాజు "ఊరు వీడ్కోలు చెప్పింది",

డా. ద్వా. నా. శాస్త్రి,
శ్రీమతి పవని నిర్మల ప్రభావతి,
శ్రీమతి కావిలిపాటి విజయలక్ష్మి,
శ్రీ రాధేయ...




శ్రీ గూటాలా కృష్ణమూర్తి, ప్రఖ్యాత తమిళ రచయిత్రి శ్రీమతి......,
శ్రీ మండలి బుద్ధప్రసాద్ ప్రభృతులతో...



కార్యకర్తృత్వ గురువు
శ్రీ విహారిని సత్కరిస్తూ...

## వ్యక్తిగతం

శ్రీ గుత్తికొండ సుబ్బారావు 1946 జనవరి 26వ తేదీన జన్మించారు. తపాలా శాఖ(1968-72) లోనూ, తరువాత జీవిత బీమా సంస్థ (1972-2003) లోనూ ఉద్యోగం చేసి స్వచ్ఛంద ఉద్యోగ విరమణ చేశారు.

వీరికి ముగ్గురు కుమార్తెలు. ముగ్గురూ అమెరికాలో ఉన్నతస్థాయి ఉద్యోగాల్లో ఉన్నారు

పెద్ద కుమార్తె - : స్పందన - భర్త కాటాబత్తుని బాల వెంకట రమణారావు
కుమారుడు 'మహేంద్ర వంశీ', కుమార్తె 'శ్రేయ'

రెండవ కుమార్తె - : భారతి - భర్త మాగంటి ప్రణయ దీపక్
కుమార్తె తన్వి, కుమారుడు అర్జున్

మూడవ కుమార్తె -: కవిత - భర్త జొన్నాదుల రాజేంద్రబాబు
కుమారుడు ఆర్య, కుమార్తె మాన్య

## బాల్యం - యవ్వనం

ఒకనాటి గుంటూరు జిల్లా, ఈనాటి ప్రకాశం జిల్లా చీరాల ఆయన పుట్టిన ఊరు.

తండ్రి శ్రీ రామనాథం పర్చూరు హైస్కూల్లో లైబ్రేరియనుగా పనిచేసేవారు. తల్లి శ్రీమతి ఇందిరాదేవి ప్రాథమిక పాఠశాలలో టీచరుగా ఉండేవారు.

సుబ్బారావుకు ఇద్దరు తమ్ముళ్ళు, ఒక చెల్లెలు. పెద్ద తమ్ముడు పేరు చిన్న సుబ్బారావు. ఆయన మొదట ఇండియన్ ఎయిర్ ఫోర్సులోనూ, తరువాత భారత్ ఎలక్ట్రానిక్స్ లోనూ పనిచేసి, హైదరాబాదులో విశ్రాంతి తీసుకుంటున్నారు.

చిన్న తమ్ముడు వెంకటరాములు. ఈయన స్టేట్ బ్యాంకులో పని చేసి రిటైరయ్యారు. చీరాలలోనే ఉంటున్నారు.

రాములుగారు కూడా మంచి కార్యకర్త. తన అన్నగారి లాగే పని ఉన్నచోట ముందుకు దూకే స్వభావం ఉన్నవాడు.

మేము నిర్వహించిన ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు మూడు పర్యాయాలూ రాములు గారు మాతో కలిసి పనిచేశారు. చాలా సందర్భాల్లో ఆయన ఉండటం వలన సభలు నిరాఘటంగా జరిగాయి కూడా!

చెల్లెలు భారతీదేవి అంటే సుబ్బారావుకు పంచప్రాణాలు.

చెరువులో ఉన్న దిగుడుబావిలోకి దిగి నీళ్ళు తీసుకొస్తూ జారిపడి ప్రాణాలు పోగొట్టుకుంది. తాను బతికున్నప్పుడు ఎప్పుడూ 'మా అన్నయ్య కవి' అని పిచ్చిగా చెప్పుకున్న ఆ చెల్లెలి స్మృతికి సుబ్బారావు తన ఏకైక పుస్తకం 'మనిషికోసం' అంకితం ఇచ్చారు.

మాతామహులు శ్రీ పెండెం వెంకట్రాములుగారు చేనేత నాయకులు. దేశభక్తులు, స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న ఆనాటి గుంటూరు జిల్లా ప్రముఖుల్లో ఒకరు. ఆయన రచయిత కూడా! వీరి రచన 'ఆంధ్రదేశ చేనేత ప్రముఖులు' గ్రంథం అప్పట్లో చాలా ప్రసిద్ధి పొందింది.

సుబ్బారావుగారి మీద తొలి ప్రభావం ఈ తాతగారిదే!

తాతగారివలనే చిన్ననాట సాహిత్యాభిమానం సుబ్బారావులో మొలకలెత్తింది.

మేనమామ శ్రీ పెండెం రవీంద్ర కూడా సాహిత్యవేత్తే! ఆయన ప్రముఖ విద్యార్థి నేతకూడా! మీదు మిక్కిలి గొప్ప కార్యకర్త. సుబ్బారావుగారికి పెండెం రవీంద్ర గారి దగ్గర చనువు ఎక్కువ. కార్యకర్తృత్వ లక్షణాలన్నీ శ్రీ సుబ్బారావు చిన్ననాడే రవీంద్రగారి దగ్గర చూసి నేర్చుకున్నారు. ఖాళీ సమయాలలో రవీంద్రగారితో కలిసి తిరుగుతుండేవారు.

సుబ్బారావుగారి ప్రాథమిక విద్య వేటపాలెంలోనూ, హైస్కూలు చదువు పర్చూరులోనూ జరిగాయి. చీరాలలో పియుసీ చదివారు. గుంటూరులో పాలిటెక్నిక్ కళాశాలలో సాంకేతిక విద్య చదివారు.

కానీ దానిమీద ఆయనకు ఆసక్తి కలగలేదు. బందరు వచ్చాక స్పెషల్ తెలుగు తీసుకుని బి.ఎ. డిగ్రీ పూర్తి చేశారు.

## పేదరికం

బిచ్చగాడు 'అయ్యా' అంటే! పర్సుతీసి 100కు తగ్గకుండా ఇచ్చే సుబ్బారావు బాల్యం సుఖంగా సాగింది కాదు.

తల్లిదండ్రులకు నలుగురు పిల్లల సంసారం కావటంతో కుటుంబం గడవటం కష్టంగా వుండేది. అందువలన పర్చూరులో సుబ్బారావు హైస్కూలు చదువంతా వారాలు చేసుకునే సాగింది. వారంలో ఏడు రోజులూ ఏడుగురు ఇళ్లలో భోజనం.

ఒక ఇంట్లో ఒకసారి ఆ ఇంటివారి ధోరణి నచ్చక ఇంక ఆ ఇంట్లో భోజనానికి వెళ్ళటం మానేశాడు. ప్రతివారం ఆ రోజున పస్తు ఉండేవాడు. అలా సాగింది ఆయన హైస్కూలు చదువు.

కాలేజీ చదువు కూడా దాతల సాయంతోనే గడిచింది.



శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారికి, శ్రీ డి.టి.పి. నాయక్ గారికి,
పుష్పగుచ్ఛాలు అందిస్తున్న సుబ్బారావు గారి రెండో కుమార్తె భారతి



శ్రీ సి. రాఘవాచారి, శ్రీ కె.రామమోహన్‌రాయ్ గార్లతో
ఏదో సీరియస్‌గా చర్చిస్తూ...

## ఉద్యోగాలు

1966లో గుంటూరు ఐ.యల్.టి.డి.లో మొదటి ఉద్యోగం.

ఆ ఉద్యోగం ఆయన ఆత్మాభిమానానికి ఒక తార్కాణంగా మిగిలిపోయింది. అప్పటి ఐ.యల్.టి.డి.లో పై స్థాయిలో ఉన్న ఉద్యోగి కూలీని అనవసరంగా నోరు పారేసుకున్నాడని సుబ్బారావు కలుగజేసుకుని విషయం వివరించబోయారు. దానికి రెచ్చిపోయిన సదరు పై ఉద్యోగి సుబ్బారావు మీద కూడా మాట తూలాడు.

అప్పుడు సుబ్బారావు అన్న మాటలివి :

"చూడండీ! ఈ కంపెనీ మన ఇద్దరిదీ కాదు. ఇందులో మీరు పెద్దకూలీ, నేను చిన్నకూలీ అంతే! ఇంత భాగ్యానికి నోరు పారేసుకోవటం సరికాదు" అని.

చివరికి ఇది మేనేజిమెంటు స్థాయికి వెళ్ళింది. సుబ్బారావు చిన్న ఉద్యోగుల్లో కూడా ఆత్మాభిమానం ఉంటుందనీ, తప్పున్నంత మాత్రాన ఒక కూలీనీ, ఒక చిన్న ఉద్యోగినీ ఏరా ఒరే భాషలో మాట్లాడటం పైస్థాయి ఉద్యోగులకు తగదనీ, ఉద్యోగుల ఆత్మాభిమానాన్ని కాపాడ లేకపోతే మీ దగ్గర పనిచేయటం కష్టం అనీ చెప్పేశారు.

సుబ్బారావుగారి రెండవ ఉద్యోగం హైదరాబాదులో తంతి తపాలా శాఖలో గుమాస్తాగిరి. 1967-70 మధ్యకాలంలో హైదరాబాద్ ప్రధాన తపాలాఫీసులో పని చేశారు.

'తంతి తపాలాశాఖ ఉద్యోగుల సమాఖ్య' జాతీయ స్థాయి ప్రతిష్టాత్మక సంస్థ. దాని హైదరాబాద్ యూనిట్ జాయింట్ సెక్రటరీగా సుబ్బారావు ఉండేవారు.

తంతితపాలా శాఖ రచయితల సమాఖ్యను కూడా అప్పుడే వ్యవస్థాపించారు.

మూడవదీ, ఆఖరిదీ బందరు ఎల్.ఐ.సీ.లో ఉద్యోగం. పోస్టల్ శాఖలో ఉన్నప్పుడు సుబ్బారావు జీతం 267 రూపాయలే. కాంపిటీటివ్ పరీక్షల్లో ఎంపిక కావటంతో బందరులో యల్.ఐ.సీ. ఉద్యోగం వచ్చింది. ఇందులో 30 రూపాయలు అదనంగా జీతం వచ్చింది. కానీ, అందువలన పోస్టల్ ఉద్యోగంతో పాటు సుబ్బారావు హైదరాబాదును కూడా వదులుకోవలసి వచ్చింది.

30 రూపాయలంటే ఈరోజున ఒక కప్పు కాఫీ ఖర్చు. కానీ, ఆ రోజున అది సుబ్బారావు జీవనగమనాన్ని మార్చేసింది. విశేషం ఏమంటే సుబ్బారావు ఏనాడూ తాను హైదరాబాద్‌లో వుండివుంటే ఇంతకన్నా ఎక్కువ ఘనకార్యం చేసి ఉండేవాణ్ణని ఏనాడూ అనకపోవటం, అనుకోకపోవటమే ఆయన పూర్తి వ్యక్తిత్వానికి నిదర్శనం.

## సుబ్బారావుగారి పెళ్ళి

ప్రేమించి పెద్దల అంగీకారం తీసుకుని, అవసరం అయితే కొంచెం ఎదిరించి, బెదిరించి మొత్తంమీద అందరి ఆమోదంతో ఘనంగా సుబ్బారావుగారి పెళ్ళి జరిగింది.

పెళ్ళికూతురు రామరత్నం సుబ్బారావుతో వివాహానికి ఇష్టంగా ఉంది. కానీ రామరత్నం తల్లిదండ్రులవేపు నుంచి కదలిక రాలేదు.

తన కొడుకు యోగ్యతలు తెలిసిన తల్లి కాబట్టి, తన బిడ్డ పొరబాటు నిర్ణయాలు తీసుకోడని నమ్మకం ఉంది కాబట్టి, సుబ్బారావు తల్లిగారు ఆడపెళ్ళివారింటికి స్వయంగా వెళ్ళి పెళ్ళి ప్రస్తావన తెచ్చారు!

రామరత్నం తండ్రి గారు ఒప్పుకున్నారు. కట్నం ఎంత కావాలని అడిగారు. "మావాడికి ఆదర్శాలెక్కువ. వాడికి కట్నాలంటే పడదు. అందుకని కట్నం వద్దు" అన్నారామె.

వెంటనే పిల్ల తండ్రి "మీ వాడిలో ఏదో లోపం ఉండబట్టే కట్నం వద్దంటున్నారు. లోపం ఉన్నవాడికి పిల్లనెలా ఇస్తాను?" అన్నారట.

ఆయన అమాయకత్వానికి అందరూ నవ్వుకున్నారు. కానీ, ఆయన తన పంతం వీడలేదు.

"మీరు ఇవ్వకపోతే మావాడే సుబ్బారావుతల్లి. మీ పిల్లని తీసుకెళ్ళి చేసుకొస్తాడు. నేనే దగ్గరుండి పెళ్ళి చేస్తాను" అన్నారు.

ఈ వివాదం ఇలా నడుస్తుండగా, ఒక పెద్దాయన వచ్చి, ఆదర్శవంతంగా జీవించే వాళ్ల ఆలోచనలు ఎంత ఉన్నతంగా ఉంటాయో వివరించి, పిల్ల తండ్రికి నచ్చచెప్పారు. అలా ఆ పిల్ల తండ్రి సుబ్బారావు మామగారయ్యారు.

అలా నచ్చచెప్పిన పెద్దాయన ప్రసిద్ధ సామాజిక వాది, శ్రీ రామనాథం కోటేశ్వరరావు గారు.

రామరత్నంగారి తండ్రి గోరంట్ల సత్యనారాయణ గారు. తల్లి శ్రీమతి ఆదిశేషమ్మ గారు. ఆ దంపతుల తొలి సంతతి రామరత్నం గారు.

ఆమెకు ఈశ్వర ప్రసాద రావు అనే సోదరుడు ఉన్నారు.

రమగారి చదువు కనగాల ప్రాథమిక పాఠశాలలోనూ, గూడవల్లి హైస్కూల్లోనూ, చీరాల యార్లగడ్డ అన్నపూర్ణమ్మ మహిళా కళాశాలలోనూ సాగింది.

తండ్రి సత్యనారాయణ గారు ఆడపిల్లలకు చదువెందుకు అనకపోవటాన, తన పుణ్యవశాన రామరత్నం గారు కాలేజీ చదువు పూర్తి చేశారు.

1972 జనవరి 26 రిపబ్లిక్ దినోత్సవం రోజున సుబ్బారావు రామరత్నం గార్ల వివాహం జరిగింది.




శ్రీ ముక్కామల నాగభూషణం, వి. రాజారామ్మోహనరావు (ఆరోగ్య విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్) శ్రీ విహారి, శ్రీ పూర్ణచందు (1991లో)




కీర్తిశేషులు శ్రీ బుడ్డిగ సుబ్బరాయన్ గారితో...

## రామరత్నంగారు

పిల్లలు పెద్దవాళ్ళయ్యేవరకూ రామరత్నంగారు ఒక సాధారణ గృహిణి. దైవభక్తి పరాయణురాలు. నెమ్మదిగా సంసారం చక్కదిద్దుకున్నారు. స్వంత ఇంటిని సమకూర్చుకున్నారు. పిల్లల్ని సాంకేతిక రంగంలో ఉన్నత విద్యావంతులుగా, నిపుణులుగా తీర్చిదిద్దారు.

పిల్లలు ముగ్గురూ అమెరికాలో స్థిరపడగలగటంలో ఆమె సంకల్ప బలం, ఆమెలో పెల్లుబికిన ఆత్మ విశ్వాసం ఎంతైనా కారణం. ఆమెలో ఒక తల్లి, ఒక భార్య మాత్రమే కాదు, ఒక పారిశ్రామికవేత్త కూడా ఉన్నారు. కుటుంబానికి తన అవసరం ఉన్నదనుకున్నప్పుడు ఆమెలోంచి ఆ పారిశ్రామికవేత్త బయటకు రావటంతో ఆమె సత్తా చాటుకోగలిగారు. అంచెలంచెలుగా ఎదిగి ఆమె ఒక సాధికారికతను సాధించారు.

1983లో సుబ్బారావు కేవలం రమగారి మీద ఆధారపడ గలననే నమ్మకం కుదిరిన తరువాతే, స్వంతంగా "స్పందన ప్రింటర్స్" సంస్థను ప్రారంభించారు. అది రమగారి ప్రెస్సుగా ప్రసిద్ధి పొందింది.

మచిలీపట్టణం లాంటి ఒక నగరంలో ఒక మహిళా ముద్రాపకురాలిగా రమగారు వాసికెక్కడానికి సుబ్బారావు ఆమెకిచ్చిన స్వేచ్ఛ, ప్రోత్సాహం, శిక్షణ ముఖ్యమైన అంశాలు. మచిలీపట్టణం లయన్స్‌క్లబ్ వారు ఉత్తమ ముద్రణాలయాధిపతిగా ఆమెను గుర్తించి సత్కరించారు. పదేళ్ళపాటు స్పందనా ప్రింటర్స్‌ను ఆమే నడిపేవారు. పేదింటి పెళ్ళికూతురు పెళ్ళికార్డుకు రమగారి ప్రెస్సులో డబ్బులు తీసుకోరనే ప్రచారం బందరులో బాగా జరిగింది.

'లివ్ అండ్ లెట్ లివ్' అన్నారు కదా అనేవారామె!

సుబ్బారావు గారు సీట్లో ఉంటే రచయితల దగ్గర అచ్చుపనికి డబ్బులు తీసుకునే వారు కాదు. ఇలా ఔదార్యాలతోనూ, వితరణలతోనూ ఆ దంపతులిద్దరూ ప్రెస్సుని పదేళ్ళపాటు నడప గలిగారంటే ఆశ్చర్యమే!

ఈ ప్రెస్సు పని లాభసాటిగా లేకపోవడానికి దానాలు ఒక కారణం. లెటర్ ప్రెస్సు రోజుల్లోంచి ఆఫ్‌సెట్ ప్రెస్సుల రోజుల్లోకి సమాజం మళ్లటం ఇంకో కారణం.

ఏ అదృశ్యశక్తి ప్రేరణో గానీ, రమగారు అచ్చు పరిశ్రమలోంచి అప్పచ్చుల పరిశ్రమ వైపు దృష్టి సారించారు. 1993లో గృహప్రియ ఫుడ్స్ సంస్థను స్థాపించారామె.

విజయవాడ శ్రీ శ్రీ ప్రింటర్స్ అధినేతలు విశ్వేశ్వరరావు, ప్రమీల దంపతుల ప్రోత్సాహం ఇందుకు కొంత కారణం. విజయవాడ స్వగృహఫుడ్స్ అధినేతలు కిషోర్, విజయకుమారి దంపతుల సహకారం, సలహా సూచనలతో గృహప్రియ ఫుడ్స్ పేరుతో ఆహార పరిశ్రమను స్థాపించారామె. కిషోర్ దంపతుల చేతులమీదుగానే ఆ పరిశ్రమను ప్రారంభింప చేశారు.

రమగారి గృహప్రియ ఫుడ్స్ పరిశ్రమ వలన అనేకమంది మహిళలకు జీవనోపాధి లభించింది. పరిశ్రమ లాభసాటిగా మారింది. ఈ సంస్థ రమ గారి చిరకాల కల.

కానీ, ఆమె ఒక స్థాయికి ఈ సంస్థను తీసుకువచ్చే లోగానే ఆమె అనారోగ్యం పాలయ్యారు.

Crohn's Disease అనే దీర్ఘవ్యాధి ఆమెను భయంకరంగా ఆవహించింది. పరమ నిష్ఠాగరిష్ఠంగా ఉండే రామరత్నం గారికి పేగుల్లో పలుగులు దిగినట్టు పేగుపూత వ్యాధి కమ్ముకుంది. Ulcerative Colitis అని కూడా ఈ వ్యాధిని అంటారు. కొండంత అండగా ఉండే భర్త, ముత్యాల్లాంటి ముగ్గురు పిల్లల్ని ఇచ్చినప్పటికీ ఆమెకు ఆరోగ్యం ఇవ్వలేక పోయాడా విధాత.

15 సంవత్సరాల పాటు ఆమె ఆ వ్యాధితో సతమతమయ్యారు. తగ్గటం-తిరగబెట్టటం ఒకదాన్ని వెన్నంటి ఒకటిగా వస్తుంటాయీ వ్యాధిలో. అయినా ఆమె ధైర్యం చెక్కు చెదర లేదు. ఆమె వ్యాధితో పోరాటానికే సిద్ధపడ్డారు.

తను మరణించే రోజు కూడా గృహప్రియ ఫుడ్స్ పరిశ్రమ పనిచేస్తూ ఉండాలన్న కోరిక ఆమెది.

నేనూ, మా ఇల్లాలూ ఒకసారి ఆమెను పలకరించటానికి వాళ్లింటికి వెళ్ళాము. ఆ సమయంలో సుబ్బారావు అమెరికాలో ఉన్నారు. అనారోగ్యంతో ఉన్నప్పటికీ, పైన హాల్లో కూచుని, కింద షాపులోనూ, పరిశ్రమలోనూ జరిగేదంతా సి.సి.కెమెరాల సాయంతో టీవీలో చూసుకుంటూ ఆమె సంస్థను నడిపేవారు.

"పిల్లల్ని పెద్దవాళ్లను చేశాను. అహోరాత్రాలూ కష్టపడి పెంచాను. వాళ్ళు నా కళ్ళముందు కాకుండా వేలమైళ్ల దూరంలో స్థిరపడ్డారు. ఈ కంప్యూటర్లు ఉన్నాయి కాబట్టి వాళ్లను రోజూ చూసుకుని మాట్లాడగలుగుతున్నాను. లేకపోతే కార్డుముక్కలకే పరిమితం అయ్యేవి కదా మానవసంబంధాలు" అన్నారామె.

"ఇప్పుడు ఈ పరిశ్రమే నా సర్వస్వం. వీళ్ళంతా నా పనివాళ్ళు కాదు, నా పిల్లలు" అంటూ ఆ టీవీలో సిసి కెమెరా దృశ్యాలవైపు చెయ్యి చూపించారు. "నా చివరి రోజున కూడా మా ఇంట్లో ఇదే దృశ్యం కనిపించాలి" అన్నారామె. వ్యాధి వశాన ఆరిపోయిన కుంపటి అంటే ఎలా ఉంటుందో ఆమె అలా అయిపోయారు. అయినా, ఆత్మబలం ఆవగింజంత కూడా సడలలేదు.

"అక్కా! నీ మనోబలమే నీకు ఆయుష్షు. నీకు స్వచ్ఛంద మరణమే ఉంటుంది. నువ్వు పుణ్యాత్మురాలివి" అన్నాన్నేను.

"అనారోగ్యం పేరు చెప్పుకుని దిగులు పడితే రోజుకు రోజు ఆయుష్షు తగ్గిపోతుంది పూర్ణచందూ..! నువ్వు డాక్టరువి కదా! నీకు చెప్పేదేముందీ? ఈ మాత్రమైనా ఆరోగ్యం ఉన్నందుకు సంతోషిస్తే రోజుకు రోజు ఆయుష్షు పెరుగుతుంది. చెయ్యవలసినవి చాలా ఉన్నాయి. అన్ని చేశాకే వెళ్తాను...నాకా నమ్మకం ఉంది" ఇవీ మాతో ఆమె అన్న మాటలు.

మరణించటానికి కొద్ది కాలం ముందు, అంత అనారోగ్యం లోనూ ఆమె రోటరీ మహిళావిభాగం వారి ఉత్తమ మహిళా పారిశ్రామికవేత్త పురస్కారాన్ని వెళ్ళి అందుకున్నారు. మంచాన పటటం అనే దృశ్యాన్ని కలలో కూడా కనిపించటానికి ఇష్టపడని వ్యక్తిత్వం ఆమెది.

15 సంవత్సరాల అల్సరేటివ్ కోలైటీస్, (క్రోన్స్ డిసీజ్) వ్యాధితో ఆమె 23-11-2013న విజయవాడలో ఒక ప్రైవేట్ ఆసుపత్రిలో పరమపదించారు. నిజానికి ఆస్పత్రిలో చేరాక పర్వాలేదని ఐసీయూలోంచి రూములోకి మార్చారు. ఇంకా మూడో అమ్మాయి కవిత వీసా ఇబ్బందుల వల్ల రావటం ఆలస్యం అయ్యింది. ఆమె కూడా వచ్చే వరకూ ప్రాణాలు ఉగ్గబట్టుకున్నారు. కృత్రిమశ్వాస మీద బతికించటమే తప్ప బ్రతకటం అసాధ్యం అన్న సంగతి ఆమెకు అర్థం అయిపోయింది.

ముగ్గురు పిల్లల్నీ చూసుకున్నాకే పూర్తి స్పృహలోనే ఉండి, వెంటిలేటరుకు సంబంధించినవన్నీ తీయటానికి డాక్టర్లను అనుమతించి ఆమె స్వచ్ఛంద మరణం పొందారు. మరణానంతరం శంకర నేత్రాలయ వారికి ఆమె నేత్రాలు దానం చేశారు. ఆ ఇద్దరి కళ్ళతో ఆమె ఈ లోకాన్ని ఇంకా సజీవంగా చూస్తూనే ఉన్నారు.




జి.వి. పూర్ణచంద్ రచన 'అమలిన శృంగారం" ఆవిష్కరణ సభలో
శ్రీ నండూరి రామమోహనరావు, శ్రీ పురాణం సుబ్రహ్మణ్య శర్మ,
శ్రీ పి.వి. రమణయ్యరాజా, శ్రీ ఇచ్ఛాపురపు జగన్నాథరావు, శ్రీ రాంషా,
శ్రీమతి డి. సుజాతాదేవి గార్లతో స్పందన సాహితీ సమాఖ్య సభ్యులు

## కార్యకర్తగా శ్రీ సుబ్బారావు

రమగారు సుబ్బారావుని రచయిత అనీ, కార్యకర్త అనీ తెలిసే పెళ్ళి చేసుకున్నారు. పెళ్ళయ్యాక సుబ్బారావులో కార్యకర్తృత్వం మరింత వన్నెకెక్కింది.

శ్రీయుతులు కుందుర్తి, ఆచార్య వంగపల్లి విశ్వనాథం, జానమద్ది హనుమచ్ఛాస్త్రి, పోతుకూచి సాంబశివరావు ప్రభృతుల స్థాయిలో ఎన్నదగిన కార్యకర్తగా, సాహితీవేత్తగా, ఒక అభ్యుదయ భావావేశంతో ముందుకు సాగిపోసాగాడు సుబ్బారావు. ఒక అభ్యుదయ భావావేశంతో.

హైదరాబాదులో ఉన్న కాలంలో స్పందన సాహితీ సమాఖ్య ద్వారా అనేక సాహిత్య కార్యక్రమాలు చేశారు. వివిధ కవుల కవితా సంపుటి స్పందన, భైరవయ్య "రా!" పుస్తకాలు ఆ సంస్థ ద్వారా ప్రచురించారు.

వచన కవితా పితామహుడు కుందుర్తికి అనుయాయి. ఫ్రీవర్స్ ఫ్రంటుకు ముఖ్య కార్యదర్శిగా ఉండేవారు. వేకువ పత్రికను శ్రీ శివారెడ్డితో కలిసి నిర్వహించారు.

మచిలీపట్టణం వచ్చిన తరువాత ఆంధ్ర సారస్వత సమితి ప్రధాన కార్యదర్శిగా

పనిచేశారు. ఆ సమయంలోనే అనేక సాహితీ కార్యక్రమాలతో పాటు, "తెలుగు కథ" అనే విశ్లేషణా గ్రంథం ప్రచురించారు.

ఆ తరువాత స్పందన సాహితీ సమాఖ్యను బందరులో పునః ప్రారంభించారు. ఆ సంస్థ ద్వారా 60కి పైగా పుస్తకాలు ప్రచురించారు. ఈ రచయితల్లో ఎక్కువమందికి మొదటి పుస్తకాలు కావటం విశేషం.

బందరులో స్పందన ఆ రోజుల్లో ఒక సాహితీ చైతన్యానికి ప్రతీకగా ఉండేది. కృష్ణాజిల్లా రచయితల 4వ మహాసభలు, ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభలు, మినీకవితా సదస్సు, తెలుగు సాహితీ సంస్థల సమన్వయ సమాఖ్య వ్యవస్థాపన లాంటి ముఖ్య కార్యక్రమాలకు ఆతిథ్యం వహించి ఆ సంస్థ ప్రధాన కార్యదర్శిగానూ, అధ్యక్షుడిగానూ శ్రీ సుబ్బారావు పాత్ర ప్రముఖమైంది.

పూర్వపు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీకి రెండు పర్యాయాలు సభ్యుడిగా ఎన్నికయ్యారు. అకాడెమీలో కార్యవర్గ సభ్యుడిగా పోటీ చేసి గెలిచారు. ఆధునిక సాహిత్యానికి అకాడెమీలో తగిన ప్రాతినిధ్యం కోసం పోరాడారు.

అకాడెమీల రద్దు సమయంలో ఆం.ప్ర. సాహిత్య అకాడెమీ పనితీరును మెరుగు పరచటానికి సూచనలు చేయవలసిందిగా శ్రీ సుబ్బారావుతో ఏకసభ్య కమిటీని అకాడెమీ నియమించింది. శ్రీ సుబ్బారావు తగు సూచనలతో సమర్పించిన రిపోర్ట్ ఈ పుస్తకంలో ప్రచురిస్తున్నాం.




శ్రీ వీరాజీ, డా॥ పోతుకూచి వెంకటేశ్వర్లు గార్లతో...

## భాషోద్యమంలో శ్రీ సుబ్బారావు

1983లో కృష్ణాజిల్లా రచయితల సంఘం వ్యవస్థాపన జరిగింది. వ్యవస్థాపక ప్రధాన కార్యదర్శిగా ఉన్నారు. 6 పర్యాయాలు కృష్ణాజిల్లా రచయితల మహాసభలు నిర్వహించారు. శ్రీ జోశ్యుల సూర్యనారాయణ మూర్తి రచనతో పాటు, శ్రీ ముక్కామల నాగభూషణం జీవిత చరిత్ర, వారిదే 'అసురనాగరికత' పరిశోధనాత్మక రచన, డా. జి వి పూర్ణచందు సప్తసింధు నవలలను ప్రచురించారు.

2005లో కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని పునరుద్ధరణ చేసి, దాని అధ్యక్షుడిగా అనితర సాధ్యం అన్నంతగా అనేక భాషోద్యమ పరమైన కార్యక్రమాలు చేపట్టారు. 2006లో జాతీయ తెలుగు రచయితల మహాసభలు, 2007, 2011, 2015లలో 3 పర్యాయాలు ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు నిర్వహించారు. తెలుగుపసిడి, వజ్రభారతి. తెలుగు భాష-విశిష్ట ప్రాచీనత, సంపన్నత; కృష్ణాజిల్లా సర్వస్వం, History of Krishna District , శ్రీకాకుళాంధ్ర విష్ణు దేవాలయ చరిత్ర, తానా వారి సహకారంతో తెలుగు సంస్కృతి, తెలుగు పున్నమి, తెలుగు వెన్నెల, తెలుగు భారతి, తెలుగు వ్యాసమండలి, శ్రీ మండలి బుద్ధప్రసాద్ స్వర్ణయానం,



నెల్లూరు స్వర్ణభారత్ ట్రస్టు ప్రాంగణంలో
కేంద్రమంత్రి శ్రీ యం. వెంకయ్యానాయుడు, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గార్లతో

సేవాయానం, విశ్వనాథ సత్యనారాయణ సాహితీ విశ్వరూపం లాంటి ఉద్గ్రంథాలకు సంపాదకత్వం వహించి ప్రచురించారు.

భాషోద్యమ కోసం తెలుగు ప్రజల గుండె తలుపులు తట్టి, మాతృభాషాభిమానాన్ని రేకెత్తించటం కోసం మచిలీపట్టణం నుండి నెల్లూరు వరకూ నాలుగు జిల్లాల రచయితల సంఘాలతో కలిసి రచయితల పాదయాత్ర నిర్వహించారు. ఊరూరా తెలుగు భాషా సదస్సులు నిర్వహించారు. భాషోద్యమానికి చోదక శక్తిగా నిలిచారు.

తెలుగు భాష ప్రాచీనత, తెలుగులో న్యాయ పాలన, అంతర్జాలంలో తెలుగు అమలు, కృష్ణా, సింధు నాగరికతల అధ్యయన సదస్సు లాంటి 15 జాతీయ సదస్సులను నిర్వహించారు.

తెలుగు భాషకు క్లాసికల్ హోదా రావటానికి అడ్డుగా ఉన్న చెన్నై హైకోర్టులోని కేసుని కొట్టివేయ వలసిందిగా కోరుతూ సుప్రీంకోర్టులో వేసిన దావా ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘంతో కలిసి కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన ఒక కక్షిదారుడుగా ఇంప్లీడ్ అయ్యారు.

2008లో కృష్ణా విశ్వవిద్యాలయంలో తగిన సంఖ్యలో విద్యార్థులు తెలుగు ఎమ్మేలో చేరటం లేదనీ, ఈ కారణంగా కృష్ణా విశ్వవిద్యాలయంలో తెలుగు శాఖ లేకుండా ప్యాకేజీని పంపటం జరిగింది. అది తెలిసి శ్రీ బుద్ధప్రసాద్‌తో మాట్లాడి, తెలుగు శాఖ ఉండేలా ఉన్నత విద్యామండలిని ఒప్పించ గలిగారు.

ఫీజులు కట్టుకోలేని విద్యార్థులు తెలుగు ఎమ్మే చదివే ఉత్సాహం ఉన్నట్లైతే వారి ఫీజులు కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన కట్టేందుకు నిర్ణయం తీసుకున్నారు. మొదటి సంవత్సరం 12 మందికి ఆ విధంగా ఫీజులు చెల్లించారు. రెండవ సంవత్సరానికి వారిలో 6 మందికి ఫీజు రీఎంబర్స్‌మెంటు అవకాశం కలగటంతో తక్కిన 6 మందికీ ఫీజులు చెల్లించారు. కృ.జి.ర.సం. ఫీజులు చెల్లించిన విద్యార్థులలో ఎక్కువమందికి లెక్చరర్ ఉద్యోగాలు క్యాంపస్ సెలెక్షన్‌లో రావటం విశేషం. శ్రమ వృథాపోలేదనే సంతృప్తి ఆయనకు కలిగింది. విశ్వ విద్యాలయ ఉపకులపతి ఆచార్య మైనేని కేశవ దుర్గాప్రసాద్ పూనికతోనూ, చొరవతోనూ ఇదంతా సాధ్యం అయ్యింది.




శ్రీ వేటూరి సుందరరామ్మూర్తి గారికి జ్ఞాపికను అందిస్తూ...

## శ్రీ సుబ్బారావు పొందిన పురస్కారాలు - సత్కారాలు

శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం, ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం, కృష్ణావిద్యాలయాలు తమ సదస్సులలో పలు పర్యాయాలు వీరిని సభాధ్యక్షుడిగా లేదా ముఖ్య అతిథిగా ఆహ్వానించి సత్కరించాయి.

1980 : మచిలీపట్టణం వైజ్‌మన్ క్లబ్ "Outstanding Young Person of The Year Award"

1981 : పులుపుల శివయ్య (గుంటూరు) సాహితీ పురస్కారం

– భారతజ్యోతి బెంగుళూరు పురస్కారం

2008 : ఆంధ్రసారస్వత సమితి మచిలీపట్టణం కీ.శే. చలమలశెట్టి నాంచారయ్య స్మారక విశిష్ట పురస్కారం

2008 : కృష్ణా ఇండస్ట్రియల్ ఎగ్జిబిషన్ సొసైటీ వారి విశిష్ట సత్కారం

2008 : యువభారతి హైదరాబాదు సహృదయ అభినందన పురస్కారం

2009 : ఆకాశవాణి విజయవాడ కేంద్ర స్వర్ణోత్సవ సత్కారం

2009 : వైజ్‌మన్ క్లబ్స్ ఇంటర్నేషనల్ విజయవాడ - ప్రతిభా పురస్కారం

2009 : జ్యోత్స్న కళాపీఠం "తెలుగు భాషాపురస్కారం"

2010 : ఉత్తర అమెరికా తెలుగు సంఘం (తానా) సాహితీ పురస్కారం

2012 : కృష్ణాజిల్లా సాంస్కృతికమండలి వారిచే ఉగాది ప్రతిభా పురస్కారం

2012 : 4వ ప్రపంచ తెలుగు మహాసభలు(తిరుపతి) సందర్భంగా కృష్ణాజిల్లా సాంస్కృతిక మండలి ప్రత్యేక సత్కారం

2015 : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఉగాది విశిష్ట పురస్కారం

2015 : ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు భాషా దినోత్సవ పురస్కారం

2016 : పశ్చిమగోదావరి జిల్లా రచయితలచే గోదావరీ మాత పురస్కారం

2017 : ప్రకాశం జిల్లా రచయితల సమాఖ్య ప్రతిభా పురస్కారం



ప్రొ. తుమ్మల వేణుగోపాలరావు, మృణాళిని,
శ్రీ తుమ్మల వెంకటరామయ్య గార్లతో...

## శ్రీ సుబ్బారావు అందిస్తున్న సాహితీ సేవా పురస్కారాలు

సాహితీ సేవకుల గురించి ఆలోచించే వారు తక్కువ. విశ్వవిద్యాలయాలు, ఇతర సంస్థలూ వివిధ రంగాలకు చెందిన రచయితలకు ఇచ్చే గుర్తింపు సాహితీ సంస్థల నిర్వాహకులకు, కార్యకర్తలకు ఇవ్వటంలేదు. కృష్ణాజిల్లా రచయితల సంఘం పురస్కారాలు ఇవ్వాలనే ఆలోచన చేసినప్పుడు సుబ్బారావు సంవత్సరానికి 10 వేల రూపాయలు వడ్డీ వచ్చే విధంగా బ్యాంకులో సొమ్ము డిపాజిట్ చేసి గుత్తికొండ సుబ్బారావు సాహితీ సేవా పురస్కారాన్ని కేవలం సాహిత్య కార్యకర్తలకు మాత్రమే ఇచ్చే ఉద్దేశంతో నెలకొల్పారు.

కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన గుత్తికొండ సుబ్బారావు సాహితీ సేవా పురస్కారాన్ని ఇప్పటివరకూ అందుకున్న వారు :

1. శ్రీ పోతుకూచి సాంబశివరావు (హైదరాబాద్)
2. ఆచార్య వంగపల్లి విశ్వనాథం (హైదరాబాద్)
3. శ్రీ వై.యస్. నరసింహారావు
4. గూడ శ్రీ రాములు (భిలాయ్)
5. శ్రీమతి తుర్లపాటి రాజేశ్వరి (బరంపురం)
6. డా. రాధేయ (అనంతపురం)

ఆంధ్ర సారస్వత సమితి పక్షాన గుత్తికొండ సుబ్బారావు సాహితీ సేవా పురస్కారం అందుకున్నవారు :

1. బొబ్బిళ్లపాటి సాయి,
2. శ్రీమతి మాదిరాజు శివలక్ష్మి
3. శ్రీ గబ్బిట దుర్గాప్రసాద్

పట్టాభి కళాపీఠం పక్షాన గుత్తికొండ సుబ్బారావు సాహితీ సేవాపురస్కారం అందుకున్నవారు :

1. శ్రీమతి పుట్టి నాగలక్ష్మి
2. శ్రీ సి.ఆర్. దాసు

పట్టాభి కళాపీఠం పక్షాన గుత్తికొండ రామరత్నం స్మారక సాహితీ సేవా పురస్కారం అందుకున్నవారు



జాతీయ తెలుగు రచయితల మహాసభల్లో ప్రారంభ దృశ్యం.
డా॥ గూటాల కృష్ణమూర్తి, ప్రఖ్యాత తమిళ రచయిత్రి శ్రీమతి మహేశ్వరి,
శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ ప్రభృతులు

1. డా. జి వి పూర్ణచందు
2. శ్రీ భవిష్య

## సమాజ సేవాకార్యక్రమాలు :

భార్య శ్రీమతి గుత్తికొండ రామరత్నం మరణించాక శ్రీ సుబ్బారావు వంటరి అయ్యారు. ఆయన కుమార్తెలు, చుట్టూ ఉన్న మిత్రులు అందించిన కొండంత మనోబలంతో ఆయన ఆత్మవిశ్వాసాన్ని పెంచుకుని తిరిగి కార్యక్రమాలలో నిమగ్నమై పోయారు. శ్రీమతి గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్ పేరుతో ఒక సేవా సంస్థ నెలకొల్పారు. దాని పక్షాన పేద విద్యార్థుల కోసం కొన్ని స్కాలర్‌షిప్పులు అందించటం, యూనిఫారాలు ఇవ్వటం, స్కూలు ఫీజులు కట్టటం లాంటి పలు విద్యార్థి సేవలు అందించారు.

అంతలో కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆధ్వర్యంలో మూడవ ప్రపంచ రచయితల మహా సభలు దగ్గర పడుతుండగా సుబ్బారావు ఆరోగ్యం దెబ్బతింది.

అత్యవసరంగా గుండె ఆపరేషన్ చేయించాల్సి వచ్చింది. సభలకు సరిగ్గా నెలకూడా లేని పరిస్థితి. అయినా ఆయన తట్టుకుని 3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలను దిగ్విజయంగా జరిపించారు.

## సంపాదకుడిగా శ్రీ గుత్తికొండ సుబ్బారావు

2006 : తెలుగు పసిడి (ఆంధ్రప్రదేశ్ స్వర్ణోత్సవ ప్రత్యేక ప్రచురణ)
2007 : వజ్రభారతి(భారత స్వాతంత్ర్య వజ్రోత్సవ ప్రత్యేక ప్రచురణ)
2007 : స్వర్ణయానం (శ్రీ మండలి బుద్ధప్రసాద్ జీవిత స్వర్ణోత్సవ సంచిక)
2008 : తెలుగు భాష విశిష్టత-ప్రాచీనత
2010 : తెలుగు మణిదీపాలు
2010 : కృష్ణాజిల్లా సర్వస్వం
2011 : తెలుగు వ్యాస మండలి
2012 : తరతరాల తెలుగు సంస్కృతి-తానా చైతన్య స్రవంతి
2012 : తెలుగు పున్నమి
2014 : సేవాయానం (శ్రీ మండలి బుద్ధప్రసాద్ అభినందన సంచిక)
2015 : తెలుగు భారతి
2016 : విశ్వనాథ సాహితీ విశ్వరూపం
2016 : స్వాతంత్ర్య సమర యోధుల ఆత్మకథలు
2016 : ప్రబుద్ధ భారతి
2016 : కృష్ణాతీరం-ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ ప్రచురణ




ఆచార్య పేర్వారం జగన్నాథం, డా॥ కత్తి పద్మారావు గార్లతో...

## వివిధ విశ్వవిద్యాలయాలు, సంస్థలలో అతిథిగా :

1981 : 'మినీ కవిత స్వరూప స్వభావాలు' సదస్సు : ముఖ్య అతిథి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం-తెలుగు శాఖ

2006 : శ్రీకృష్ణదేవరాయ చారిత్రక వైభవం జాతీయ సదస్సు, శ్రీకాకుళం: సభాధ్యక్షత

2007 : ప్రపంచ తెలుగు సాహిత్య మహాసభలు: వంగూరి ఫౌండేషన్ నిర్వహణ, హైదరాబాదు-సభాధ్యక్షత

2008 : తెలుగు భాషా ప్రాచీనత-విధాన నిర్ణయ ప్రకటనా ప్రసంగం, అ.ర.సం. గుంటూరు %u% సభాధ్యక్షత

2008 : ఘంటసాల బౌద్ధస్తూపం పునర్నిర్మాణ ప్రారంభ సభ, ఘంటసాల

2008 : తెలుగు భాష ప్రాచీనతా ప్రతిపత్తి విజయం-మన భవిష్య ప్రణాళికలు భారత గ్రామీణ అధ్యయనం

2009 : అన్నమయ్య జీవితం-టిటిడి మరియు కృష్ణవిశ్వవిద్యాలయం ఆధ్వర్యంలో సదస్సు-ఆత్మీయ అతిథి.

2010 : తెలుగు మాండలికాలపై  జాతీయ సదస్సు: కృష్ణ విశ్వవిద్యాలయం- సభాధ్యక్షత

2010 : శ్రీకృష్ణదేవరాయ పట్టాభిషేక పంచశతాబ్ది మహోత్సవాలు-ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక శాఖ నిర్వహణ- ఆత్మీయ అతిథి

2011 : జాషువా సాహిత్య సమాలోచన-నవ్య సాహిత్య మండలి, పశ్చిమ గోదావరి జిల్లా రచయితల సంఘం నిర్వహణ- ముఖ్య అతిథి




శ్రీ అద్దేపల్లి రామమోహనరావుతో ఆత్మీయ ఆలింగనం




డా॥ రాపాక ఏకాంబరాచార్యులు గారిని సత్కరిస్తూ...

## అన్నపూర్ణ వృద్ధుల సేవాశ్రమం

1999లో సామాజిక కార్యకర్త శ్రీమతి కరెడ్ల సుశీల వ్యవస్థాపక అధ్యక్షురాలిగా స్థాపించిన అన్నపూర్ణ వృద్ధుల సేవాశ్రమం ద్వారా ఆమె నిరాశ్రయులైన అనాథ వృద్ధులకు ఉచిత భోజన వసతి సౌకర్యాలు గత 17 సంవత్సరాలుగా కల్పిస్తూ వస్తున్నారు.

వృద్ధుల దగ్గర ప్రతినెలా కొంత డబ్బు తీసుకుని సేవలందించే సంస్థలు చాలా ఉంటాయి. కానీ, ఈ సంస్థ పూర్తి ఉచితంగా వసతి, భోజనంతో పాటు చివరికి దివంగతులైన వృద్ధులకు మట్టిఖర్చులు కూడా భరిస్తూ పనిచేయటం ఒక విశేషం.

దాదాపు రెండు దశాబ్దాలుగా వృద్ధాశ్రమ స్థాపన గురించి తీవ్రంగా ఆలోచిస్తున్న శ్రీ సుబ్బారావుకు సుమారు 7-8 సంవత్సరాల క్రితం శ్రీమతి సుశీలగారు పరిచయం అయ్యారు. అనతి కాలంలోనే సుశీల గారు సుబ్బారావుగారి భార్య రామరత్నం గారికి బాగా దగ్గరయ్యారు. అంకుల్, ఆంటీ అని పిలుస్తూ ఆ కుటుంబానికీ, వారి పిల్లలకు ఆమె ఎంతో చేరువయ్యారు. సుశీలగారి అబ్బాయి, కోడలు కూడా సుబ్బారావు గారి కుటుంబంతో సన్నిహితంగా ఉంటారు.

ఆ విధంగా సుబ్బారావు అన్నపూర్ణ వృద్ధుల సేవాశ్రమం పని తీరుని చాలా దగ్గరగా పరిశీలించటం జరిగింది. అంతకన్నా పెద్ద స్థాయిలో ఈ సంస్థను నడపాలంటే సుశీలగారికి చేయూత అవసరం అని ఆయన గ్రహించారు. దాని కార్య నిర్వహణాభారాన్ని తాను కూడా కొంత మోయటానికి సుబ్బారావు సన్నద్ధులయ్యారు.

ఈ ఆశ్రమానికి స్వంత భవన నిర్మాణానికి సుమారుగా ఆరేళ్ళక్రితం బందరు పట్టణానికి చెందిన శాణం సోమేశ్వరరావు, సంపత్కుమారి దంపతులు వితరణతతో 500 గజాల స్థలాన్ని దానంగా ఇచ్చారు. దాని కోర్టు వివాదాలన్నీ పరిష్కారం అయ్యాక శ్రీ సుబ్బారావు ఆ స్థలంలో శంకుస్థాపన చేసి, దివంగత దంపతుల కోరికను కార్య రూపంలోకి తెచ్చారు. తాను ప్రధాన కార్యదర్శిగా, సుశీలగారు వ్యవస్థాపక అధ్యక్షురాలిగా భవన నిర్మాణాన్ని ప్రారంభించారు.

శ్రీ సుబ్బారావు కుటుంబం పక్షాన ఆయన, వారి ముగ్గురమ్మాయిలూ ఇచ్చిన భూరి విరాళంతో తొలుత భవన నిర్మాణం పనులు ప్రారంభింప చేశారు. వారి విరాళం అధిక భాగంగా ఉండటంతో భవన సముదాయానికి శ్రీమతి గుత్తికొండ రామరత్నం సేవా సదనం అని నామకరణం చేశారు,

శ్రీ సుబ్బారావు పలుకుబడి బాగా ఉపయోగించి, సేకరించిన విరాళాలు కూడా తోడు కావటంతో వేగంగా భవన నిర్మాణం పూర్తయి, ప్రారంభానికి సిద్ధం అయ్యింది. 7-8-2016 ఉదయం దాని ప్రారంభోత్సవానికి ముహూర్తం నిర్ణయించారు.



చిరకాల మిత్రుడు ఆచార్య చందు సుబ్బారావుతో...



ఆచార్య వంగపల్లి విశ్వనాథం, శ్రీ బుద్ధప్రసాద్,
శ్రీ వేటూరి సుందరరామ్మూర్తి, శ్రీ కూచిబొట్ల ఆనంద్ ప్రభృతులతో...

## స్వర్ణోత్సవ సాహితీ సంస్థ
## కృష్ణాజిల్లా రచయితల సంఘం

స్వర్ణోత్సవ సాహితీ సంస్థ కృష్ణాజిల్లా రచయితల సంఘానికి 1967లో కృష్ణాజిల్లా సాహితీవేత్తలే పురుడు పోశారు. అది మొదటి కృష్ణాజిల్లా రచయితల మహాసభలు జరిగిన సందర్భం. 01-08-1967న విజయవాడ రైస్ మిల్లర్స్ సంస్థ హాలులో ఈ మహాసభలు జరిగాయి. నార్ల వెంకటేశ్వరరావు ఈ సభలను ప్రారంభించారు. సభలు ఒక్కరోజే జరిగాయి. జిల్లా రచయితలే ఒక ఆహ్వాన సంఘంగా ఏర్పడి ఈ సభలు నిర్వహించారు.

మళ్ళీ ఏడాదికి, 1968 మార్చి 10, 11 తేదీలలో కృష్ణాజిల్లా రచయితల 2వ మహాసభలు జరిగాయి. ఈ సభలను కొండా లక్షణ్ బాపూజీ ప్రారంభించారు. విజయవాడ రామ్మోహన గ్రంథాలయం మేడ మీద హాలులో రెండు రోజులపాటు ఈ సభలు జరిగాయి. మొదటి సభల ఆహ్వాన సంఘమే ఇంచుమించుగా ఈ సభలకూ సారథ్యం వహించారు.

రెండేళ్ళ విరామం తరువాత 1970 జూన్ 27, 28 తేదీలలో కృష్ణాజిల్లా గుడివాడలో 3వ కృష్ణాజిల్లా రచయితల మహాసభలు జరిగాయి. ఆ సమయంలో పెనుతుఫాను, ఎడతెరిపి లేని వర్షంలో కూడా ఆగకుండా సభలు జరిగాయి. కవిసమ్రాట్ త్రిపురనేని వెంకటేశ్వర రావుగారు ఈ సభలను ప్రారంభించారు. సభల్ని గుడివాడ కవిరాజ కళామందిరంలో నిర్వహించారు. ఆరుద్ర, సోమసుందర్, గజ్జెల మల్లారెడ్డి యమ్.వి.యల్ ప్రభృతులు పాల్గొన్నారు.

1976 నవంబరు 20,21 తేదీలలో మచిలీపట్టణం స్పందన సాహితీ సమాఖ్య 4వ మహాసభకు ఆతిథ్యం ఇచ్చింది. శ్రీయుతులు విహారి, శాలివాహన, గుత్తికొండ సుబ్బారావు, జి వి పూర్ణచందు, పువ్వాడ తిక్కన సోమయాజి ప్రభృతులు సారథ్యం వహించారు. కవిసమ్రాట్ విశ్వనాథ దివ్యస్మృతికి అంకితంగా ఆ సభలను నిర్వహించారు.

ఆ తరువాత అవనిగడ్డ గాంధీక్షేత్రంలో కృష్ణాజిల్లా రచయితల 5వ మహాసభలు జరిగాయి. శ్రీ మండలి వెంకట కృష్ణారావుగారు, శ్రీ బుద్ధప్రసాద్ ఈ సభలకు ఆతిథ్యం ఇచ్చారు. ఆనాటి ప్రభుత్వ ఆస్థానకవి దాశరథి సభలకు అధ్యక్షత వహించారు. ఆరుద్ర, లత, అద్దేపల్లి ప్రభృతులు విచ్చేశారు.

ఈ సభల సందర్భంగా కృష్ణాజిల్లా రచయితల సంఘం ఆవిర్భావానికి నిర్ణయం తీసుకోవటం జరిగింది. 1983లో కృష్ణాజిల్లా రచయితల సంఘం రిజిష్టర్ అయ్యింది. శ్రీమతి ఇల్లిందల సరస్వతీదేవి కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని ప్రారంభించారు.

మండలి వెంకట కృష్ణారావుగారు గౌరవాధ్యక్షుడిగా, ముక్కామల నాగభూషణం గారు అధ్యక్షుడిగా, కళాప్రపూర్ణ తెన్నేటి హేమలత, డా. త్రిపురనేని వెంకటేశ్వరరావు, డా.పోతుకూచి వెంకటేశ్వర్లు ఉపాధ్యక్షులుగా, గుత్తికొండ సుబ్బారావు ప్రధాన కార్యదర్శిగా, శ్రీ మైత్రేయ కోశాధికారిగా, శ్రీ బుద్ధప్రసాద్, డా. జి. వి. పూర్ణచంద్ కార్యదర్శులుగా తొలి కార్యవర్గం ఏర్పడింది. దాదాపు ఆరు మహాసభలు, అనేక పుస్తకాలు ఇంకా చాలా సాహిత్య కార్యక్రమాలూ జరిగాయి.

తరువాతి కాలంలో నాగభూషణంగారు, మండలి వెంకట కృష్ణారావుగారు, డా. త్రిపురనేని వెంకటేశ్వర రావు గారు, రచయిత్రి లత, మైత్రేయ ఇలా ఒక్కరొక్కరే కాలం చేయటంతో కృష్ణాజిల్లా రచయితల సంఘం కుంటుపడింది.

కనీసం ఆరేడు సంవత్సరాల విరామం తరువాత 2005లో కృష్ణామహోత్సవ్ సందర్భంలో అవనిగడ్డలో ఒక సాహితీ సభను ఏర్పాటు చేసి కృష్ణాజిల్లా రచయితల సంఘానికి తిరిగి ప్రాణప్రతిష్ట జరిగింది. శ్రీ బుద్ధప్రసాద్ గౌరవాధ్యక్షులుగా, శ్రీ గుత్తికొండ సుబ్బారావు, డా. జి వి పూర్ణచందు అధ్యక్ష, కార్యదర్శులుగా కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని పునరుద్ధరించారు. అప్పటినుండీ, సంస్థ ప్రధాన కార్యక్రమాలను తెలుగు భాషోద్యమం ధ్యేయంగా నిర్వహించటం జరిగింది. ఊరూరా తెలుగు భాషా సదస్సులు ఏర్పాటు చేయటం ద్వారా ప్రజల గుండె తలుపులు తట్టే కార్యక్రమాలకు శ్రీకారం చుట్టటం జరిగింది.

1. 2006 అక్టోబర్ 27, 28 తేదీలలో జాతీయ తెలుగు రచయితల మహాసభలు, 50 ఏళ్ళ ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు భాషా సాహిత్యాలు పొందిన పరిణామక్రమాన్ని విశ్లేషిస్తూ 112 పరిశోధనా వ్యాసాలతో వెయ్యి పుటల 'తెలుగుపసిడి' ఉద్గ్రంథం ప్రచురించటం జరిగింది. ఇమ్మిడిశెట్టి అక్కేశ్వరరావు ఛారిటబుల్ ట్రస్ట్ ఈ పుస్తక ప్రచురణకు సౌజన్యం వహించింది.
2. 2007లో ఆధునిక సాంకేతిక పరిజ్ఞానానికి అనుగుణంగా తెలుగు భాషను ఆధునీకరించే అంశంపైన, తెలుగు యూనీకోడ్ లిపిని అభివృద్ధి చేయటం

పైన విజయవాడలో ఒక జాతీయ సదస్సు నిర్వహించాము. ఆ సదస్సులో 'తెలుగు పసిడి' కృష్ణాజిల్లా రచయితల సంఘం వెబ్‌సైట్ కూడా ఆయన ప్రారంభించారు.

3. 2007 సెప్టెంబర్ 21-23లలో మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభలను విజయవాడలో నిర్వహింప చేసి, భాషోద్యమ దీప్తిని తెలుగు ప్రజలలో కలిగించ గలిగింది కృ.జి.ర.సం. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చిన వజ్రోత్సవాల సందర్భంగా ఈ సభలు జరిగాయి, ప్రజలలో భాషోద్యమ స్ఫూర్తిని కలిగించి, భాషాభిమానాన్ని రేకెత్తించటమే లక్ష్యంగా ఈ ప్రపంచ సభలను నిర్వహిస్తున్నామని శ్రీ బుద్ధప్రసాద్ ప్రకటించారు. నాటి రాష్ట్ర గవర్నర్ శ్రీ యన్. డి. తివారీని ఆహ్వానించి సభలు ప్రారంభింప చేశారు. 60 ఏళ్ళ స్వతంత్ర భారత దేశంలో తెలుగు వారు నిర్వహించిన పాత్ర గురించి 216 పరిశోధనా వ్యాసాలతో, వజ్రభారతి అనే పరిశోధనా గ్రంథాన్ని కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురించింది. గ్రంథ ప్రచురణ అసిధారా వ్రతం లాంటిది. కృ.జి.ర.సం. అవలీలగానే అనేక పరిశోధనా గ్రంథాలను ప్రచురించి పరిశోధకులకు తోడ్పడింది.

4. 2007 డిసెంబర్ 2న న్యాయస్థానాలలో తెలుగు అమలు అనే విషయం మీద న్యాయమూర్తులు శ్రీ జింబో, శ్రీ సుబ్రహ్మణ్యం, న్యాయవేత్త శ్రీ మాడభూషి శ్రీధర్ ప్రభృతులతో ఒక జాతీయ సదస్సు నిర్వహించారు. తెలుగులోనే తీర్పు లివ్వాలనే ఆలోచనని న్యాయమూర్తులకు కలిగించటం ఈ సదస్సు లక్ష్యం.

5. 2008 ఫిబ్రవరి 17, 18 తేదీలలో భారతీయ భాషా కేంద్రం, ద్రవిడ విశ్వవిద్యాలయం వారి సహకారంతో కృష్ణాజిల్లా రచయితల సంఘం ద్వారా తెలుగు భాష ప్రాచీనత- విశిష్టత అనే అంశం మీద మొదటి సారిగా జాతీయ సదస్సు నిర్వహించి తెలుగే ప్రాచీనమని ఎలుగెత్తి చాటారు. ఈ సదస్సులో సమర్పితమైన పరిశోధనా పత్రాలను తెలుగు భాష ప్రాచీనత-విశిష్టత పేరుతో ఒక ఆకర గ్రంథంగా ప్రచురించింది. తెలుగుభాషకు క్లాసికల్ హోదా సాధించటంలో ఈ జాతీయ సదస్సు ముఖ్యమైన మలుపు ఆనాడు.

6. 2008 మార్చి 21, 22 తేదీలలో మచిలీపట్టణం డచ్‌కోటలో కృష్ణాజిల్లా చారిత్రక వైభవం జాతీయ సదస్సుని, భారతీయ పురావస్తు సర్వేక్షణ వారి సౌజన్యంతో నిర్వహించి కృష్ణాజిల్లా సర్వస్వం ఉద్గ్రంథం ప్రచురించింది.

7. 2008 మార్చిలోనే చిన్నయసూరి ద్విశతాబ్ది ఉత్సవాలను రాష్ట్రంలోని అన్ని విశ్వవిద్యాలయాలలోనూ, రాష్ట్ర సాంస్కృతిక శాఖ సహకారంతో నిర్వహించి బాల వ్యాకరణం మీద సమగ్రమైన పునర్మూల్యాంకనం జరిపించారు.

8. 2008 ఆగస్టు 2 నుంచి 5 వరకూ మచిలీపట్నం నుంచి నెల్లూరు వరకూ దాదాపు 300 మంది సాహితీవేత్తలతో తెలుగు భాష, సంస్కృతీ చైతన్య యాత్రను శ్రీ బుద్ధప్రసాద్ ప్రారంభించారు. భాషకోసం రచయితలు చేస్తున్న ఈ యాత్రని దండి యాత్రతో పోల్చి, ఈ యాత్రలో పాల్గొన్న రచయితలను భాషాసత్యాగ్రహులుగా అభివర్ణించారు శ్రీ బుద్ధప్రసాద్.

'మన ఇంట్లో మనం తెలుగులోనే మాట్లాడుకుందాం' అనే నినాదంతో ప్రజల గుండె తలుపులు తట్టిన యాత్ర ఇది. కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు జిల్లా రచయితల సంఘాలు ఈ యాత్రను నిర్వహించాయి. ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, శ్రీ సుబ్బారావు ఈ యాత్రకు సారథ్యం వహించారు.

9. 2009 జనవరి 24, 25 తేదీలలో రాష్ట్రంలోని పురావస్తు శాస్త్రవేత్తలు అనేకమందిని ఆహ్వానించి సింధు-కృష్ణా లోయల నాగరికతల తులనాత్మక అధ్యయన సదస్సును విజయవాడలో నిర్వహించారు. సింధు నాగరికతకు సమాంతరంగా తెలుగునేల పైన కూడా జనావాసాలు ఉండేవని అంగీకరిస్తున్న పరిశోధకులకు ఆ సంస్కృతిని తెలుగు సంస్కృతిగా ప్రకటించవలసిన అవసరాన్ని ఈ సదస్సు గుర్తింపచేసింది.

10. 2010లో కృష్ణాజిల్లా రచయితల సంఘం ద్వారా, ఎమెస్కో వారి సహకారంతో తెలుగు మణిదీపాలు అనే 1200 పేజీల ఉద్గ్రంథాన్ని ప్రచురించారు. వివిధ రంగాలలో ప్రసిద్ధులైన 70 మంది జీవిత చరిత్రలు ఇందులో సంకలితం చేశారు.

11. 2010 సంవత్సరాంతంలో ఉత్తర అమెరికా తెలుగు సంస్థ 'తానా' వారి సహకారంతో తరతరాల తెలుగు సంస్కృతి పైన స్ఫూర్తిదాయకమైన సదస్సు నిర్వహించి, తెలుగు సంస్కృతి ప్రాచీనతని, దాని ప్రశస్తిని వెలుగులోకి తెచ్చే ప్రయత్నం చేశారు. తరతరాల తెలుగు సంస్కృతి గ్రంథం తానా ప్రచురణగా జూలై 2న అమెరికాలో ఆవిష్కరణ జరిగింది.

12. 2012లో సాంకేతిక తెలుగు కోసం 2వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు, 2015లో తెలుగు భాషా పరిరక్షణ కోసం 3వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల నిర్వహణ.

13. ఇంకా... తెలుగు మాండలికాల పైన కృష్ణా విశ్వవిద్యాలయంలో ఒక సదస్సుని, తెలుగుకథకి నూరేళ్ళసందర్భంగా భారతీయ భాషాకేంద్రం సహకారంతో మచిలీపట్టణంలో ఒక జాతీయ సదస్సునీ, మచిలీపట్టణంలోనే శ్రీకృష్ణదేవరాయ వైభవం సదస్సునీ - ఇలా ఎన్నో జాతీయ స్థాయి సెమినార్లను కృష్ణాజిల్లా రచయితల సంఘం ద్వారా నిర్వహింపచేసి, తెలుగు భాషోద్యమ స్ఫూర్తికి శ్రీ సుబ్బారావు అండగా నిలబడ్డారు.




అన్నగారు ఆచార్య కొలకలూరి ఇనాక్‌తో...

## ప్రాచీనతాహోదా కోసం న్యాయ పోరాటం :

ప్రాచీనతా హోదాని సాధించటానికి అవరోధంగా ఉన్న చెన్నై హైకోర్టులోని కేసుని పరిష్కరించటంకోసం ఆంధ్రప్రదేశ్ అధికారభాషా సంఘం, ప్రకాశం జిల్లా రచయితల సంఘంతో కలిసి కృష్ణాజిల్లా రచయితల సంఘం సుప్రీంకోర్టుని ఆశ్రయించటం జరిగింది. చెన్నైకోర్టులో నడుస్తున్న కేసును కొట్టివేయవలసిందిగా సుప్రీంకోర్టును కోరుతూ వేసిన వ్యాజ్యంలో కృ.జి.ర.సం. పక్షాన శ్రీ సుబ్బారావు, నేనూ ఇంప్లీడ్ అయ్యాం. చెన్నై హైకోర్టులో తీర్పు అనుకూలంగా రానప్పుడు తప్పక జోక్యం చేసుకుంటామని సుప్రీంకోర్టు మమ్మల్ని తిరిగి చెన్నై హైకోర్టుకు పంపించింది.

సుప్రీంకోర్టు తీర్పు తరువాత నాటి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కొణిజేటి రోశయ్యగారు, ప్రభుత్వ పక్షానే ఈ కేసులో ఇంప్లీడ్ అవుతామనీ, వ్యక్తులు, సంస్థలూ ఎలాంటి రిట్లూ వేయవద్దనీ కోరారు. ఇన్నేళ్ళుగా ఆ వ్యాజ్యం విషయంలో వాయిదా పర్వం జరుగుతూనే ఉంది. ఈ వ్యాసం అచ్చు అవుతున్న నాటికి చెన్నై హైకోర్టు తన తీర్పును రిజర్వ్ చేసి ఉంచింది. తీర్పు ఒకటీ లేక రెండు నెలలలోపే రావచ్చునని భావిస్తున్నారు. తీర్పును బట్టి దాని పర్యవసానాలను, భవిష్యకార్యాచరణనూ నిర్దేశించుకోవలసి ఉంటుంది.

ఈ లోగా, 2008 అక్టోబరు 31న తెలుగు, కన్నడ భాషలకు క్లాసికల్ హోదా ఇవ్వటానికి కేంద్రానికి ఎలాంటి అడ్డంకులూ లేవని ప్రభుత్వం న్యాయ సలహా ఇవ్వటంతో తెలుగు, కన్నడ భాషలకు క్లాసికల్ హోదా ప్రకటించారు.

అయితే, ఇది కేవలం ఆరంభం మాత్రమే! క్లాసికల్ హోదాని ప్రకటించి ఈ 2016 జూలై నాటికి ఎనిమిదేళ్ళు గడిచిపోయింది. చెన్నై హైకోర్టు ఈ తీర్పును రిజర్వ్ చేసింది. తీర్పు కోసం అందరూ ఆత్రంగా ఎదురు చూస్తున్నారు.

ఇంత జరుగుతున్నా ఈ నాటికీ, మన విశ్వవిద్యాలయాలు గానీ, పరిశోధనా సంస్థలు గానీ, తెలుగు భాష ప్రాచీనతకు సంబంధించి ఒక్క నిర్దిష్టమైన పరిశోధనా ప్రాజెక్టును సిద్ధం చేయలేక పోయారు. అలసత్వం భాషకు, జాతికీ అపకారం చేస్తుందనేది తిరుగులేని సత్యమే!



# ఉదాహరణకు కొన్ని ఉన్నమాటలు!

- శ్రీ విహారి

సుబ్బారావ్ @70! ముందుగా అభినందనలు! మా మధ్య నలభై అయిదేళ్లు - దోసిట్లో నీళ్లలా జారిపోయాయి! ఎన్నెన్ని అనుభవాలూ, జ్ఞాపకాలూనూ!

అతి సన్నిహితుల్ని గురించి అభిప్రాయాలు చెప్పటం తేలిక్కావచ్చు. కానీ రాయడం కష్టమైన పనే! సుబ్బారావూ, నేనూ -ఉనికీ, మనుగడ దృష్ట్యా - కొన్నేళ్లు మరీ మరీ దగ్గరి వాళ్లం. ఆ తర్వాత నేను భౌతిక నివాసం దృష్ట్యా దూరాలకి వెళ్లాను. అయితే, హృదయ సాన్నిహిత్యం మాత్రం పక్కాగా నిలిచేవుంది.

ఆదివిష్ణు అన్నట్టు - తేదీలూ వారాలూ గుర్తు లేవు గానీ - హైదరాబాద్‌లో పోస్టల్ ఉద్యోగాన్ని వదిలేసి బందరు యల్ఐసీ రేకుల షెడ్‌లో వాలాడు - కుర్రాడు గుత్తికొండ సుబ్బారావు. నాకంటే ఐదేళ్లు చిన్నవాడు. 'ఈ అబ్బాయ్‌ని నువ్ చూసుకోవోయ్' అని అతన్ని నాకు అప్పజెప్పాడు మా ఆఫీసర్. నేను హయ్యర్‌గ్రేడ్ అసిస్టెంటుని. నా పక్క సీట్లో కుదురుకున్నాడు. బుర్రా, చేతులూ చాలా పవర్ ఫుల్! అతనికీ నాలాగానే క్షణాల్లో ఏ విషయమైనా అర్థమౌతుంది. అది అంతే. సాధారణ మానవుడు అవతలి మనిషి పదినిముషాలు చెప్పిన తర్వాత తెలుసుకొనే అంశాలు మేము మొదటి రెండు నిముషాల్లోనే గ్రహించేస్తాము. ఆ తర్వాతంతా ఎదుటి వ్యక్తి చెప్పేది ఖచ్చితంగా మాకు తెలిసిన సమాచారమే. దాన్ని Out of modestyతో స్వీకరించేస్తాం! ఈ కారణం వలన నాకూ అతనికీ పని విషయంలో లంకె బాగా కుదిరింది. రోజుకొక వంద రివైవల్స్ చేసిన చేతులు మావి. ఒక్కొక్కటి ప్రాసెస్ చేయటానికి ఏడెనిమిది స్టెప్స్ ఉంటాయి. కొన్ని బాల్‌పెన్‌తో (కాపీలు కూడా) రాయాలి! అందుకనే సర్వీసింగ్‌లో రాక్షసులు వీళ్లు అనేవాళ్లు మమ్మల్ని - కొలీగ్స్ మాత్రమే

కాదు, పాలసీ హోల్డర్లూ, డెవలప్‌మెంట్ సిబ్బందీ. అప్పుడు మాకు వాళ్లంతా పెట్టిన కిరీటాల బరువు నా దగ్గర ఇప్పటికీ కొన్ని ఉత్తరాలుగా ఉన్నది! ఉద్యోగులముగా అదీ – మేము! అదీ మా ఇమేజ్!

అభిరుచుల దృష్ట్యా ఆ వెంటనే మేము స్వజాతి పక్షులమే అని అర్థమైంది. ఇక గమనానికీ, చలనానికీ, సంచలనానికీ రెక్కలొచ్చాయి. అప్పటికెప్పుడో – హైదరాబాద్‌లో స్పందన సాహితిని పెట్టి, 'స్పందన' కవితా సంకలనాన్ని అచ్చొత్తించేసి, జోరుగా సాహిత్య కార్యక్రమాలూ, హుషారుగా కె. శివారెడ్డితో కలిసి 'వేకువ' త్రైమాసికనీ నడిపివచ్చిన 'గట్టిగింజ' ఈ సుబ్బారావ్! నేను అప్పటికే బాగానే పేరున్న రచయితనీ, కవినీ.

సాహిత్యాన్ని మేయమరిగినవాడూ, సామాజికంగా సమస్యల తట్టనెత్తికెత్తుకుని దురాగతాలపాలవుతున్న వాడూ – కుదురుగా కూర్చోలేడు. లో– అలజడి ఎక్కువగా ఉంటుంది. లోకాన్ని చూసే చూపు నిశితంగా వుంటుంది. వ్యక్తిగత ఆర్థిక కౌటుంబిక బాధావ్యథల ఆందోళన అవస్థపెడుతూ ఉంటుంది. ఆ అలజడీ, ఆందోళనా మా ఇద్దరిలోనూ సమస్థాయిలో ఉండేవి. అయితే, నేను మితవాదిని. పిరికితనం పాలు పిసరంత ఎక్కువ. నన్ను పొడిచి మరీ దగ్గరైనాడు. 'ఏంవోయ్'లోకి దిగేం. ఇవ్వాల్టికీ అంతే! ఈ 'ఈక్వేషన్'లో నన్ను గౌరవంగా చూడటం అతనికి సంతోషం. అతని సంతోషానికి దెబ్బ తగలకుండా గౌరవించటం నా జాగ్రత్త!

సాహిత్యపరంగా హైదరాబాద్‌లో కుందుర్తీ, శీలావీ, శివారెడ్డి, ఇంకా అనేక మంది పెద్దలూ, యువభారతి మిత్రులూ – సుబ్బారావ్‌కీ సన్నిహితులు. వారి వారి భావజాలాల ప్రభావాన్ని బాగానే పట్టుకొచ్చాడు – బందరుకు.

ఆంధ్ర సారస్వత సమితి చైతన్యవంతంగా కార్యక్రమాలు నిర్వహిస్తున్నది. అద్దేపల్లి రామమోహనరావు, నేనూ, శాలివాహన, నాగేశ్వరరావు వంటివాళ్లం చాలా కాలం క్రితం మొదలెట్టిన సంస్థ అది. హైదరాబాద్‌లో క్రియాశీలి సుబ్బారావ్ బందరు ఆం.సా.స.లో కూడా కార్యశీలిగా దుమికాడు. ఎడతెరిపిలేని సాహిత్య కార్యక్రమాలు బందరుని ముంచెత్తుతున్న సమయం అది. ఆ కార్యక్రమాల భాగస్వాముల పేర్లు రాయాలంటే పెద్ద గ్రంథమవుతుంది. పైన చెప్పిన వారు కాక, పువ్వాడ తిక్కన సోమయాజి, బూదరాజు శ్యామసుందర్, దొండపాటి దేవదాసు, అక్కల సరస్వతీ, బాబూరావు దంపతులు, కొట్టి రామారావు, జి. సత్యనారాయణ, వై.జి.కె. ప్రసాద్,

టి.యల్. కాంతారావు, బిఎస్సార్ ఆంజనేయులు, ఎంఏవి ప్రసాద్‌రావు, జే.యస్.ఆర్.కె. ప్రసాదరావు, జి. హరగోపాలకృష్ణ, మాదిరాజు రామ లింగేశ్వరరావు, బోయిన వెంకటేశ్వరరావు... ఇలా ఎందరో ఆం.సా.స. రథయాత్రని నిర్వహించారు. అప్పుడే అనుకుంటాను, విజయవాడ నుండి నవయువకుడుగా జి.వి. పూర్ణచంద్ రావటం మొదలెట్టాడు. రావటంతోనే నాకూ, సుబ్బారావ్‌కీ అంటుకుపోయాడు.

అటు ఆఫీస్‌లోనూ, ఇటు సాహిత్య జైత్రయాత్రల్లోనూ మేము 'పనిరాక్షసులం'. చెప్పులు ఎత్తి కుదురుగా పెట్టటం నుంచీ, కుర్చీలు వేయటం, బ్యానర్లు కట్టటం వరకూ ఏదైనా మాకు 'హీనం'గా ఉండేది కాదు! (ఫర్వాలేదు - చెప్పుకోనివ్వండి). అవన్నీ సుబ్బారావు, పూర్ణచంద్ నా నుండీ నేర్చుకొన్న కార్యనిర్వహణా పద్ధతులు.

ఇక్కడ మరో ముఖ్యమైన అంశాన్ని ప్రస్తావించాలి. బందరు ఎల్ఐసీ ఎంప్లాయిస్ ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్ - సంగీత, సాహిత్య, నాటక, కళారంగాల్లో ఒక విజయధ్వజం. దాని విజయాలు తెలుగునాట మరో సంస్థ అందుకోలేదు. ఎల్.ఎస్. రామయ్య, విడియాల చంద్రశేఖరరావు, సి.యస్. నారాయణ, పి.యల్. నరసింహం వంటి ఎందరో దానికి పెట్టని కోటలు. దానిలో సాహిత్య విభాగంలో మాది పెద్ద చెయ్యి, సంస్థ పక్షాన కళావని పత్రికని నడిపాము. ఎన్నో సాహిత్య కార్యక్రమాల్నీ జరిపేవాళ్లం. ఆ సంస్థ కార్యనిర్వాహక వర్గంలో ప్రముఖుడైనాడు సుబ్బారావ్.

అంతకు చాలాకాలం ముందు 1972 రిపబ్లిక్ డే నాడు రమతో సుబ్బారావ్ ప్రేమ వివాహం - (ఇరు పక్షాల ఆనంద సందోహంతోనే) జరిగింది. సంసారం మొదలు. 72లో తొలి సంతానం. ఆ పిల్ల పేరు స్పందన! ఇదీ ఎమోషనల్ ఎటాచ్‌మెంట్! మా అందరి సాహిత్య జీవితంలోనూ ఒక మలుపు అప్పుడే సంభవించింది. అదే స్పందన సాహితీ సమాఖ్య ఆవిర్భావం. పుస్తక ప్రచురణ, సాహిత్య కార్యక్రమాలు. ఆ తర్వాత అతను స్పందన ప్రింటర్స్ ప్రారంభించటం, ఆ మీదట స్పందన వాణి మాసపత్రికని వెలువరించటం. అదంతా ఒక ఉత్తేజ 'కల్లోల' సమయ పరిచ్ఛేదం! ఆ సంస్థ ప్రస్థానంలో ఎన్నెన్నో అఖండ విజయాల్ని ఆనందించాం. కొద్దిపాటి అపజయాల్నీ అనుభవించాం. వాటన్నిటా మా కార్యవర్గంలోని అందరి భాగస్వామ్యం ఉన్నా, ఎక్కువ శాతం 'క్రెడిట్' అతనికే చెందింది!

కుందుర్తి అనుయాయిగా సుబ్బారావ్ 'మనిషికోసం' కవితా సంపుటిని ప్రచురించాడు. ఒకే ఒక్క సంపుటితో కవితా ప్రస్థానాన్ని పూర్తిగా ఆపేసిన తెలుగు

కవి బహుశా సుబ్బారావ్ ఒక్కడేనేమో! ఆ తర్వాత అతను కవిత్వమే కాదు, మరే ప్రక్రియలోనూ రచన చేయలేదు! అందుకే నేను అతనికి నా 'చలనమ్' కవితా సంపుటిని అంకితం ఇస్తూ – 'తెలుగు దేశంలో ఎక్కడ, ఎప్పుడు, ఎవరి పుస్తకం అచ్చవుతున్నా, తన పుస్తకమే అచ్చవుతోందన్నంతగా సంబరపడే మా గుత్తికొండ సుబ్బారావ్‌కి' అని చెప్పేను. తాను రాయకపోయినా రాసేవాళ్లకి అతను పెద్ద ఊతగర్ర!

1977లో నేను ధార్వాడకి బదిలీ అయ్యాను. 'స్పందనవాణి' బరువు కింద సుబ్బారావ్ నలిగిపోసాగాడు. పూర్ణచంద్ పూనికతో నా ప్రమేయాన్ని తీసుకుని, సోమయాజి వంటి మిత్రుల హెచ్చరికతో 'స్పందన వాణి'ని అయిష్టంగానే ఆపు చేయటం జరిగింది. ఆ తర్వాత – సుబ్బారావ్ జీవిత గమనం కొంత గాడిన పడి సాగింది. సాహిత్యం ఉధృతీ తగ్గింది.

ఎల్ఐసీ ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్, యూనియన్, ఎంప్లాయీస్ కో ఆపరేటివ్ బ్యాంక్ – వీటన్నిటా అతను పదవీ బాధ్యతలు నిర్వహించవలసి వచ్చింది. 93లో రమ పట్టుదలతో గృహప్రియ ఫుడ్స్ మొదలైంది.

సుబ్బారావ్ సాధించిన వ్యక్తిగత విజయాల వెనుక ప్రత్యక్ష ప్రమేయం, చోదకశక్తి రమవే. ఆ తర్వాత, రత్నాల్లాంటి ముగ్గురు కూతుళ్లూ, అల్లుళ్లూ అందివచ్చారు. అతని సాహిత్య వ్యక్తిత్వ విజయాలకి కూడా రమ – పరోక్ష సహకారాన్నే కారణంగా చెప్పుకొని తీరాలి. కుటుంబ బాధ్యతల భారాన్ని ఎక్కువగా ఆమే వహించింది. ఆ ప్రాసెస్‌లో ఆమె చాలా అసౌకర్యాలకి గురయినా, సహనమూర్తిగా, కాలాన్ని నిద్రపోనివ్వకుండా కుటుంబక్షేమాన్ని కాపాడింది; సాధించింది.

సుబ్బారావ్‌కి ఆవేశం ఎక్కువ అని అంటూ, అనుకుంటూ ఉంటారు. కానీ, అతను logical rationalist. హేతువుని చెబితే, చూపితే – 'అయితే సరే' అని వెంటనే మనతో ఏకీభవించే తత్వం అతనిది. ప్రజాస్వామిక నిర్ణయాల్నీ ఔదలదాల్చే సుగుణం వున్న వాడతను. ఆనాటి ఆం.ప్ర. సాహిత్య అకాడెమీ కార్యవర్గ సభ్యుడుగా బెజవాడ గోపాలరెడ్డి, దేవులపల్లి రామానుజరావు వంటి పెద్దలతోనే issue based గా విభేదించి, వాదించి, గెలిచినవాడు. అదంతా మరో అధ్యాయం! అతని చిత్తశుద్ధికీ, సిద్ధాంత నిబద్ధతకీ చాలా ఉదాహరణలు ఉన్నై. వాటి వివరాల్ని సుబ్బారావ్‌ని బాగా చదివిన పూర్ణచంద్ రాస్తున్నాడు.

నేను ఉద్యోగరీత్యా ఊళ్లు పట్టుకు తిరుగుతున్నా, బందరులో నా అత్తగారికీ, కుటుంబ సభ్యులకూ అతను పెద్ద సపోర్ట్. నా 'కేరాఫ్ అడ్రస్' అతనిదే!

సుబ్బారావ్‌ని దగ్గరగా చదివిన వారు అతనిలో సహనం ఎక్కువ అని అర్థం చేసుకుంటారు. 'నిండు మనంబు నవ్య నవనీత సమానము, పల్కు దారుణాఖండల శస్త్ర తుల్యము' అన్నది నూరుపాళ్లు అతనికి నప్పుతుంది. అతను అందరికీ ఆప్తుడు. పరిచితుల్లో ప్రతి ఒక్కరూ ఎవరికి వారు సుబ్బారావ్ తనకు అత్యంత సన్నిహిత మిత్రుడు, 'వెరీ క్లోజ్' అనే భావననే ఆనందిస్తారు. దీనికి కారణం - అతని అరమరికలు లేని స్వభావం, కలుపుగోలుతనం, నిరాడంబరత. హృదయంలో ఏ 'అర-మరకలు' లేని నిష్కల్మషమైన సాన్నిహిత్యాన్ని పంచేగుణం అతనిది. క్రమశిక్షణ, సమయపాలనా, అతనికి వెన్నతో పెట్టిన విద్యలు!

ఇంకో చిన్న రహస్యం చెబుతాను. నిజానికి - అతని దూకుడు స్వభావం, కొట్టినట్టు మాట్లాడే మాటతీరూ, సూటితనం - వీటిని ప్రేమించే చాలామంది అతన్ని ప్రేమిస్తారు. దగ్గరౌతారు. అంటే వాటన్నిటి వెనుకా ధ్వనించే అతని ఆత్మీయ స్పర్శ అంత చల్లనిదన్నమాట!

ఇదీ అతని గుణ విశేషాల్లోని మరీ విలక్షణ గుణం!

సుబ్బారావ్ కష్టజీవి. ఒక పక్క ఉద్యోగం (ఆ తర్వాత విరమించే వరకూ), కుటుంబం, వ్యాపారం, సామాజిక బాధ్యతలు, కూడలికొమ్మగా సాహిత్యం, మరో పక్క 1995 నుండి రమ అనారోగ్యం; కృ.జి.ర.సం. భారీ స్థాయి కార్యక్రమాలు - ఇన్ని ఒత్తిడుల మధ్య మానసికంగా, భౌతికంగా నలిగినవాడు. అయితే, భర్తగా అతను రమపట్ల తన కర్తవ్యాన్ని ఏనాడూ, ఏ కొంచెమూ విస్మరింపలేదు. ఆమెకు తానుగా అందించగలిగిన అన్ని సౌకర్యాల్నీ ఆమె సంపూర్ణ సంతృప్తి మేరకు సమకూర్చాడు. ఆమె ఆధ్యాత్మిక వాంఛితాల్ని కూడా ఆమోదించి సహచరధర్మాన్ని పాటించాడు. ఆమె ఆరోగ్య పరిరక్షణకు అహరహమూ తపించాడు. శ్రమపడ్డాడు. ఆ 'జీవుని వేదన'ని ఈ జీవి కూడా మదిలో, హృదిలో అనుభవిస్తూ, రెప్పలమాటున దాచుకుని తిరిగాడు. కడకు అనివార్యమైనది జరిగిపోయింది. ఆత్మ స్థైర్యంతో, గుండె దిటవుతో, మళ్లీ అందరి మధ్యనా నిలబడ్డాడు. సుబ్బారావ్ ఒక కృషి శక్తీ, స్ఫూర్తిమూర్తీ!

ఇవ్వాళ - సుబ్బారావ్ గొప్ప ఐశ్వర్యవంతుడు.

డబ్బు లెక్కల్ని తీసి పక్కన పెట్టండి.

అతని సంపదా, బలమూ - అతని కుమార్తెలూ, అల్లుళ్లూ, మనవలూ, మనవరాండ్రు ఆప్యాయతలో, ప్రేమానురాగాల నిధనంలో ఉన్నాయి. అతనికి తోడుగా

వున్న బంధుమిత్రుల బలగం మనసుల్లోని ఆత్మీయతా, అనురాగాల నిక్షేపంలో ఉన్నాయి. అలాగే, అతని నెమ్మి, నెనరూ వారికీ వీరికీ కూడా గొప్ప పెన్నిధే!

సత్యం, శివం, సుందరం - ఎప్పుడూ చూచే చూపులోనే ఉంటాయి. సహృదయాభిసరణం - వన్ వే ట్రాఫిక్ లాంటిది కాదు. వచ్చీపోయే అతిథులే చాలా చెప్పగలరు. అలాంటిది హృదయమిచ్చి పుచ్చుకొనేవారు అవ్యక్తమాధుర్యాన్నీ జ్ఞాపకాల్నీ ఎంతని చెప్పగలరు, ఎన్నని రాయగలరు!! అందుకనే ఈ వ్యక్తీకరణమూ పరిమితమైనదే!!

ఇతోధికమైన పరిపూర్ణమైన ఆరోగ్యంతో - తన వారినీ, మనల్నీ, మన వారినీ ఆనందింపజేస్తూ - సుబ్బారావ్ చైతన్యవంతంగా నిండునూరేళ్లూ పురోగమించాలని మనసా, వచసా, సహసా ఆకాంక్షిస్తున్నాను. పిల్లలకు దీవెనలు.






ఆత్మీయ మిత్రులు శ్రీ సుధామకు జ్ఞాపికను అందిస్తూ...

# ఆప్తవాక్యం

– డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు

సుబ్బారావు గారికి డెబ్భయ్యేళ్లంటే ఓ పట్టాన నమ్మబుద్ధి కాలేదు. అంతటి చైతన్యమూర్తి ఆయన! నిరంతర శ్రామికుడు. కేవలం ఒక ప్రేక్షకుడిగానో, ఒక శ్రోతగానో ఉండటాన్ని ఆయన ఇష్టపడరు. అది ఎంతటి మహత్తర కార్యమైనా భుజానికెత్తుకోవటానికి క్షణంపాటు కూడా సందేహించరు. ఎత్తుకున్నాక ఏ దశలోనూ దించుకోవటానికి ప్రయత్నించరు. కార్యక్రమం విజయవంతం అవటానికి అవసరమైతే తన జేబులోంచే ఖర్చు పెడతారు. ఎన్నడూ లెక్క చూసుకోరు. ఎవరైనా లెక్క చెప్పినా పట్టించుకోరు. ఎదుటివాడి కళ్ళల్లో మెరుపునూ, ఆనందాన్నీ చూసేందుకు తహతహలాడుతారు.

ఎన్నాళ్ళ పరిచయం మాది? మూడు దశాబ్దాలకు పైమాటే. మొదట్లో సాహిత్య కార్యక్రమాల్లో ఆయన్ని చూశాను. ఒక నిజాయితీ గల కార్యకర్తగా ఆయన శ్రమించడాన్ని గమనించాను. నిజాన్ని నిష్కర్షగా మాట్లాడటం చూసి అచ్చెరువొందాను. ఆయనకు హిపోక్రసీ అంటే అస్సలు తెలియదు. ఒక సిద్ధాంతం కోసం పోరాడుతున్నప్పుడు లాభనష్టాలను బేరీజు వేసుకోరు. మనసుకు నచ్చనిచోట మనుగడ సాగించలేరు. అందుకే 'స్పందన సాహితీ సమాఖ్య' వెలిసింది. ఎన్నెన్ని అద్భుత కార్యక్రమాలు ఆ సంస్థ నిర్వహించిందో నాకు బాగా తెలుసు. ఎందుకంటే కార్యవర్గ సభ్యునిగా నేను కూడా ఆ సంస్థలో వున్నాను. ఆ సంస్థ ఆధ్వర్యంలో 'స్పందన' మాసపత్రిక కూడా కొన్నాళ్ళపాటు సంచలనాత్మకంగా నడిచింది. ఎందరో అతిరథులూ, మహారథులూ ఆ సంస్థ నిర్వహించిన కార్యక్రమాల్లో పాల్గొనేవారు. అందుకు ముఖ్యంగా సుబ్బారావు గారే కారణం! ముసునూరు జగన్నాథరావుగారింట్లో జరిగిన విందుల్లో నేనూ పాల్గొన్నాను. ఎంత చక్కని వాతావరణంలో ఆ సమావేశాలు జరిగేవో నాకిప్పటికీ జ్ఞాపకం.

సినారె బందరు వచ్చినప్పుడు సభలో గుత్తికొండ సుబ్బారావుగారి పేరును జ్ఞాపకం చేసుకోవటం, సుబ్బారావుగారితో వారికున్న సాన్నిహిత్యాన్ని ప్రకటించటం, సాహితీప్రియులందరికీ గుర్తుండే వుండి వుంటుంది. డా॥ పెళ్ళకూరు జయప్రద, వాసిరెడ్డి సీతాదేవి, ఇంద్రగంటి జానకీబాల, లత, కె.బి. లక్ష్మి, సుజాతాదేవి వంటి ప్రముఖ రచయిత్రులు వారినెంతగానో అభిమానించేవారు. ఎందరో రచయిత్రులు ఆయన ఇంటి ఆడబడుచులు. డా॥ పూర్ణచంద్, సుబ్బారావుగారు కృష్ణార్జునులు. వీరి సారథ్యంలో మండలి బుద్ధప్రసాద్ గారి ఆశీస్సులతో కృష్ణాజిల్లా రచయితల సంఘం "నభూతో న భవిష్యతి" అన్న చందంగా ఎన్నో అద్భుత కార్యక్రమాలు నిర్వహించింది.

ఈ సంస్థ నిర్వహించిన ప్రపంచ తెలుగు మహాసభలు ఎంతో విజయవంతమయ్యాయి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ మనుగడలో వున్న రోజుల్లో సుబ్బారావుగారు నిర్వహించిన పాత్ర అనిర్వచనీయమైంది. ఒకే ఒరవడిలో సాగుతున్న అకాడమీని నూతన పుంతలు తొక్కించిన ఘనత సుబ్బారావుగారికి దక్కుతుంది. తెలుగుభాషకు ప్రత్యేక హోదా కల్పించటంలో సుబ్బారావుగారు డా॥ పూర్ణచంద్‌గారు, బుద్ధప్రసాద్‌గారు, ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్‌గారు నిర్వహించిన పాత్ర అసామాన్యం. అపూర్వం.

సుబ్బారావు గారు స్వతహాగా మంచి రచయిత! అభ్యుదయ భావాలు గల వ్యక్తి. 'మనిషి కోసం' అనే పేరుతో ఆయన వెలువరించిన కవితా సంపుటి ఆయన ఆలోచనా సరళిని ప్రతిఫలిస్తుంది. అయితే సుబ్బారావుగారు రచయితగా కన్నా రచయితలను ప్రోత్సహించటం పట్ల ఎక్కువ ఆసక్తి గలవారు. 'స్పందన ప్రింటర్స్' అనే పేరుతో ఒక ప్రెస్ నిర్వహించి ఎందరి రచనలనో ఆయన వెలుగులోకి తెచ్చారు. ఔత్సాహికులు, లబ్ద ప్రతిష్ఠులూ కూడా ఆ ప్రెస్ ప్రాంగణంలో పరిమళాలు వెదజల్లిన వారే!

ఆయనకు శ్రీమతి రామరత్నంగారు ప్రెస్ నిర్వహణలో పూర్తి సహకారం అందించి ఆయన ఆశయాలను ఆచరణలోకి తెచ్చారు. అయితే ఆఫ్‌సెట్ ప్రింటింగ్ ఆధునిక జీవితంలోకి అడుగుపెట్టాక ప్రెస్ కొనసాగటం కష్టతరమైంది. అయినా రచయితలను ప్రోత్సహిస్తూ వారి రచనలు వెలుగులోకి వచ్చే మార్గాలను సూచిస్తూ ఎందరికో అండగా నిలబడ్డారు. అద్దేపల్లి వారు యువ రచయితలకు ఒక రకంగా ప్రేరణ అయితే సుబ్బారావుగారు మరో దిశలో గొప్ప ప్రేరణ. కాగితంపై వెలసిన

ప్రతి అక్షరం పుస్తక రూపం ధరించాలని సుబ్బారావుగారి ఆకాంక్ష! ఆంధ్రప్రదేశ్‌లో ఎక్కడ సాహిత్య కార్యక్రమం జరిగినా అందులో పాల్గొని రచయితలకూ, నిర్వాహకులకూ ఆత్మ స్థైర్యం, సంతృప్తి కలిగించిన ఖ్యాతి సుబ్బారావుగారికే దక్కుతుంది. జీవితబీమా ఉద్యోగుల సహకార బ్యాంకును ఉన్నత స్థాయిలో నడిపిన ఘనత ఆయనకు దక్కుతుంది. బందరులో తొలిసారిగా 'గృహప్రియ' అనే పేరుతో ఇంటివంటకాలనూ రుచికరంగా అందించిన ఘనత కూడా ఆయనకే దక్కుతుంది.

సుబ్బారావుగారు ఒక వ్యక్తి కాదు, ఒక వ్యవస్థ. ఆయన్ని తలచుకోగానే ఎందరో సాహితీమూర్తులూ, కార్యకర్తలూ కళ్ళముందు కదలాడుతారు. అయితే కుటుంబానికి మాత్రం ఆయన పూర్తిగా పరిమితం కాలేకపోయారు. అలాగని కుటుంబం పట్ల ఏ బాధ్యతనూ మరువలేదు. తన ముగ్గురు కుమార్తెలను వారి అభిరుచి మేరకు చదివించారు. పెద్దమ్మాయి స్పందన ఎమ్.ఎస్సీ మ్యాథ్స్ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణురాలైంది. ఆమె భర్త రమణ భీమవరం కాలేజీలో పనిచేస్తుండగా ఆయనను ఉత్తేజపరచి అమెరికా వెళ్ళేలా, ఆపైన అక్కడ స్థిరపడేలా కృషి చేశారు.

రెండో అమ్మాయి భారతి బి.టెక్ ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణురాలైంది. ఆమె బెంగుళూరులో ఉద్యోగం చేస్తుండగా దీపక్‌తో వివాహం జరగటం, వారు అమెరికాలో మంచి స్థాయిలో స్థిరపడటం జరిగింది. మూడో అమ్మాయి కవితను యం.సి.ఏ చదివించారు. రాజేంద్రతో వివాహం జరగటం, అమెరికాలో స్థిరపడడం వెంటవెంటనే జరిగింది. ఇవి కేవలం యాదృచ్ఛికాలు కావు. వీటి వెనుక సుబ్బారావుగారి కృషి అనన్యంగా వుంది. ఎక్కడో దూరాన అమెరికాలో వున్నా ప్రతిరోజూ వాళ్ళ యోగక్షేమాలను విచారించడం, ఆమెరికా వెళ్ళి వారి అవసరాలకు చేయూతగా నిలబడటం సుబ్బారావుగారి వ్యక్తిత్వంలోని చెప్పుకోదగ్గ విశేషం! సుబ్బారావుగారు నాస్తికుడు. రామరత్నంగారు గొప్ప దైవభక్తి గల వ్యక్తి. అయితే తన ఆలోచనలు ఆమెపైన ఎన్నడూ రుద్దటానికి ఆయన ప్రయత్నించలేదు. పైపెచ్చు ఆమె నిర్వహించే దైవకార్యాలలో ఆయన పూర్తిగా సహకరించేవారు. జగ్గయ్యపేట సమీపంలో ఈ దంపతులు స్థాపించిన శివాలయం ఇందుకు తార్కాణం. ఎందరికో గుప్తదానాలు చేసిన ఖ్యాతి కూడా ఈ భార్యాభర్తలకు చెందుతుంది. రామరత్నం గారు గతించాక ఆమె పేరుతో 'చారిటబుల్ ట్రస్ట్' ఆరంభించారు. బందరులో అద్దె భవనాల్లో సాగుతున్న 'అన్నపూర్ణా వృద్ధాశ్రమా'నికి స్వంత భవనాలు ఏర్పరచటంలో కూడా సుబ్బారావు గారి పాత్ర ప్రశంసనీయమైంది.

ఇక వ్యక్తిగతంగా సుబ్బారావు గారితో నాకున్న అనుబంధాన్ని బట్టి కొన్ని విషయాలను ప్రస్తావిస్తాను. ఆయన ఎంతటి స్నేహశీలి అంటే ఎదుటివాడి కష్టంలో పాలు పంచుకోకుండా క్షణం కూడా ఆయన వుండలేరు. మా అమ్మగారు, నాన్నగారు పరమపదించిన దుఃఖ సమయంలో సూచనలు, సలహాలు ఇస్తూ నాకెంతో అండగా నిలబడ్డారు. అలాగే మా ఇంట్లో శుభకార్యాలలో సుబ్బారావుగారు, ఆయన భార్య పాలుపంచుకొని మాకు ఆనందాన్ని కలిగించారు.

ఇరు కుటుంబాలు కష్టనష్టాలను అరమరికలు లేకుండా పంచుకున్న సందర్భాలు ఎన్నో! సుబ్బారావుగారు కొద్దిగా ఆవేశపరుడు. నచ్చని విషయాన్ని గట్టిగా చెప్పడంలో లాభనష్టాలను గూర్చి ఆలోచించరు. అయితే ఆయనది సజ్జనక్రోధం! అది క్షణికమే తప్ప రాగద్వేషాలకు దారి తీయదు. అప్పుడప్పుడు ఆరోగ్యం ఇబ్బంది పెడుతున్నా సుబ్బారావుగారు విశ్రాంతి కోరుకోరు. చైతన్య స్రవంతిగా సాగుతున్న తన జీవితాన్ని నలుగురికీ ఆదర్శంగా ఆయన నిలబెట్టుకుంటూనే వున్నారు. డెబ్భయి వసంతాలు నిండిన ఈ శుభ తరుణంలో తన కుటుంబ సభ్యులందరితో ఆనందాన్ని పంచుకుంటున్న ఈ అద్భుత సమయంలో మనస్ఫూర్తిగా, ఒక రెండు సంవత్సరాలు ఆయనకన్నా పెద్దవాడిగా ఆయనకి ఆయురారోగ్య ఐశ్వర్యాలను భగవంతుడు ప్రసాదించాలని ఆకాంక్షిస్తున్నాను. ఆశీర్వదిస్తున్నాను.





ఆచార్య కసిరెడ్డి వెంకటరెడ్డి గారితో...

# గుత్తికొండ సప్తతి యువతకు ఒక స్ఫూర్తి

- డా॥ ఎన్.గోపి

ఎప్పటి గుత్తికొండ! ఇప్పటికీ బంగారుకొండ. గలగలా కృష్ణమ్మ. కాని అతని వాసి మొదలైంది మాత్రం మూసీ ఒడ్డున. భాగ్యనగరంలో అతడున్నది మూడేళ్లే (1967-70). కాని త్రివిక్రమమూర్తికి పాదులు పడిందక్కడే.

గుత్తికొండ హైదరాబాద్ జీపీవోలో పనిచేసేవాడు. ఎక్కడున్నా ఊరికే ఉండే మనస్తత్వం కాదు. 'తంతి తపాలా ఉద్యోగుల తెలుగు సాహితీ సమాఖ్య'ను పెట్టి హడావిడి చేశాడు. మేం తంతె తపాలా అని జోక్ చేసే రోజులు. అది నేను ఉస్మానియాలో డిగ్రీ చదువుతున్న కాలం. కవి సమ్మేళనాల్లో కవితలు వినిపిస్తున్న ఉద్వేగ క్షణాలు. గుత్తికొండ శ్రీ కృష్ణదేవరాయాంధ్ర భాషానిలయంలో, వైయంసీఏ హాలులో సమావేశాలు నిర్వహించేవాడు. పోతుకూచి సాంబశివరావుగారి 'విశ్వసాహితీ' ఆధ్వర్యంలో కూడా క్రియాశీలకంగా సభలు పెట్టేవాడు. అంతా సాహిత్యమే. అప్పుడు నా దృష్టిలో గుత్తికొండ పెద్ద హీరో. వయస్సులో నాకంటే మరీ పెద్దవాడేంకాదు, రెండు మూడేళ్లు తేడా.

1971లో అనుకుంటాను. మచిలీపట్నం వెళ్లిపోయాడు. తరువాత అప్పుడప్పుడు హైదరాబాద్‌కు వచ్చేవాడు. ఎప్పుడు వచ్చినా ప్రముఖ రచయిత్రి సి. వేదవతి గారింట్లో దిగేవాడు. ఒకటి రెండుసార్లు నేను కూడా అతనితో వెళ్లాను. ఆమె గొప్ప సౌజన్యవతి. తరువాత 'రాష్ట్ర సాహిత్య అకాడమీ'లో సభ్యుడై, కార్యనిర్వాహక సభ్యుడి దాకా ఎదిగాడు. పోరాటం అతని స్వభావం. యంగ్ టర్క్‌గా పేరు

తెచ్చుకున్నాడు. 'స్పందన సాహితీ'ని స్థాపించి అనేక కార్యక్రమాలు నిర్వహించాడు. 'స్పందన' పేరిత కవితా సంకలనం వేశాడు. అందులో నా కవిత కూడా వుంది.

గుత్తికొండ పుట్టుకతోనే సాహితీశీలి, నిర్వహణవేత్త. మచిలీపట్నం సముద్రతీరంలో అలలతో కూడా సభపెట్టగలడు. మిత్రులను ప్రేమించటంలో అతని తర్వాతే ఎవరైనా. భోళా మనిషి. గాలికున్నంత చైతన్యం. ఇప్పుడు కృష్ణాజిల్లా రచయితల సంఘం అధ్యక్షుడిగా విశ్వస్థాయి కార్యక్రమాలు చేశాడు, చేస్తున్నాడు. కార్యదర్శి డాక్టర్ జి.వి. పూర్ణచందు, కృష్ణార్జునుల్లా కుదిరింది వీరిజంట. అయితే వీరిలో ఎవరు కృష్ణుడో ఎవరు అర్జునుడో తెల్సుకోవాల్సింది వారే. మండలి బుద్ధప్రసాద్ గారి గొడుగు వారికి సదా ముందడుగు.

సాహిత్యానుబంధం రక్తసంబంధం కన్నా గొప్పది. అదొక భావయాత్ర. గుత్తికొండ తన అభిమానాన్ని ఎందరికో పంచాడు. అది ఇవాళ సమీకృతమై అతని చరిత్ర మీద ప్రేమవర్షం కురిపిస్తున్నది.

సప్తతి సమయం గుత్తికొండ ఒక నిరంతరగతికి చిహ్నం. ఈ సందర్భంగా నా చిరకాల మిత్రునికి ఆత్మీయాలింగనం.




ఆత్మీయ మిత్రులు డా॥ యన్. అనంతలక్ష్మి, శ్రీ సుధామలతో...

# నా స్మృతిపథంలో...

**- సి.వేదవతి**

మన ప్రయాణం ఎప్పుడూ ముందుకే! భవిష్యత్తులోకే! అయినా, గడచి వచ్చిన బాటలో మనకు ఎదురైన ఆహ్లాదాలూ, నిర్వేదాలూ, పువ్వులూ, కంటకాలూ - అన్నీ మనలని వెన్నాడుతూనే ఉంటాయి ఎందుకనో!

కొన్ని గతుకులు - మరికొన్ని చలివేందిరాలు - ఎన్నెన్నో తీపిగురుతులు - మరింకెన్నో అనుబంధ మధురిమలు - బ్రతుకు పుస్తకంలో నేను తప్పక కేటాయించవలసిన చాప్టర్ గుత్తికొండ సుబ్బారావుకే!

స్నేహం, అభిమానం, గౌరవం - కలగలిపిన ఒక సుందరమైన అనుభవానికి ప్రతీకగా నిలుస్తాడు అతడు.

ఆ స్నేహానుబంధం అలా ఎలా కుదిరిపోయిందీ అంటే - అబ్బో! అదెప్పటి మాట! మన లెక్కల్లో 1980 వరకూ వెనక్కు వెళ్లాలి.

అప్పుడు బందరు పట్టణంలో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన రచయిత్రుల సభలు జరుగుతున్నాయి. మేమంతా బందరులో దిగేటప్పటికి ఊరంతా కోలాహలం. ఉత్సాహంతో సభలకు వచ్చిన కవులూ, రచయితలు, కవయిత్రులందరికీ ఆతిధ్యమిచ్చి సభా నిర్వహణ చేస్తున్నది, స్పందన సాహితీ సమాఖ్య. అక్కడే పుట్టి పుస్తక ప్రచురణలు, సభా నిర్వహణలు వంటి సాహిత్య కార్యక్రమాలతో ముమ్మరంగా పనిచేస్తున్నది సమాఖ్య. స్పందన సాహితీ సమాఖ్యకు వ్యవస్థాపకుడూ, కార్యదర్శికూడా అయినవాడు గుత్తికొండ సుబ్బారావు. అన్నట్లు అతడు అప్పటికే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీకి కార్యవర్గ సభ్యుడు కూడా.

అప్పటికి చాలాకాలం నుంచీ అవీ, ఇవీ ఏవో రచనలు చేస్తూనే ఉన్నాను

నేను. 'శృంగారలహరి' అనే పుస్తకం కూడ అచ్చు అయింది. విమర్శకుల మన్ననలూ అందుకొన్న రచన అది. అయితే, ఇంత భారీ ఎత్తున జరుగుతున్న సభలలో పాల్గొనడం అదే మొదటిసారి. ఇంతమంది ప్రఖ్యాతి పొందిన రచయిత్రులతో చెట్టాపట్టాలేసుకుని రెండుమూడు రోజులు కులాసాగా గడపటం – ఓ మరపురాని అనుభవం. సభలు చక్కగా, రసవత్తరంగా జరిగాయి. భోజన వసతుల్లోనూ ఏ లోపమూ లేదు. కొత్తగా వ్రాస్తున్న వారి దగ్గర నుంచీ లబ్ధప్రతిష్టులైనవారి వరకూ – కవుల, రచయితలతో కొత్త పరిచయాలు– ఎటు చూచినా ఉత్తేజకర వాతావరణం. ఈ సంరంభమంలోనూ ఎక్కడ చూస్తే అక్కడ తానై, ఎవరికి ఏ అవసరం వచ్చినా నేనున్నానంటూ చేయందిస్తూ, వచ్చిన వారికి సకల సదుపాయాలూ సమకూరుస్తూ, అతిథి మర్యాదలతోపాటు సభా నిర్వహణలలోనూ పాలుపంచుకుంటూ – బొంగరంలా తిరిగిన ఓ చైతన్య తరంగం – పేరు గుత్తికొండ సుబ్బారావు.

అప్పటికే అతడి గురించి చాలా విషయాలు తెలిశాయి. స్వయంగా రచయిత, రచయితలెందరితోనో స్నేహానుబంధాలు కలిగిన వాడు, స్పందన సాహితీ తరఫున ఎందరో రచయితలను ప్రోత్సహించి వారి పుస్తకాలు ప్రచురించినవాడు, సభలు, సమావేశాలు జరపడంలో ఆరితేరినవాడు, అన్నిటినీ మించి స్నేహశీలి – ఎందరో స్నేహితుల్ని పోగేసుకుని ఉంటాడు ఎల్లవేళలా! చిత్రమేమిటంటే, ఈ విషయాలన్నీ తెలిసిన కొద్దికాలానికే మా ఇద్దరి మధ్యా పరిచయం స్నేహంగా చివురించటం!

మరో విశేషమేమంటే – అతడు బందరులోని జీవిత బీమా సంస్థలో ఉద్యోగిగా ఉన్నాడని తెలియడమే! నా జీవన సహచరులైన కృష్ణారావు గారున్నూ హైదరాబాదులోని ఆదే సంస్థలో పనిచేస్తుండడం వలన మాది కుటుంబ స్నేహంగానూ స్థిరపడిపోయింది.

బందరు సభల వల్ల నాకు కలిగిన మరో గొప్ప ప్రయోజనం ఏమిటంటే, అది మాన్యులు బెజవాడ గోపాలరెడ్డిగారితో పరిచయ భాగ్యం కలగటం. ఆయన అప్పటికే అకాడెమీ అధ్యక్ష పదవికి రాజీనామా చేసి కొంత అనాసక్తంగానే సభలకు వచ్చారు. ఎక్కడ ఏ మాత్రం సాహిత్య స్పృహ ఉన్నవారినయినా, ఆయన అభినందించి గౌరవించకుండా ఉండలేరు. బహుశః ఈ కారణంగానే గోపాలరెడ్డిగారికి నాపైన కలిగిన సాహిత్యాభిమానం – ఆయన కవితలన్నిటికీ ప్రథమశ్రోతగా ఉండి వ్యాఖ్యానం చేయగలిగిన అదృష్టం కలిగించింది. సుబ్బారావుకీ గోపాలరెడ్డిగారిపైన గొప్ప అభిమానం

ఉండేది. కానయితే అకాడెమీ విషయాలలో అభిప్రాయభేదాలు వచ్చినప్పుడు అధ్యక్షుల వారిని తీవ్రంగా విమర్శించటానికీ వెనుకాడే వాడు కాదు సుబ్బారావు. అది సాహిత్య విషయాలలో అతడి నిబద్ధతనీ, నిజాయితీనీ సూచిస్తుంది.

ఆ తర్వాత కొంతకాలంపాటు స్పందన సాహితీ సమాఖ్యపేరుతో నా పుస్తకాలు వరుసగా అచ్చు అయ్యాయి. నన్ను రచయితగా నిలబెట్టిన మంచి పుస్తకాలు - సాహిత్య అకాడెమీ పురస్కారం పొందిన 'తెలుగు వెలుగు', 'సామెత', 'ముంగిటి ముత్యం', 'స్మృతిగీత' - ఇవన్నీ సుబ్బారావు చేతుల మీదుగా వెలుగు చూచినవే! రచన విషయంలో స్ఫూర్తినీ, ప్రచురణ విషయంలో తోడ్పాటునూ అందించిన మంచి స్నేహితుడు సుబ్బారావు. నాకేకాదు, మరింకెంతమందో వర్ధమాన రచయితలను ప్రోత్సహించి, వారి పుస్తకాలను ప్రచురించి, నిస్స్వార్థంగా సాహితీసేవ చేసిన వాడు సుబ్బారావు. అది అతడి ప్రవృత్తి.

ఏదో ఒక పనిమీద తను తరచుగానే హైదరాబాదు వస్తుండేవాడు. ఒక చైతన్యతరంగంలా వచ్చి స్థబ్ధుగా ఉన్న మా ఇంట్లో సందడి చేసేవాడు. కబుర్లు, వాదాలు, ప్రతివాదాలు, ఆలోచనలు, చమత్కారాలు, ఛలోక్తులతో హోరెత్తిపోయేది. అందుకే ఇప్పటికీ సుబ్బారావుని తలచినప్పుడు ఉవ్వెత్తుగా ఎగసే చైతన్య తరంగం స్ఫురణకు వస్తుంది.

సుబ్బారావు శ్రీమతి రమ కూడా మంచి స్నేహశీలి. పిల్లలు ముగ్గురూ అప్పటికి చిన్నవాళ్లు. వాళ్లను వృద్ధిలోకి తేవాలని రమ కన్న కలలూ నిజమయినాయి. కృషిని నమ్ముకున్న ఆ కుటుంబం ఇప్పుడు సర్వతోముఖంగా వికసించింది.

సుబ్బారావుకి ఇప్పుడు సప్తతి దాటిందా? నిత్య చైతన్యానికి వయసెంత! సుబ్బారావు నా దృష్టిలో అలుపెరుగని చైతన్యమూర్తే!



# వసంతాలు డెబ్బయి!

**– డా॥ బి. ధన్వంతరి ఆచార్య**

శ్రీ గుత్తికొండ సుబ్బారావుగారు నాకు చిర పరిచయం కల్గిన స్నేహితులు – భావసారూప్యత కల్గిన మా ఇద్దరి మధ్య 4 దశాబ్దాల కాలం మరింత సాన్నిహిత్యాన్ని పెంచటంవల్ల వారి ఆత్మీయవర్గంలో నాకూ సభ్యత్వం దొరికింది. తరచుగా కలుస్తూ వున్నా, మా సాన్నిహిత్యానికి సాహిత్యాభిలాషే ముఖ్యకారణం అనుకొంటున్నాను. ఉద్యోగపరంగానే కాకుండా ఎల్ఐసిలో కో ఆపరేటివ్ బ్యాంక్ ఛైర్మన్‌గా, ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్ ప్రెసిడెంట్‌గా సమర్థవంతమైన సేవలను అందివ్వటం నాకు బాగా తెలుసు. ఎల్ఐసి కో ఆపరేటివ్ బ్యాంక్‌లో డిపాజిటర్‌గా వారి సేవలను నేను అందుకొన్న సందర్భాలున్నాయి. ఫైన్ ఆర్ట్స్ అసోసియేషన్ కార్యక్రమాలను సుందరరామయ్య గారి కాలం నుంచీ చూసి ఆనందించిన వారమే మేమంతా. వైద్యపరంగా కొన్ని సందర్భాలలో, వివిధ సమావేశాలలో కలుసుకొన్నప్పుడు వారి పలకరింపులోని పన్నీటి చిలకరింపును నేను చవిచూశాను. సహజ అభిమానంతో నిండుతనంగా హృద్యమయిన రీతిలో మాట్లాడటం శ్రీ సుబ్బారావుగారి ప్రత్యేకత. ఒకసారి పరిచయమైన వ్యక్తిని ఆకర్షించి నిలుపుకొనే అయస్కాంత శక్తి గుత్తికొండ వారి సొత్తు.

సభా ప్రసంగాలలో సందర్భశుద్ధిగా తనకున్న సుదీర్ఘ సాహిత్య పరిచయాన్ని అందుకు సంబంధించిన వ్యక్తుల పేర్లనూ, తేదీలతో కూడ చెప్పగల్గిన ధారణ, ప్రజ్ఞ శ్రీ సుబ్బారావు గారిలో చూస్తాం.

సాహితీ ప్రియులలో తన రచన, ప్రింటింగు ప్రక్రియలతో మంచి 'స్పందన'ను తెచ్చారు. వర్ధమాన రచయితలకు మార్గదర్శనం చేసి జిల్లా రచయిత సంఘాధ్యక్షులుగా తన దక్షతను నిరూపించుకొంటున్నారు.

ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించినా, జిల్లా రచయితల సమావేశాలు నిర్వహించినా కార్యక్రమ నిర్వహణలో సమర్థులైన వార్ల సహకారం తీసుకొంటూ సన్నివేశాన్ని జయప్రదం చేయటం వారికి వెన్నతో పెట్టిన విద్య. అందుకు అన్ని విధాల సహకరించే మిత్రబృందం, శ్రీ బుద్ధ ప్రసాద్ గారు, డాక్టర్ జి.వి. పూర్ణచందుగారు, డాక్టర్ యార్లగడ్డ లక్ష్మీప్రసాద్ గారు లాంటి వారుండటమే సుబ్బారావుగారి విజయరహస్యం.

ఆయనతో పరిచయం వున్న ప్రతివారు ఆయనలోని స్నేహభావాన్ని - అవసరానికి ఆదుకొనే ఉదారతను సులువుగా చూడగలరు.

ఆడపిల్లల తండ్రిగా పిల్లల్ని క్రమశిక్షణతో అభివృద్ధిలోకి తీసుకొచ్చి వారి జీవితాలకు మార్గదర్శకుడైన ఆదర్శ గృహస్థుగా సార్ధకతను సాధించారు. ముచ్చటగా 'రచ్చ' గెలిచిన సుబ్బారావుగారు 'ఇంట' కూడా గెలవటానికి ముమ్మూర్తులా సహకరించిన ఆదర్శగృహిణి, ఆయన శ్రీమతి 'రామరత్నం' గారు. ఆమె అందరి మన్ననలను అందుకొన్న యజమానురాలు. సుబ్బారావుగారి కుటుంబంలోని మాధుర్యాన్ని వారు మాత్రమే కాకుండా అందరికీ పంచాలనే సుహృద్భావంతో 1993 సంవత్సరంలో "గృహప్రియ" సంస్థను స్థాపించి అనుకొన్నంత పని చేసి చూపించారు. పనివారి సాధక బాధకాలను గుర్తించిన యజమానురాలుగా రామరత్నం గారు కొన్నిసార్లు పనివారి వైద్య సలహాల కోసం నా వద్దకు పంపేవారు. ఆమె చూపిన శ్రద్ధ ఆప్యాయతలను ఈనాటికి పనివారు మరువలేదంటే అతిశయోక్తికాదు. ఆమె యొక్క వియోగం సుబ్బారావుగారి ధృతిని తాత్కాలికంగా అడ్డుకొన్నా, గుండెదిటవుతో సంస్థను నడిపిస్తూ ఆమె పేరిట ఒక చారిటబుల్ ట్రస్ట్ (2014)ను స్థాపించి, ఇతోధిక సామర్థ్యంతో సేవా కార్యక్రమాన్ని చేస్తున్న శ్రీ సుబ్బారావు గారు బహుధా అభినందనీయులు. ఆయన సాహిత్య పటిమను, సాహిత్యాభిలాషను గూర్చి ఎంత చెప్పినా తక్కువే. స్వతహాగా రచయిత, ప్రారంభ రచయితలకు మార్గదర్శి, సాహితీ విమర్శకుడు, విశ్లేషకుడు అయిన సుబ్బారావుగారు ఒక సభకు అధ్యక్షత వహించినప్పుడు గాని ఆయన దక్షిత, సమయపాలనా చాతుర్యం, నిర్వహణా సామర్థ్యం కనపడదు.

"క్రియాసిద్ధిః సత్వేభవతి భవతాంన ఉపకరణే" అనే ఆర్యోక్తి వారి విషయంలో యదార్థం. నా యీ భావ వ్యక్తీకరణలో అతిశయోక్తికి ఉత్ప్రేక్షకూ తావులేదు.

ఇన్ని సుగుణాలను గుచ్చెత్తి సంతరించుకొన్న మా "గుత్తికొండ సుబ్బారావు గార్కి సప్తతి వసంతోత్సవం" జరగటం మహదానందదాయకం. ఇది తెలుగు రచయితలందరూ హర్షించదగ్గ శుభ సమయము.

మున్ముందు జరగవలసిన సహస్ర చంద్ర దర్శనం, 'నవతి' మహోత్సవాలను కూడా దిగ్విజయముగా యావత్ బంధుమిత్రులతో శోభాయమానంగా జరుపుకోగలరని ఆకాంక్షిస్తూ "సమస్త సన్మంగళానిభవన్తు"





1979 విజయవాడలో తొలి మినీ కవితా ప్రదర్శన ప్రారంభకులు శ్రీ అద్దేపల్లి, సభాధ్యక్షుడు శ్రీ గుత్తికొంత, ఆత్మీయ అతిథి శ్రీ పంపన సూర్యనారాయణలతో ప్రదర్శన నిర్వాహకుడు శ్రీ పూర్ణచంద్

# సూపర్ కార్యకర్త - సుబ్బారావు గారు

- పెనుగొండ లక్ష్మీనారాయణ

అరసం కార్యకర్త, గుంటూరు

94402 48778

సాహిత్యరంగంలో కవులు, కథకులు, విమర్శకులు ఇంకా వివిధ ప్రక్రియలకు చెందిన రచయితల సంఖ్య ఎప్పుడూ గణనీయంగానే వుంటుంది. మన తెలుగు సాహిత్యంలో వందల మంది కాదు వేలమందే వున్నారు. అయితే కార్యకర్తలు మాత్రం స్వల్ప సంఖ్యలోనే కనపడుతుంటారు. వీళ్లు ముఖ్యంగా రచయితల సంఘాలకు చెందిన వారై వుంటారు. అరసం, విరసం, జనసాహితి, సాహితీ స్రవంతి మరికొద్ది సంస్థలకు చెందినవారు. ఈ సంస్థల ద్వారా రాష్ట్రస్థాయిలో కార్యకర్తలుగా పనిచేసే వారుంటారు. అలాగే కొన్ని ప్రాంతాలు, నగరాలు, పట్టణాలు, వూర్లలో స్థానిక స్థాయిలో సాహిత్య సంస్థలను ఏర్పాటు చేసి పనిచేసే కార్యకర్తలూ వున్నారు.

సాహిత్యం పట్ల అభిమానం, గౌరవం వుండటం వలన, అలాగే వీరు కూడా స్వతహాగా సాహితీవేత్తలై వుండటం వలన కార్యకర్తలుగా స్వచ్ఛందంగా పని చేయటానికి ముందుకొస్తారు. వీళ్లు కార్యకర్తలుగా బాధ్యతలు నిర్వహిస్తుండటం వలన వీరిలో కొందరైనా తమలో వున్న సాహిత్య శక్తిని కొంతైనా కోల్పోతుంటారు. ఇది వాస్తవం. ఒకసారి కుందుర్తి గారు నాతో ఏమన్నారంటే 'నువ్వు కవిత్వం రాస్తున్నావు, కార్యకర్తగా పనిచేస్తున్నావు. కవి కార్యకర్త అయితే సృజనశక్తి తగ్గుతుంది. ఏదో ఒకటి చేయి' అన్నారు. నేనైతే కార్యకర్తగా వుంటానికి యిష్టపడ్డాను. కుందుర్తిగారన్నట్లు నేను కవిత్వంలో కుంటుపడ్డాను. అప్పుడప్పుడూ వుద్యమావసరాల కోసం కార్యకర్తగా వ్యాసాలు రాయవలసి వచ్చినప్పుడు రాశాను.

సాహిత్య కార్యకర్తగా తెలుగునాట ఐదు దశాబ్దాలుగా అనితర సాధ్యమైన కృషి చేస్తున్న గుత్తికొండ సుబ్బారావుగారు సాహిత్యంలో బాగా ప్రవేశమున్న వ్యక్తి. కవిత్వం రాశారు, పత్రికా సంపాదకత్వం వహించిన రచయిత. 1975లో 'మనిషికోసం' కవితా సంపుటిని వెలువరించారు. స్పందనవాణి, వేకువ పత్రికలకు సంపాదకత్వం వహించారు. వీరి కవితలు ప్రతిష్టాకరమైన సంకలనాలలో కూడా అచ్చయ్యాయి. సాహిత్య అకాడెమీ ప్రచురించిన దేవులపల్లి రామానుజరావు సంపాదకత్వంలో 1984లో వెలువడిన 'కావ్యమాల' (స్వాతంత్ర్యానంతర తెలుగు కవిత)లో వీరి కవిత 'కాగితం పడవ'ను చేర్చారు. అలాగే వేకువలో ప్రచురితమైన వారి కవిత నొకదానిని నేను ఆ మధ్య నకలు చేసి పంపాను. తరువాత అందరికీ తెలిసిన విషయమే, సుబ్బారావు గారిలోని కావ్యకర్తను కార్యకర్త మింగేశాడని.

1974ల నుంచి అభ్యుదయ రచయితల సంఘంలో పనిచేస్తున్న నాకు సుబ్బారావు గారితో బాగా బాగా పరిచయమైంది, 1980ల నుంచి. అప్పటికే వారు కార్యదర్శిగా వుండి మచిలీపట్నంలో నిర్వహిస్తున్న స్పందన సాహితీ సమాఖ్య గురించి ఆ సంస్థ ప్రచురణలు, కార్యక్రమాలు, పత్రికల గురించి మాత్రం తెలుసు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కార్యవర్గ సభ్యులుగా కూడా వుంటూ ఆ సంస్థ సహకారంతో మచిలీపట్నంలో 7 ఫిబ్రవరి 1980న 'మినీ కవితా ప్రక్రియ'పై నిర్వహించిన సభకు అరసం నేత, మా గురువుగారైన డాక్టర్ పరుచూరి రాజారామ్ గారిని ఆహ్వానించగా వారికి తోడుగా నేనూ వెళ్లాను. ఆ సందర్భంగా మధురాంతకం రాజారాం, కేతు విశ్వనాథరెడ్డి గారి లాంటి ప్రముఖులు కూడా హాజరైనారు. పరుచూరి, మధురాంతకంలను ఒకరికొకరిని పరిచయం చేసిన తరువాత 'ఇద్దరు రాజారామ్‌లు కలిసిన వేళ' అంటూ తన పక్కన వున్న ఫొటోగ్రాఫర్‌ను ఫొటో తీయమని చెప్పారు. ఆ అపురూపమైన ఫొటోలో వాళ్లతోపాటు స్పందన మిత్రులు కూడా వున్నారు. సుబ్బారావుగారు నాకు పంపిన ఆ ఛాయాచిత్రాన్ని మళ్లీ పంపుతున్నాను.

బందరులో స్పందన సాహితీ సమాఖ్య నిర్వహించిన మినీ కవితా సదస్సు చూసిన తరువాత గుంటూరులో కూడా అరసం ఆధ్వర్యంలో నిర్వహించమని సుబ్బారావుగారూ మిత్రులూ కోరారు. రాజారామ్‌గారూ నేనూ సరేనన్నాం. 1, 2 ఆగస్ట్ 1981 తేదీలలో గుంటూరులో క్లాస్ IV ఎంప్లాయీస్ అసోసియేషన్ హాల్‌లో ఏర్పాటు చేశాము. 2వ తేదీనే గుత్తికొండగారి అధ్యక్షతన 'మినీ కవితా సభ'ను ఏర్పాటు చేశాం. ప్రదర్శన నిర్వాహకులు డాక్టర్ జి.వి. పూర్ణచంద్ పాల్గొన్నారు.

అరసం గుంటూరు జిల్లా అధ్యక్షులుగా వుంటూ మృతి చెందిన పులుపుల వెంకట శివయ్య గారి పేరిట 1980లో ప్రారంభించిన సాహితీ సత్కారాన్ని 1981 నవంబర్ 14న ఉత్తమ సాహితీ సంస్థగా స్పందన సాహితీ సమాఖ్యను గుర్తించి ఆ సంస్థ ప్రధాన కార్యదర్శి అయిన గుత్తికొండ గారికి గుంటూరులో అరసం అందజేసింది. ఈ విధంగా అరసం గుత్తికొండ వారి కృషిని గుర్తించి గౌరవించింది.

అరసం గుంటూరుజిల్లా శాఖ ప్రచురించిన 'కథాస్రవంతి' ద్వితీయ సంపుటి సెప్టెంబర్ 1985లో రూపురేఖలు దిద్దుకొంది, ఆనాడు గుత్తికొండ వారు బందరులో నడిపిన స్పందన ప్రెస్‌లోనే.

మచిలీపట్నం(బందరు)ను రాష్ట్రంలో ఒక ప్రధాన సాహిత్య కేంద్రంగా ఆనాడు తీర్చిదిద్దడంలో గుత్తికొండగారి కృషి ప్రధానమైనది. వీరికి విహారి గారి మార్గదర్శకత్వం, మిగిలిన కార్యకర్తల సహకారం, కుటుంబ ప్రోత్సాహం వుండటం వలన యిది సాధ్యమైంది.

గుత్తికొండవారు తరువాత కృష్ణాజిల్లా రచయితల సంఘాన్ని మండలి బుద్ధప్రసాద్ గారి సహాయంతో పూర్ణచంద్ వంటి పలువురు కార్యకర్తలు, మిత్రుల సహకారంతో స్థాపనలో కృషి చేశారు. ఆ సంఘం పక్షాన విజయవాడ నగరంలో రాష్ట్ర, జాతీయ, అంతర్జాతీయ, ప్రపంచ తెలుగు మహాసభలను నిర్వహించారు. నన్నూ అరసాన్నీ భాగస్వామిని చేశారు కూడా. అరసానికి మిత్ర సంస్థలు, సోదర సంస్థలూ యివి. చాలామంది కార్యకర్తలు వయోభారం వలన, ఆర్థిక, కుటుంబ సమస్యల వలన; వేరే ప్రాంతాలకు వెళ్లటం వలన; వ్యక్తిగత కారణాల వలన కార్యకర్తృత్వం ఆపేస్తారు, మానేస్తారు. అలా చేసిన వారు చాలామంది వున్నారు. సుబ్బారావుగారు మాత్రం తన యవ్వన ప్రాయంలో ఎత్తిన సాహిత్య పతాకను డెబ్భై ఏళ్లు పైబడినా దించలేదు. ఇంకా ఆ పతాకను తన తరువాత తరం వారికి అందజేస్తున్న అరుదైన కార్యకర్త, ఆదర్శ కార్యకర్త. తెలుగుకోసం, తెలుగు వెలుగు కోసం, సాహిత్యం కోసం, సామాజికాభ్యుదయం కోసం, జీవన ప్రస్థానాన్ని కొనసాగిస్తున్న సుబ్బారావుగారు సూపర్ కార్యకర్త.

'మనిషికోసం' కవిత్వం రాసిన సుబ్బారావు గారికి 'ప్రేమనిచ్చిన ప్రేమవచ్చును' అని బాగా తెలుసు. మా అమ్మాయి శ్రీచందన వివాహ ఆహ్వానం అందుకున్న సుబ్బారావుగారు ఆన్‌లైన్ ద్వారా 22 నవంబర్ 5న పుష్పగుచ్ఛాన్ని శుభాకాంక్షల సందేశాన్ని అందించారు. వారలా అందించిన ఆశీస్సులకు ధన్యవాదాలు.

సాహితీ వేత్తలకు చలివేంద్రంలా వుంటూ సాహిత్యం కోసం తనను తాను అంకితం చేసుకున్న సుబ్బారావుగారు ఎప్పుడూ నీట్‌గా, ఫ్రెష్‌గా వుంటారు, కనిపిస్తారు. ఇదేదో రహస్యమే. సుబ్బారావు గారూ, దయచేసి ఆ రహస్యమేదో విప్పండి, చెప్పండి.

Long Live Sri GUTTIKONDA SUBBARAO...!





ఆత్మీయ మిత్రులు ఆచార్య సిమ్మన్న గారికి జ్ఞాపికను అందిస్తూ...

# అదృష్టవంతుడు చి॥ సుబ్బారావు

- శ్రీ కొట్టి రామారావు

ఆ సమయంలో మేము బందరు పోర్టురోడ్‌లో నివాసం. మాతోపాటు ప్రక్క పోర్షన్‌లో జి. సత్యనారాయణ (జిసనారా)గారి కుటుంబమూ ఉంటున్నది.

1971 మార్చి నెలలో ఒక యువకుడు మా తలుపుతట్టి “నాపేరు గుత్తికొండ సుబ్బారావు. గత నెలలోనే బందరులో ఎల్ఐసి డివిజనల్ ఆఫీసులో చేరాను. మీ గురించి విన్నాను. కలుసుకుందామని వచ్చేను” అన్నాడు. నేను కొద్దిగా ఆశ్చర్యపోయి “రండి. రండి. ఏ డిపార్టుమెంటులో చేరారు?” అని ఆహ్వానించాను. “పోలసీహోల్డర్స్ సర్వీసింగు సెక్షన్‌లో. విహారి గారి ప్రక్కనే” అన్నాడు. ఆశ్చర్యమెందుకంటే, ‘ఈ అబ్బాయి, చాలా చిన్నవాడుగా ఉన్నాడు. పేరు కొంచెం పెద్దదే. ఇతని ఆధ్వర్యంలోనే హైదరాబాదు నుండి ఒక పత్రిక “వేకువ” వస్తున్నది. అప్పటికే నేను దానిని చూడటం జరిగింది. అద్దేపల్లి రామ్మోహనరావుగారి రచన ఒకటి అందులో ఉంది. అందువలన ఈ చిన్నవాడూ, ఆ ప్రచురణకర్త ఒకరేనా అని’. నా అనుమానంతో కూడిన ఆశ్చర్యాన్ని పటాపంచలు చేస్తూ తనే ఆ గుత్తికొండ సుబ్బారావు’ నేనే అని నిర్ధారించాడు.

ఆ రోజునే మేం కలుసుకున్నా, అదే రోజున మాతో భోజనానికి ఆహ్వానించాం. ఏం మొహమాటం లేకుండా మాతో భోంచేసి చాలాసేపు మాట్లాడి వెళ్ళిపోయాడు. తర్వాత ఆ సంఘటననే సుబ్బారావు అనేక సభలలో చెప్పాడు. “నేను బందరులో అడుగుపెట్టాక మొట్టమొదటి ఇంటి భోజనం శ్రీరామారావు, సుశీలాదేవి దంపతులతోనే” అని. ఈ విషయం నేను మరచిపోయినా అతను మాత్రం అనేక సందర్భాల్లో (నేను ప్రధానపాత్ర వహిస్తున్న సభల్లో) ప్రస్తావిస్తూ వచ్చాడు.

సుబ్బారావు స్నేహానికి పెద్దపీట వేస్తాడు. ఎవరితో అయినా ఇట్టే కలిసిపోతాడు. ముఖ్యంగా మన ఇంటికి వస్తే ఆ ఇంటి ఇల్లాలితో కబుర్లు చెప్పి

చనువుగా అందరి సభ్యులతో కలిసిపోతాడు. బహుశా సుబ్బారావుకున్నంత మంది స్నేహితులు చాలా తక్కువమందికే ఉంటారనుకుంటాను.

సుబ్బారావు మనస్తత్వం, అభిరుచికి తగిన చిరు ఉద్యోగమే అతనికి ముందుగా లభించింది. ఆ ఉద్యోగం ద్వారానే మామూలుగా మనం మాట్లాడటానికి, చూడటానికి అవకాశంలేని గొప్ప కవులు, రచయితలతో అతనికి చిన్న వయస్సులోనే పరిచయం, స్నేహం కలగడానికి, ఆ చిన్న ఉద్యోగమే అతనికి తోడ్పడిందనుకుంటాను. దానికి తోడు దొరికిన అవకాశాన్ని నిజాయితీగా ఉపయోగించుకోవడం అతని స్వభాగం గనుక అనతికాలంలోనే అతని అభిమానరంగం - సాహిత్య సమారాధన, తత్ సంబంధమైన వ్యక్తులతో పరిచయాలు, స్నేహాలతో ఎందరికో ఆప్తుడుగానూ, ఆత్మీయ స్నేహితునిగానూ వెలుగొందాడు.

శ్రీ సుబ్బారావు మొదటి ఉద్యోగం ద్వారా సంపాదించిన పరిచయాలతోనూ, స్నేహితులతోనూ ఒక సాహిత్య పత్రిక 'వేకువ'ను ప్రచురించడం అంత చిన్న విషయం కాదు. ఈ పత్రిక ద్వారా అతని పేరు మరింత ప్రాచుర్యం పొంది గొప్ప గొప్ప కవులూ, రచయితలూ, సాహిత్య విమర్శకులూ అతని స్నేహితులూ, సహాయకులూ అవడం అతనికి కలిసివచ్చిన మొదటి అదృష్టం!

ఈ అదృష్టానికి తోడు అతని ఎల్ఐసి ఉద్యోగం - అప్పటికే కళలూ, సాహిత్యం, కవులూ, రచయితలతో కళకళలాడే బందరు ఎల్ఐసి డివిజనల్ ఆఫీసులో రావడం ఒక ఎత్తయితే, విస్తృతమైన కీర్తి ప్రతిష్టలతో అలరారే ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక రాజధానిగా ప్రసిద్ధి పొందిన మచిలీపట్నంలో నివాసం అతని ప్రవృత్తి - సాహితీ సమారాధనకు ఎంతగానో తోడ్పడింది.

శ్రీ సుబ్బారావు సాహితీసమారాధన ఎల్ఐసీ లలిత కళాసమితి, ఆంధ్ర సారస్వత సమితిలతో ప్రారంభయింది. దానితో అతడు సంతృప్తి చెందక తనే ఎల్ఐసిలో పనిచేసే విహారి, శాలివాహన మొదలయిన వారితో కలిసి "స్పందన సాహితీసమాఖ్య' అనే ఒక సాహిత్య సంస్థను ప్రారంభించాడు. అప్పటికే సుప్రసిద్ధమయిన ఆంధ్ర సారస్వత సమితి, తర్వాత సుబ్బారావు స్థాపించిన 'స్పందన' కూడ అచిరకాలంలోనే ప్రాచుర్యం పొందింది. ఈ రెండు సంస్థలూ విడివిడిగా బందరులో గొప్ప కార్యక్రమాలు చేస్తూ వచ్చాయి. సుబ్బారావు సాహితీ ప్రస్థానం అంతటితో ఆగలేదు. తనే స్వయంగా 'స్పందన' పేరుతో ఒక పత్రికనూ, ఒక ప్రెస్‌ను కూడా ఏర్పాటు చేశాడు.

ఈ రెండు సంస్థలతోనూ సుబ్బారావు పేరు సాహితీలోకంలో మరింత విస్తరించింది. తన ప్రెస్‌లో ఎంతోమంది రచయితల, కవుల పుస్తకాలు, "నో ప్రాఫిట్

నో లాస్" విధానంలో ముద్రించి ఎందరో కవులకు, రచయితలకు విలువైన తోడ్పాటునందించాడు. శ్రీ సుబ్బారావు ప్రెస్‌లోనే గొప్ప గొప్ప కవులూ, రచయితలూ తమ పుస్తకాలను, కొందరు తమ మొదటి రచనలనూ – ముద్రించుకుని సుబ్బారావుకు మంచి స్నేహితులుగా మారారు. సుబ్బారావు తన స్పందన సాహితీ సమాఖ్య, స్పందన పత్రిక, స్పందన ప్రెస్ ద్వారా ఆంధ్రప్రదేశ్‌లోని సాహితీలోకంలో మంచిపేరు సంపాదించారు. ఈ మంచిపేరుతోనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీలో పోటీ చేసి గెలుపొందారు. తర్వాత ఆ ఎకాడెమీలో కార్యవర్గ సభ్యునిగానూ ఎన్నికయి మరింత ప్రాచుర్యం పొందారు.

సుబ్బారావు కృష్ణాజిల్లా రచయితల సంఘ అధ్యక్షునిగా తన ప్రస్థానాన్ని జిల్లా, రాష్ట్ర స్థాయి నుండి జాతీయ అంతర్జాతీయ స్థాయికి కొనసాగించారు. దానికి మండలి వెంకట కృష్ణారావుగారు, బుద్ధప్రసాద్ లాంటి వారి సహకారం ఉన్నా సుబ్బారావు వ్యక్తిత్వం, కృషి, పట్టుదల తన ఎదుగుదలకు ప్రధాన కారణాలుగా పేర్కొనవచ్చు.

చివరగా సుబ్బారావు గురించి ఒకమాట చెప్పక తప్పదు. తాను నమ్మిన అంశం మీద దానిని నెగ్గించుకోవడానికి ఎంతటివారితోనైనా వాగ్వివాదానికి, చివరకు దెబ్బలాటకూ వెనుకంజ వేయకపోవడం – అవతలివారు ఎంత పెద్దవాళ్లయినా, పలుకుబడి గలవారైనా, అధికారులయినా – అనేది సుబ్బారావు వ్యక్తిత్వంలో ప్రధానమైనది. అయితే ఈ వాదనలలోనూ, పోట్లాటల్లోనూ – సుబ్బారావు సిన్సియారిటీ – నిజాయితీ ఉండటం వలన తను ఎన్ని అడ్డంకులనైనా వాటిని అధిగమించి విజేతగా నిలవడానికి ప్రధాన కారణమై ఉంటుందని నేను నమ్ముతాను. తన కృషిలో, చేసే కార్యక్రమాల్లో నిజాయితీ ఉండటం వలననే ఒకే సంవత్సరంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నుండి (1) ఉగాది సాహిత్య ప్రతిభా పురస్కారం (2) భాషాసేవ పురస్కారం అందుకోగలిగాడు.

శ్రీ సుబ్బారావులో ఈ మధ్య నేను గమనించిన మరో విశిష్ట లక్షణం – సమాజసేవ. తెలుగు భాషా, సాహిత్య సమారాధనలో కృతకృత్యుడైన శ్రీ సుబ్బారావు సామాజిక సేవలోనూ శిఖరాగ్రానికి చేరతాడని, చేరాలని ఆశిస్తాను; ఆకాంక్షిస్తాను.

చిరంజీవి సుబ్బారావు! నీకు భగవంతుడు ఆయురారోగ్య సౌభాగ్యాలనివ్వాలని కోరుతూ, సెలవ్.



# అతనికతడే సాటి

– పువ్వాడ తిక్కన సోమయాజి

ఏడుపదుల వయస్సులో కూడ ఎడతెగని ధైర్యసాహసాలతో బడుగుల వంటి అడుగులు వేయగల సమర్థులు అరుదు –

ఉద్యోగం సామాన్యమైనదే అయినా ఊరంతా ఏలగల నాయకత్వ లక్షణాలు పిన్నవయస్సులోనే ఏర్పడటం ఇంకా అరుదు –

పలుకుతీరులో సత్యవాదిత్వపు పదును ఎక్కువనిపించుకొన్నా, నిష్పక్షపాతిగా నిలబడగల తీర్పరులు కావటం కూడా అరుదే –

వ్యక్తి జీవనానికీ సంఘ జీవనానికీ అంతరం అగాథమైనప్పుడు పోరాటపటిమ తగిన అస్త్రమని నమ్మే తత్త్వవేత్తలు అంతకంటే అరుదు –

బహుముఖీనములైన దృష్టికోణాలతో వైవిధ్యపు మార్గానుయాయులను ఏకత్రాటికి తెచ్చి ఏకోన్ముఖత చేకూర్చగలగటమూ అరుదే.

ఇన్ని అరుదైన లక్షణాలను పుణికి పుచ్చుకొన్న

ప్రజ్ఞావంతుడు మనమిత్రుడు గుత్తికొండ సుబ్బారావు!

అంతేనా?

సాహిత్యం అతని ఊపిరి. సాహిత్యం శరీరం. సాహితీవేత్తలు అతనికి ప్రాణం. అనేక సాహిత్య సంస్థలకు పురుడుపోసి కండబలం ఇచ్చిన సృష్టికర్త. భాషాయోషకు క్రొత్త అందాలు దిద్దిన కార్యశీలి. అక్షరాలు క్షరం కాకుండా అచ్చొత్తియజేసిన స్పందన కలవాడు. మనిషి కోసం పరిశ్రమిస్తూ కవులను రచయితలను గ్రంథకర్తలను చేసిన ప్రచురణకర్త.

ప్రభుత్వాన్ని ప్రశ్నించగల ధైర్యం కలవాడైనా, ప్రభుత్వ సహకారంతోనే ఉత్తమ ఉద్యమ లక్ష్యాలందుకోగల నేర్పు - అతనికి వెన్నతోపెట్టిన విద్య.

పెద్దలలో పెద్ద, పిన్నలలో పిన్న. అన్నిటిలో మిన్న. అతని కతడే సాటి. అందుకే పెద్దలందరి అండ. అతడు మన గుత్తికొండ.

సంవత్సరాలుగా అర్ధాంగికి వైద్యం చేయిస్తూనే, వాగర్ధ సరస్వతికి నైవేద్యాలు పెట్టించే పూర్ణపురుషు లెంతమంది ఉంటారు? ఆమె ఆయుష్షు కూడా సగం భర్తకిచ్చి అదృశ్యమైంది. శ్రీ గుత్తికొండ మిత్రుడు శతాయుష్కుడు కావాలని మనసారా కోరుకొందాం.






గుంటూరులో అరసం ఆధ్వర్యంలో జరిగిన సభలో
తెలుగు భాషా బ్రహ్మోత్సవాల పోస్టర్‌ను ఆవిష్కరిస్తున్న
పెనుగొండ లక్ష్మీనారాయణ, తేళ్ళ సత్యవతి గార్లతో పూర్ణచంద్, గుత్తికొండ

# నిరంతర కృషీవలుడు గుత్తికొండ

- డా॥ పెళ్ళకూరు జయప్రద సామిరెడ్డి
వంశీ నర్సింగ్ హోమ్, ఇందిరాభవన్‌రోడ్, నెల్లూరు

అప్పుడప్పుడే ప్రాక్టీస్ పెట్టిన రోజులు... విజయవాడ అఖిల భారత తెలుగు మహాసభల నుండి రచయిత్రిగా నాకు ఆహ్వానం... ఇలా ఎందరో రచయితలకు ఆహ్వానం... వెళ్ళాలనే ఆర్తి. అప్పటికే పెరిగిన ప్రాక్టీస్... విజయవాడలో ఎక్కడ వుండాలో తెలీదు.... అయినా నా బాల్య స్నేహితురాలు పద్మను తీసుకుని రైలెక్కాను. అడ్రసును బట్టి వెన్యూ హాల్‌కెళ్లాము.

అటూ, ఇటూ అయోమయంగా వరండాలో తిరుగుతుంటే... ఒక గదిలో నుండి ఇద్దరు పెద్దమనుషులు బయటకొచ్చారు. అప్పటికి నాకు వాళ్ల పేర్లు తెలియదు... మమ్మల్ని చూసి వాళ్లు...

"ఏమ్మా సభలకు వచ్చారా?" అని అడిగారు. 'అవును' అన్నట్లు భయంభయంగా తలూపాము.

"అయితే లోపలికి వెళ్లి ఫ్రెష్ అవ్వండి" అని వాళ్ళు బయటికి వచ్చి మమ్మల్ని లోపలికి పంపించారు.

మేము బెరుకు బెరుగ్గా బయట కొచ్చేసరికి ఆ వరండాలో చాలామంది ఒకరితో ఒకరు మాట్లాడుకుంటున్నారు. మమ్మల్ని ఎవరూ పట్టించుకోలేదు. ఒక వ్యక్తి మాత్రం మా వైపుగా వచ్చి సాదరంగా మా గురించి తెలుసుకుని మాకు రూము దానం చేసిన వ్యక్తుల్ని పరిచయం చేశాడు. ఒకరు మధురాంతకం రాజారామ్‌గారు, మరొకరు పులికంటి కృష్ణారెడ్డిగారు... మమ్మల్ని వాళ్ళకి పరిచయం చేసినవారు గుత్తికొండ సుబ్బారావుగారు. బందరు వాస్తవ్యులు. ఆరోజు మమ్మల్ని తిరిగి ట్రెయిన్ ఎక్కించేవరకు ఆయన మా బాధ్యతను స్వీకరించి... మరోసారి ఇలాంటి సభలకు రాగలిగిన ధైర్యాన్ని మాకు ఇంజెక్ట్ చేశారు.

అప్పటి నుండి ఇప్పటిదాకా సాహితీ సేవ చేస్తున్న గుత్తికొండ సుబ్బారావుగారు అప్పట్లో మచిలీపట్నంలో స్పందన సాహితీ సమాఖ్యకు ప్రధానకార్యదర్శిగా చాలాకాలం వున్నారు. వారికి నా కథలు నచ్చినట్లున్నాయి. నా కథా సంపుటి ఒకదాన్ని... "పచ్చని జీవితానికో నచ్చిన రూలు" స్పందన సాహితీ సమాఖ్య ద్వారా ప్రచురించి... నెల్లూరీయులు, పూజ్యులు ఒకనాటి గవర్నర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారి చేతుల మీదుగా బందరులో 1976లో ఆవిష్కరింపజేశారు.

1979లో అనుకుంటాను. అవి గాలీ వానకు దివిసీమ మునిగిపోయిన రోజులు. ఆర్.ఎస్.ఎస్.లో సంఘసేవ చేస్తున్న వేణుగోపాల్‌రెడ్డి గారు నన్ను దివిసీమ బాధితులను ఓదార్చి ధైర్యం చెప్పడానికి రమ్మన్నారు. సామాజిక ఇతివృత్తాలతో మంచి కథలు వ్రాసే మాదిరెడ్డి సులోచనగారు, నేను తదితరులం అన్ని దీవులలో నష్టపోయిన వారిని పలకరించి ఏదోరకంగా పునరావాసం కల్పిస్తామని హామీ యిచ్చి తిరిగి వచ్చిన రోజుల్లో మాకు గైడెన్స్ యిచ్చిన వ్యక్తి మరెవరో కాదు, గుత్తికొండ సుబ్బారావుగారే.

ఆ తర్వాత 1982లో మా చెల్లెలు స్వర్గీయ సోమిరెడ్డి జమున కథకు అవార్డు వచ్చిన సందర్భంలో పొన్నూరులో ఆమెకు సన్మానం జరిగినప్పుడు కూడా మాకు, ఆయనకు ఆ సభతో ఏ సంబంధం లేకపోయినా అన్ని ఏర్పాట్లు చేసిన ఏకైక వ్యక్తి గుత్తికొండ సుబ్బారావుగారే. ఇలా ఎన్నిసార్లో ఆయన సహాయం నేనూ పొందాను.

ఆ తర్వాత ఫేమిలీ ఫ్రెండ్స్‌గా మారాము... మా ఇంటికి సుబ్బారావు గారి దంపతులు, వారింటికి మా ఫేమిలీ మెంబర్స్ రావడం... పోవడం...

ఆయన సాహితీ సేవతోపాటు, అర్ధాంగి అనారోగ్యంతో బాధపడ్తున్నప్పుడు ఆయన చేసిన సేవల వల్లనే ఆమె అంతకాలం బ్రతికారేమో అన్పించింది నాకు. ఆమె మృతి నన్ను కలవరపెట్టింది. ఈ వయస్సులో ఒంటరితనం ఎంత బాధాకరమో? కానీ ఆయన జీవితాన్ని జయించారు. మరలా సాహితీ మొలకై మొలిచారు.

కృష్ణాజిల్లా రచయితల సంఘం బాధ్యతల్ని తలకెత్తుకున్నారు. తెలుగు భాషకి పునర్జన్మనిస్తున్న వాళ్ళల్లో ఒక్కరైనారు.

అడుగడుగునా నాకు సహోదరుడిలా సహాయ సహకారాలు అందించిన గుత్తికొండ సుబ్బారావు గార్కి వారి సప్తతి దినాన నా అభినందనలు తెలుపుతూ... ఇంకా ఎంతోకాలం వారు సాహితీ వనానికి తానే వనమాలై తెలుగు పూలు పూయించాలని కోరుతూ...

# ఒక పరిచయంలోంచి అనేక జ్ఞాపకాల్లోకి...

– డా॥ కె.బి. లక్ష్మి

ఎంత ఎన్ని రాస్తున్నా కొన్ని ఎలా మొదలు పెట్టాలో డోలాయమానం! "విజయవాడలో సాహితీ సమావేశం పెడితే వస్తావా అమ్మాయీ?"

"నే రాకపోతే మానేస్తారా?"

(ఇద్దరం నవ్వులు) –

అడిగినది శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లు. కృష్ణాపత్రిక సంపాదకులు. అప్పటికి కొన్నాళ్ళుగా పిరాట్ల విజయవాడని క్యాంప్ ఆఫీసుగా వ్యవహరిస్తున్నారు. ముట్నూరి వారి తరహాలో కవులు, రచయితలతో 'కృష్ణాదర్బారు' నిర్వహించేవారు హైదరాబాదు చిక్కడపల్లి కార్యాలయంలో. అదే అనుకుని, అయినా వివరాలడిగాను.

'శేషేంద్రశర్మ స్మృతి సభ' అన్నారు. గుంటూరు శేషేంద్రశర్మ అభిమాన కవి, గౌరవనీయ పిరాట్ల ఆహ్వానం. పైగా ఆత్మీయ కుటుంబమిత్రులు. సరే, వెళ్ళాను. ఒక గ్రంథాలయంలో సభ. వేదిక మీద కుర్తాళం పీఠాధిపతి పిరాట్ల, కృష్ణాజిల్లా రచయితల సంఘం (కృజిరసం) అధ్యక్షులు గుత్తికొండ సుబ్బారావు (జి.యస్.). ప్రధాన వక్త నేను. సభ కాస్త ఆలశ్యంగా మొదలై తొందరగా ముగిసింది. ఆ వేదికపైనే జి.యస్.ని పరిచయం చేశారు.

హైదరాబాద్‌లో ఉత్పల సత్యనారాయణాచార్య ఏర్పాటు చేసిన 'భ్రమరగీతం' గ్రంథావిష్కరణ తర్వాత ఆ గ్రంథ రచయిత్రి వసుమతిని మళ్ళీ ఈ సభలోనే కలవడం. కానీ మా ఫోను సంభాషణల్లో తరచూ ఆవిడ జి.యస్., పూర్ణచంద్‌లు నిర్వహించే సాహితీసభలు, 'తెలుగుపసిడి' గ్రంథం వగైరాల గురించి చెబుతూ వుండేవారు. ఆ పరోక్ష పరిచయం వల్ల ప్రత్యక్ష పరిచయం కొత్తగా అనిపించలేదు.

వసుమతి, నేను, మరికొందరికి 'మనోరమ'లో డిన్నర్ ఇచ్చారు, జి.యస్. తర్వాత మర్యాదపూర్వకంగా వసుమతిని, నన్ను ఎవరింటి దగ్గర వారిని దింపే బాధ్యత కూడా వహించారాయన.

అలా దాదాపు రెండు, మూడు గంటలపాటు సాగిన ఆనాటి పరిచయ ప్రస్థానంలోని కబుర్లలో స్నేహశీలత, వాక్చతురత, సెన్సాఫ్ హ్యూమర్, మనుషుల పట్ల గౌరవం, అహంభావనిజం లేని గాంభీర్యం, తెలుగుభాష, కృజిరసం, తెలుగు పసిడి తదుపరి కార్యక్రమ లక్ష్యాలు, కొత్త వారిని ఏమాత్రం కొత్తగా ఫీలవనివ్వని మానవ సంబంధాల నిర్వహణ, ఎప్పుడూ హాయిగా నవ్వుతూ, ఉత్సాహంగా, సరదాగా వుండే చక్కని వ్యక్తిత్వం గల వ్యక్తిగా జి.యస్.ని గుర్తించాను. అదేభావం వసుమతి నోట. తదుపరి అందరి మాట. అప్పుడే నేను 'కృజిరసం', 'జి.యస్.'పదాలను కాయిన్ చేసి వాడుకలోకి తెచ్చాను.

హైదరాబాదు వచ్చేశాను మర్నాడు. జి.యస్. పూర్తిపేరు తాలూకు జ్ఞాపకం ఏదో ఉందని అనిపిస్తోంది కానీ అంతుచిక్కలేదు. వదిలేశాను. ఒకరోజు అవసరమైన పుస్తకం కోసం పుస్తకాల బీరువా వెతుకుతుంటే చందూర్ జగతి, భవన్స్‌జర్నల్స్, విశ్వసాహితి, సృజన, శ్రీశ్రీ పుస్తకాల దొంతర్ల మధ్య ఓ నాలుగు సన్నని పుస్తకాలు కనబడ్డాయి. కొత్తగా లేవు. కొంచెం పాతబడి రంగుమారిన పేజీలు.

Yes! I Got it! అవి మూడు వేకువలు, ఒక త్రివేణి. వేకువ ప్రారంభ సంచిక త్రైమాసిక (జనవరి - మార్చి 1971), రెండు, నాలుగు సంచికలవి. తొలి సంచికలో కేవలం కవితలే ఉంటే, తదుపరి సంచికల్లో కథలు, వ్యాసాలు, వ్యాఖ్యలతో మెరుగులు దిద్దుకుంటూ వచ్చింది. వెల ఒక రూపాయి. మిరియాల రామకృష్ణ, నిఖిలేశ్వర్, కుందుర్తి, సోమసుందర్, నగ్నముని, దాశరథి, ఎన్.గోపి, అద్దేపల్లి, సుగమ్‌బాబు, కె.శివారెడ్డి గుత్తికొండ సుబ్బారావు తదితరులు కవితలతో ప్రారంభ సంచిక 112 పేజీలు మహాస్వప్న, విహారి, శాలివాహన, జ్వాలాముఖి, సినారె, వేగుంట మోహన్‌ప్రసాద్, ఇచ్ఛాపురం రామచంద్రం ఇలా ఎందరివో సృజనలు తదుపరి సంచికల్లో.

'త్రివేణి'లోని ముగ్గురు కవుల్లో ఒకరు శాంతమూర్తి.

సాంకేతిక కారణాల (గుత్తికొండ ప్రభుత్వోద్యోగి, శివారెడ్డి ప్రైవేట్ కాలేజీ లెక్చరర్) వల్ల గుత్తికొండ సుబ్బారావు 'వేకువ'కి గౌరవ నిర్వాహకులైతే, కె. శివారెడ్డి పేరు సంపాదకుడు అయింది.

శాంతమూర్తికి ఆప్తమిత్రుడు, కె. శివారెడ్డికి అభిమానమిత్రుడు అయిన మావారు కామేష్ ఈ సంచికల్ని 1971లోనే కొని, పేరు రాసుకుని ఇంటి గ్రంథాలయంలో ఉంచారు. 1974లో మా పెళ్లి అయిన కొత్తల్లో ఇల్లు మారి పుస్తకాలు సర్దేటపుడు వేకువ నిర్వాహకులు, కవులు అందరి గురించీ పదేపదే మాట్లాడుకునేవాళ్లం.

వాటిల్లో జి.యస్. సాహిత్య అకాడమీ కార్యవర్గ సభ్యుడిగా సృష్టించిన సంచలనాలూ ఉండేవి. అత్తారింటిదారిలోని బందరు స్నేహబాంధవ్యాలూ కబుర్లలో దొర్లేవి.

వేకువ ప్రారంభ సంచికలోని 'గ్రంథ స్వీకారం'లో యువభారతి ప్రచురణ 'రచన' వ్యాస సంపుటి ఉంది. యువభారతి అనగానే మరో జ్ఞాపకం కాలేజీ రోజులు అవి.

1970 -71 నుండి యువభారతి మహిళా విభాగం అధ్యక్షురాలిగా, కార్యకర్తగా, శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయం, ఆంధ్ర సారస్వత పరిషత్ ప్రాంగణంలో విలువయిన సమయం గడిచింది. దేవులపల్లి రామానుజరావు గారి ఆఫీస్ గది ముందున్న సంపంగి చెట్ల కింద నిలబడి మిత్రులతో, సాహిత్యాభిమానులతో సుదీర్ఘ సంభాషణలు చేసేవారు. అలా ఒకటి, రెండుసార్లు, యువభారతి విశ్వం అన్నయ్య (వంగపల్లి విశ్వనాథం)తో మాట్లాడుతున్నప్పుడు జి.యస్.ని చూశాను. అప్పటికీ, ఇప్పటికీ ఇప్పటికీ అతను చాలా మారారు. ఆహార్యంలో, పర్సనాలిటీలో.

సాహిత్య అకాడమీ ఉద్యమ చైతన్య సమాచారం జి.యస్.ని 'టాక్ ఆఫ్ ద మీట్' చేసింది అప్పట్లో.

ఇది ఇలా వుంటే... ప్రకాశం జిల్లా (అపుడు గుంటూరేమో!) వేటపాలెం బండ్ల బాపయ్య హిందూ హయ్యర్ సెకండరీ స్కూల్లో అతను నాకు సీనియర్. వేటపాలెం స్కూలు, సారస్వతనికేతనం, నాగార్పమ్మగుడి, జీడిమామిడితోటలు, తెల్ల ఇసుకదిబ్బలు, జీడిపప్పు... అసలు టోటల్లీ టోటల్లీ ఆ ఊరంటే నాకెంతో ఇష్టం. ఆ స్కూల్లో చదివిన సీనియర్ స్టూడెంట్ గనుక అప్పటి హెడ్మాస్టర్, కొందరు కామన్ ఉపాధ్యాయుల గురించి నాస్టాల్జియా.

శేషేంద్రసభ తర్వాత అనేక జ్ఞాపకాల్ని కలుపుకుంటూ ప్రపంచ తెలుగు మహాసభలు, జాతీయ సదస్సులు, తెలుగు భాషా పాదయాత్రలు, వ్యాసరచనలు, వగైరాలతో కూడిన కృజిరసం / శాశ్వత సభ్యత్వం.

కుటుంబ స్నేహకులీనత. శ్రీమతి రమస్నేహం, ఆప్యాయత, పిల్లలతో చెలిమి హైదరాబాద్ నుండి అమెరికా దాకా! I Feel to a Friend's house the Road is never long. మా ప్రవీణ్, శివాని, సమీర, విష్ణులదీ అదే భావన.

ఒక వ్యక్తి జీవిత చరిత్ర చదువుతుంటే అందులోని ఇంకెందరో పరిచయమైనట్లు, కృజిరసంలోని అనేకానేక మంది ఆత్మీయులయ్యారు. కొన్ని పరిచయాలు, స్నేహాలు రెన్యూ అయ్యాయి. ఆ సాహితీ కుటుంబంలోని సభ్యత్వం గొప్ప అనుభవం.

విజయవాడ మహాసభలు మచిలీపట్నం, కృష్ణావిశ్వవిద్యాలయం, కూచిపూడి తదితర ప్రాంతాల్లోని సభలు, సదస్సులు, సమావేశాల నిర్వహణ తీరు నన్ను చకితురాలిని చేసింది. నిబద్ధత, క్రమశిక్షణ, సమయపాలన, నిర్వహణాదక్షత, శాంతం, సంయమనం, స్నేహశీలత, ఉంటేనే అలాంటి అద్భుతాలు సాధ్యపడతాయి. ఈ విషయంలో జి.యస్. వంగపల్లి విశ్వనాథాన్ని తలపించారు.

ఇవన్నీ చూస్తున్నపుడు నాకనిపించింది తీరుతీరున ప్రాంత, ప్రాంతాల వారిని, అధిక సంఖ్యలో హైదరాబాద్‌లోని రచయితలు, సాహితీవేత్తలకీ తమ కార్యక్రమాల్లో పెద్దపీటవేసి, ఆతిధ్యమిచ్చి ఆనందపరిచే కృజిరసంను హైదరాబాద్‌లోని సంస్థలు, వ్యక్తులు ఆ విధంగా సమాదరించడం లేదని, అది ఆలోచింపదగిన విషయమని.

అందుకే, అపుడు సాంస్కృతిక శాఖ నిర్వహణాదక్షుడుగా వున్న శ్రీ రాళ్ళబండి కవితాప్రసాద్‌తో సంప్రదించి, కృజిరసం తెలుగుభాషకు ప్రాచీన హోదా సాధించిన సందర్భంలో శ్రీయుతులు జి.యస్., డాక్టర్ జి.వి. పూర్ణచంద్‌లను హైదరాబాద్ ఆహ్వానించి, స్నేహనికుంజ్, యువభారతి ఆధ్వర్యలో శ్రీబుద్ధప్రసాద్ అధ్యక్షతన రవీంద్రభారతి సమావేశమందిరంలో వారికి సత్కార పురస్కారాలు అందించడం మహత్తర సన్నివేశం.

కవిగా జి.యస్. వేకువ ప్రారంభ సంచికలోని 'మరామత్తుపని' కవితతోనే తెలుసు. తర్వాత 2010 నాటి 'మనిషికోసం' (మొదటి ప్రచురణ 1975) కవితా సంపుటిలో ఇదే ఖండిక 'కలసి రండి' శీర్షికన ప్రచురితమైంది.

***"ఈలోకం మరామత్తుపనిలో చేయికలపండి***
***'నట్లు' సరిచేసి పట్టుబిగించి***
***కలిసికట్టుగా పనిచేద్దాం!***
***యంత్రాంగాన్ని బాగుచేద్దాం***
***మంత్రాంగాన్ని మార్చివేద్దాం!!"***

అని నినదించే, 'మేధ, ధృతి, శృతి, ప్రజ్ఞ, బుద్ధి, యశము, క్షమ' అనే 'సప్త' విధ 'వాణు'లతో అలరారే 'అనంత స్వప్నాల క్రాంతదర్శి' జి.యస్. సప్తతి శుభవేళ హృదయపూర్వక శుభాకాంక్షలు.

– స్నేహనికుంజ్

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ - అవార్డుల నిర్ణయంపై

# ఏక సభ్య సంఘ నివేదిక

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ ప్రతి సంవత్సరమూ ఆధునిక సాహిత్య ప్రక్రియలైన-కవిత, కథ, నవల, నాటకం, విమర్శ మరియు ఇతరములలో ఉత్తమ గ్రంథాలకు అవార్డులను ఇస్తున్న విషయంలో, ఈ వ్యవహారానికి సంబంధించిన అన్ని అంశాల్నీ పరిశీలించి ఒక నివేదికను సమర్పించవలసిందిగా అకాడెమీ నన్ను ఏకసభ్య సంఘంగా నియమించింది.

నా నివేదికను ఈ క్రింది విధంగా రూపొందించి మీ ముందుంచుతున్నాను.

ఈ వ్యవహారానికి సంబంధించిన తమ అభిప్రాయాలు తెలిపి నా ఈ నివేదిక తయారుకు సహకరించిన వారందరికీ మొదటగా నా కృతజ్ఞతలు తెలియజేసు కుంటున్నాను.

అవార్డులకు సంబంధించి ఇప్పుడున్న సాధారణ నియమాలు ఈ క్రింది విధంగా వున్నాయి.

1. పుస్తకం గత ఐదు సంవత్సరాల కాలంలో ముద్రింపబడి ఉండాలి. పునర్ముద్రణలు పనికి రావు.
2. అనువాదములూ, అనుసరణలూ అర్హములు కావు.
3. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీ కార్యనిర్వాహకవర్గ సభ్యుల రచనలు పరిశీలింపబడవు.
4. ఒకసారి బహుమతి పొందిన రచయిత మరి ఐదు సంవత్సరముల వరకూ అదే ప్రక్రియలో బహుమతికి అర్హుడు కాడు.

5. కవిత, నాటిక – తప్ప మిగిలిన ప్రక్రియలలో పుస్తకాలు వంద పేజీలకు తక్కువ వుండకూడదు.

6. అవార్డు రచయితకి మాత్రమే (కీర్తిశేషులైనా సరే) ఇవ్వబడుతుంది.

పై సాధారణ నియమాలలోని మొదటి అంశం పుస్తకాల ముద్రణ కాలపరిమితి. గతంలోకంటె ఇప్పుడు పుస్తకాల ముద్రణ విపరీతంగా పెరిగింది. రచయితలూ పెరిగారు. కనుక కాలానుగుణంగా ముద్రణ కాలపరిమితిని 5 నుండి 3 సంవత్సరాలకు కుదిస్తే సరిపోతుందని నా అభిప్రాయం. రెండవ, మూడవ, నాల్గవ అంశాల విషయాలలో ఎటువంటి భేదాభిప్రాయమూ లేదు. ఐదవ అంశంలో అన్ని ప్రక్రియల్లో కూడ "వంద పేజీల" నిబంధనను తీసివేయడం జరగాలి. వంద పేజీలకు కేవలం రెండు మూడు పేజీలు మాత్రమే తక్కువైన అనేక ఉత్తమ గ్రంథాలు అకాడెమీ అవార్డుకి అర్హత పొందలేక పోవడం జరిగింది. ఈ ఐదవ నియమాన్ని సాధారణ నియమాల పట్టిక నుండి పూర్తిగా ఉపసంహరించాలి.

పోతే ఆరవ నియమం విషయంలో – "అవార్డు రచయితకి మాత్రమే యివ్వబడుతుంది" అంటూనే "కీర్తిశేషులైనా సరే" అని పేర్కొనబడింది. ఇది పరస్పర విరుద్ధంగా వుంది. కీర్తిశేషుడైన రచయిత రచనకు ఇచ్చే అవార్డు ఎవరికిస్తారు? అసలు అకాడెమి ఇచ్చే బహుమతులు కేవలం ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో ప్రోత్సాహక బహుమతులు మాత్రమేనని దృష్టిలో వుంచుకుంటే బహుమతిని కీర్తిశేషుడైన రచయిత రచనకు ఇవ్వడం భావ్యంగా తోచదు. బహుమతి రూపంగా ఇచ్చేది నగదు కాబట్టి సజీవంగా వున్న రచయిత రచనకే ఇది దక్కాలి తప్ప రచయిత బంధువులకో, దాయాదులకో ఇవ్వడం సబబుగాదు. 6వ నిబంధనను ఈ క్రింది విధంగా మార్చాలని నేను సిఫారసు చేస్తున్నాను.

"కీర్తిశేషుడైన రచయితల పుస్తకాలు పరిశీలింపబడవు."

ఇదిలా ఉండగా కవితా ప్రక్రియకు సంబంధించి ఒక చిత్రమైన పరిస్థితి కొనసాగుతోంది. ఆధునిక సాహిత్య ప్రక్రియల్లో కవిత అంటే వచన కవిత, గేయ కవిత, మినీ కవిత మొదలైన వాటిని పరిశీలించాలేగాని "పద్యకవిత"ను ఇందులో చేర్చడం భావ్యంగా లేదు. మనం అవసరమనుకుంటే "పద్యకవిత"కు వేరే మరో బహుమతిని ఏర్పాటు చేసుకుందాం. అంతేగాని ఆధునిక ప్రక్రియల్లోని కవితకు వెయ్యేళ్ళ చరిత్ర కలిగిన "పద్యకవిత"ను కలపటం సబబు కాదని మనవి చేస్తున్నాను. ఈ విషయంలో మనం ఒక స్పష్టమైన నిర్ణయం తీసుకోవటం అవసరం.

ఇహ పుస్తకాల "ఎంపిక పద్ధతి"కి వద్దాం. ఎంపిక విషయంలో ప్రస్తుతం ఈ క్రింది పద్ధతి అనుసరించబడుతోంది.

1. అకాడెమీ ప్రతి సంవత్సరమూ అవార్డుల పరిశీలన కోసం పుస్తకాలను ఆహ్వానిస్తూ ఒక పత్రికా ప్రకటన జారీ చేస్తూ దాదాపు అదే కాలంలో ప్రతి ప్రక్రియ విభాగానికీ సాహిత్యకారుల నుండి మూడేసి పుస్తకాలను సూచించవలసినదిగా కోరుతూ లేఖల్ని వ్రాస్తుంది. ఈ Panel లో గతంలో అవార్డులు పొందిన రచయితలతో పాటు ప్రతి ప్రక్రియకూ సుమారు 35 – 40 మంది వ్యక్తులు వున్నారు. ఇందులో కొంతమంది అకాడెమీలో సభ్యులు కూడా వున్నారు.
2. పైన పేర్కొన్న Panel లోని వ్యక్తుల నుండి అందిన సూచనలనూ, పత్రికా ప్రకటన ద్వారా లభ్యమైన పుస్తకాలను కలిపి అకాడెమీ ఒక లిస్టును తయారు చేస్తుంది.
3. ఈ లిస్టును జతచేస్తూ – ఆ పుస్తకాల నుండి కేవలం ఒక్క పుస్తకాన్నే సూచించవలసినదిగా – కోరుతూ పైన పేర్కొన్న Panel లోని కొంతమందికి మాత్రమే అకాడెమీ మళ్లీ ఉత్తరాలు రాస్తుంది.
4. వారిలో ఒకే పుస్తకాన్ని ఇద్దరు లేక అంతకు ఎక్కువ మంది సూచించినప్పుడు – ఆ పుస్తకం ఈ వడపోత కార్యక్రమంలో చివరి దశకు చేరుకున్నట్లుగా భావించబడ్తోంది. ఆ పుస్తకం ప్రతుల్ని నాలుగింటిని అకాడెమీ సేకరిస్తుంది.
5. అలా చివరి దశకు చేరిన పుస్తకాల్ని ముగ్గురు న్యాయనిర్ణేతలకు పంపడం జరుగుతుంది. వారి అభిప్రాయాల్ని బట్టి వారి ముగ్గురిలో మెజారిటీ నిర్ణయానుసారం పుస్తకానికి సాధారణంగా ఎవార్డుని ప్రకటిస్తారు.
6. ఒకవేళ పైన చెప్పిన ఐదవ అంశం ప్రకారం ముగ్గురు న్యాయ నిర్ణేతలకు పంపించే స్థాయికి ఒకే పుస్తకం చేరుకున్నా ఆ ఒక్క పుస్తకం అసలు బహుమతికి అర్హమైనదో కాదో, నిర్ణయించవలసినదిగా ముగ్గురు న్యాయనిర్ణేతల్ని కోరటం జరుగుతోంది.
7. మొదటి, రెండవ వడపోతల్లో వ్యవహారమంతా రొటీన్‌గా అకాడెమీ కార్యదర్శి, ఆఫీసు సిబ్బంది నిర్వహిస్తుండగా, చివరి ముగ్గురు న్యాయనిర్ణేతల్నీ అకాడెమీ అధ్యక్షుడు రహస్యంగా నిర్ణయిస్తారు. అలాగే నాల్గవ న్యాయ నిర్ణేత అవసరమైనప్పుడు కూడా వారే ఆ నిర్ణేతని రహస్యంగా నిర్ణయిస్తారు. ఈ విషయంలో కార్యదర్శి, ఆఫీసు సిబ్బంది ఆయనకు సహకరిస్తారు.

8. అవార్డుల నిర్ణయంలో – ఆయా ప్రక్రియలలో నిర్ణయింపబడిన బహుమతుల జాబితాను తమ ముందుంచే వరకూ – అకాడెమీ కార్యవర్గానికి కూడా ఈ వ్యవహారం గురించి ఏమీ తెలియదు. అంతిమ నిర్ణయం తమ ముందుంచబడిన తరువాత కార్యవర్గం – ఆయా రచయితలకి అవార్డులను ప్రకటించే విషయమై నామమాత్రంగా చర్చించి తమ అంగీకారాన్ని తెలుపుతుంది.

9. అవార్డు నిర్ణయంతో సహకరించిన చివరి ముగ్గురు న్యాయ నిర్ణేతల పేర్లు కానీ, ఆమాటకొస్తే ఈ అవార్డుల నిర్ణయం విషయంలో అకాడెమీ సంప్రదించిన ఏ ఒక్కరిపేరుగాని – ప్రకటించబడటంలేదు. చివరకు కార్యవర్గానికి కూడా ఈ పేర్లు తెలియబడటంలేదు. కాగా 1982 నుంచి చివరి ముగ్గురు న్యాయనిర్ణేతల పేర్లు మాత్రం అకాడెమీ కార్యవర్గ సభ్యులకు మౌఖికంగా, అవార్డు నిర్ణయం జరిగాక మాత్రం తెలుపబడుతున్నాయి.

స్థూలంగా ఈ వ్యవహారానికి సంబంధించి ఇవీ ఇప్పుడున్న వాస్తవాలు. ఈ విషయాలన్నింటినీ పరిశీలించే నిమిత్తం నేను అవార్డులకు సంబంధించి 1977, 78, 79 సంవత్సరాల రికార్డులను పరిశీలించాను. కొంతమంది న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించిన వారిని కలుసుకొని సంప్రదించాను. వీటన్నింటిని క్రోడీకరించి పరిశీలించిన పిదప, నేను ఈ క్రింది మార్పులు, చేర్పులు సూచిస్తున్నాను.

నా ఈ సూచనలే చివరివని భావించడంలేదు. అయితే అకాడెమీ అవార్డుల ఎంపికపై ప్రజల్లో వున్న అనుమానాలను, వెలువరిస్తున్న విమర్శలను కొంతవరకైనా, మనం అంగీకరించక తప్పదు. అన్ని అంశాలూ అందరికీ సంతృప్తిని కలిగించకపోవచ్చు – కాని కనీసం సగం మందికంటె ఎక్కువమందికైనా ఆమోదయోగ్యం కావాలి కదా!

ఇహ ఇప్పుడు పుస్తకాల ఎంపిక పద్ధతిలోని ఒక్కొక్క అంశాన్ని పరిశీలిస్తాను.

1. అకాడెమీ ప్రతి సంవత్సరమూ అవార్డుల పరిశీలన కోసం పుస్తకాలను ఆహ్వానిస్తూ పత్రికా ప్రకటన జారీ చేసే విషయంలో ఎటువంటి మార్పు అవసరం లేదు. అయితే ఈప్రకటన విస్తృతంగా అన్ని దిన, వార, మాస పత్రికల్లోనూ ప్రచురింపబడేటట్లుగా తగు జాగ్రత్తలు తీసుకోవాలి. అవసరమైతే బహుళ ప్రచారం కలిగిన రెండు, మూడు పత్రికల్లో మూల్యం చెల్లించైనా, ఈ ప్రకటన జారీ చేయాలి.

2. Panel లోని వ్యక్తులకు మూడేసి పుస్తకాలు సూచించవలసిందిగా ఉత్తరాలు

రాయడం! ఈ అంశాన్ని మనం జాగ్రత్తగా పరిశీలించాలి. ఎందుకంటే ఈ ప్యానల్‌లోని వ్యక్తులు ఎప్పుడో నియమింపబడినవారు. ఆధునిక సాహిత్య ప్రక్రియలపై ఏమాత్రం సానుభూతి లేనివారు సైతం యిందులో వున్నారు. వీరిలో దాదాపు 60 నుంచీ 70 శాతం వరకు అకాడెమీకి తమ సూచనలను పంపడం లేదు. అసలే 35 - 40 మంది - అందులో అధిక శాతం సమాధానం ఇవ్వనివారు వుండటంతో పుస్తకాల ఎంపిక పద్ధతికి మొదట్లోనే పెద్ద విఘాతం కలుగుతోంది. కనుక ఈ ప్యానెల్స్‌ను పునః పరిశీలించి ఒక్కో ప్రక్రియకు కనీసం వందమందికి తగ్గకుండా వుండే విధంగా ప్యానెల్స్‌ను పునః వ్యవస్థీకరించాలి. అకాడెమీ లేఖలు రాసినప్పుడు తమ సూచనలను అందించని వారిని ఆ తర్వాత సంవత్సరానికి ప్యానెల్స్ నుండి తొలగించాలి. కొత్తవారిని చేర్చుకోవాలి. కనీసం మూడింట రెండువంతుల మందైనా, తమ సూచనలను పంపేవిధంగా ఈ ప్యానెల్స్ వున్నప్పుడే అకాడెమీ ఆశించిన ప్రయోజనం సమకూరుతుంది. మొదటిసారి లేఖకు సమాధానం పంపనివారికి 15 రోజుల విరామం తర్వాత వారికి జ్ఞప్తిచేస్తూ మరల లేఖలు రాయాలి. ఇలా ఒక్కొక్కరి నుండి మూడేసి పుస్తకాల చొప్పున అందే సూచనలకు మార్కులు ప్రవేశపెట్టాలి. మొదటి సూచనకు 3 మార్కులు, రెండవదానికి 2, మూడవదానికి 1 మార్కు చొప్పున కేటాయించి ఈ మార్కుల ప్రస్తావన లేకుండా మొత్తం పుస్తకాల లిస్టును తయారు చేయాలి.

3. ఆ తర్వాత ఈ లిస్టును జతచేస్తూ అందులోంచి ఒక్క పుస్తకాన్నే సూచించవలసిందిగా కోరుతూ ప్యానెల్‌లోని సగం మందికి వుత్తరాలు రాయాలి. తర్వాతి సంవత్సరం ఈ సగంమందిని వదిలి, రెండవ సగం వారికి ఈ పద్ధతి అమలు పరచాలి. ఈ వడపోతలో నెగ్గిన ప్రతి పుస్తకానికి 5 మార్కులు వేసి, ఆ పుస్తకాలు అంతకుముందు సంపాదించుకున్న మార్కుల్ని కలిపి మొత్తం మార్కుల లిస్టు తయారు చేసుకోవాలి. ఆ లిస్టులో మొదటి ఐదు స్థానాలలో నిలిచిన 5 పుస్తకాలను5గురు న్యాయ నిర్ణేతలకు పంపాలి. వారు ఆ అయిదింటికి Order of Priority లో తమ Preference ను తెలియచేయాలి. ఈ సూచన మొదటి స్థానానికి 5 మార్కులు, రెండోదానికి 4 మార్కులు, మూడవదానికి 3 మార్కులు, నాల్గవ స్థానానికి 2 మార్కులు, చివరిస్థానానికి 1 మార్కుగా కేటాయించుకోవాలి. ఇలా 5గురు నుండి వచ్చిన మొత్తం మార్కులు కలుపుకుని - ఆ పుస్తకం

అంతకుముందు సంపాయించుకున్న మార్కుల మొత్తానికి - ఈ మొత్తాన్ని కలపాలి. అత్యధిక మార్కులు సంపాయించిన పుస్తకానికి బహుమతిని ప్రకటించాలి. ఒక వేళ ఒకటికంటె ఎక్కువ పుస్తకాలు సమాన స్థాయిలో మార్కులు సంపాయించినప్పుడు మరొక న్యాయ నిర్ణేతను ఒకేవొక పుస్తకాన్ని సూచించవలసిందిగా కోరవచ్చు.

ఈ పద్ధతి వల్ల గతంలో మొదటి దఫా ఎంపికలో పలువురి ద్వారా సూచించబడి కూడా, రెండవ వడపోతలో కేవలం ఇద్దరు సూచించని కారణంగా లిస్టు నుండి మాయమయ్యే పుస్తకాలకు న్యాయం జరుగుతుంది. అలాగే మొదటి దఫా ఒకేవొక వ్యక్తి ద్వారా సూచించబడి, రెండవ దఫా కేవలం ఇద్దరి ద్వారా ఎంపిక చేయబడినంత మాత్రాన ఆ పుస్తకం అమాంతం అవార్డు పొందటం లాంటి అవాంఛనీయ పరిస్థితి కూడా తొలగిపోతుంది. ఇదే సరియైన "శాస్త్రీయ పద్ధతి" అని పలువురి అభిప్రాయం.

4. చివరి దఫా వడపోతకు సహకరించే ఐదుగురు న్యాయ నిర్ణేతల్లోనూ ముగ్గుర్ని అకాడెమీ కార్యవర్గ సమావేశంలో హాజరైన సభ్యుల్లో మూడింట రెండువంతుల అంగీకారంతో నియమించాలి. ఆ ముగ్గురిలో ఏ ఒక్కరూ వరుసగా రెండేళ్ళు ఆ ప్రక్రియలో న్యాయనిర్ణేతగా వుండరాదు. మిగిలిన ఇద్దరు న్యాయనిర్ణేతలుగా గడిచిన రెండు సంవత్సరాలలో ఆ ప్రక్రియలో బహుమతులు పొందిన రచయితలే వుంటారు. మొదటి ముగ్గురు - కార్యవర్గపు సమష్టి బాధ్యతకు, నిర్ణయానికి ప్రతినిధులుగానూ, మిగిలిన యిద్దరు సర్వసమన్యాయానికీ, వ్యవస్థీకరింపబడి, అంగీకరింపబడిన ఒక నిర్దుష్టమైన పద్ధతికి ప్రతినిధులు గానూ పరిగణింపబడతారు. అవార్డు గ్రహీతలైన న్యాయ నిర్ణేతలు మాత్రం రెండేళ్ళు వరుసగా న్యాయ నిర్ణేతలుగా వ్యవహరిస్తారన్నమాట!

ఈ సందర్భంగా నేను పరిశీలించిన రికార్డుల మూలంగా నాకు తెలిసిన కొన్ని అంశాల్ని మీ ముందుంచుతాను. కొంత మంది వ్యక్తులు వరుసగా రెండు, మూడేండ్లు న్యాయ నిర్ణేతలుగా (ఒకే ప్రక్రియకు) నియమింపబడినవారున్నారు. అంతేకాదు - కార్యవర్గంలోని వ్యక్తులే కార్యవర్గానికి సైతం తెలియకుండా న్యాయ నిర్ణేతలుగా వ్యవహరించి వున్నారు. మరొక విషయం ఏమంటే అసలు ఆయా ప్రక్రియలలో ఏ మాత్రం సంబంధంలేని వారు కూడా చివరి దశలో

న్యాయనిర్ణేతలుగా వ్యవహరించారు. ఇదిలా వుండగా ఒక న్యాయ నిర్ణేత ఒక పుస్తకాన్ని "చెత్త" పుస్తకంగా అబివర్ణించి కూడా, గత్యంతరం లేక దానికే బహుమతిని సూచించిన సంఘటన నా దృష్టికి వచ్చింది. మరొక వైపు ఆఫీసు సిబ్బంది నిర్లక్ష్య వైఖరి, కార్యదర్శి బాధ్యతారహిత వైఖరి మూలంగా ఒక ప్రక్రియకు సంబంధించిన సూచన మరొక ప్రక్రియకు సంబంధించిన ఫైలులో వుంచటంతో ఆ సూచనకు అన్యాయం జరిగిన ఘటనలు కూడా నాకు తెలిశాయి. కనుకనే ఒక శాస్త్రీయ పద్ధతి ద్వారానే ఈ "ఎంపిక" వ్యవహారం జరగాలని నా గట్టి సూచన.

5. ఇక్కడ మరో విషయం కూడా ప్రస్తావించాలి. ఒకవేళ అత్యధిక మార్కులతో ప్రధమస్థానం పొందిన రచయిత బహుమతిని తిరస్కరించే పక్షంలో, ద్వితీయస్థానం పొందిన రచయితకు ఆ బహుమతిని ప్రకటించాలి. మొదటి వ్యక్తి చర్యవల్ల రెండో వ్యక్తికి అన్యాయం జరగకుండా చూడాలి కదా!

6. ఇదిలా వుండగా ఈ బహుమతుల మొత్తాన్ని ఇటీవలనే రూ. 1116/- నుండి రూ. 2500/-లకు పెంచడం జరిగింది. ఇది శ్లాఘించదగిన విషయం. అయితే రచయిత్రులు వ్రాసి ప్రకటించిన పుస్తకానికి యిచ్చే బహుమతిని మాత్రం రు. 1116/-గానే వుంచటం జరిగింది. ఈ బహుమతి విలువను కూడా రు. 2500/-లకు పెంచవలసినదిగా నేను సిఫారసు చేస్తున్నాను.

7. అకాడెమీ వార్షిక బహుమతుల ప్రదాన సమయంలో బహుమతి గ్రహీతలకు నగదుతోపాటు అకాడెమీ చిహ్నంతో కూడిన ఒక మొమెంటో లేదా సర్టిఫికెట్ కూడా ప్రదానం చేయాల్సిన అవసరం వుంది.

ఇలా అకాడెమీ వార్షిక బహుమతుల ఎంపిక పద్ధతిలో కొన్ని మార్పులు, చేర్పులు చేసి – ఏ పరిస్థితుల్లోనూ ఈ వ్యవహారం విమర్శలకు అతీతంగానూ, శాస్త్రీయ దృక్పథానికి అనుగుణంగానూ – అకాడెమీ చేరువయ్యేవిధంగా మీరంతా పూర్తి సహకారాన్ని అందిస్తారని ఆశిస్తూ నా నివేదికను ముగిస్తున్నాను.

మచిలీపట్టణము
జనవరి 16, 1983

గౌరవాభివందనములతో
భవదీయ
(సం) గుత్తికొండ సుబ్బారావు

## Proposals of Sri Guttikonda Subba Rao

1. Nominations should be called for according to a time schedule for filing nomination papers and withdrawals etc. for all the Executive posts viz. President, Vice President, Secretary, Jt. Secretary and Executive Board members.

2. Regional offices of the Akademi may be opened at Tirupathi, Guntur and Visakhapatnam. The Executive members of the respective areas may be termed as Persons-in-charge of the Regional offices.

3. The Government may, by a special resolution of the General Council, be requested to enhance the Annual Grant to Rs.10.00 lakhs as against the present sum of Rs.3.00 lakhs. Necessary follow - up action such as personal meetings with the concerned officials and Ministers may be taken up by the President, Secretary and others as may become necessary.

4. The Akademi should take necessary steps to convince the Government to enact a bill providing the inclusion of Akademi members of various districts in the respective Zilla Grandhalaya Samsthas and University Senates..

5. The Akademi should start a Telugu literary monthly.

6. The Akademi should give financial help to its recognised literary institutions by way of Annual grants.

7. The selection of best books in Modern Telugu literature for annual awards should be done according to a systematic scientific procedure to be evolved through discussion on the subject by the General Council.

8. The amount of cash award for Best works in Modern Telugu literature may be raised from Rs.1,116/- to Rs.5,000/.

9. An annual award for the best Telugu Journalist may also be introduced.

10. The publications of the Akademi should be given free of cost to all its recognised institutions as long as they enjoy the recognition of the Akademi.

11. A printing press may be acquired for the Akademi.

12. The minutes of every Advisory Committee meeting as well as any special Committee meeting should be sent to each and every member of the Akademi.

13. The retirement age of the Fellows should be reduced to 70 years instead of 75 years. However this will not apply to the present Fellows.

***

GUTTIKONDA SUBBA RAO
Member: Executive Board
A.P. Sahitya Akademi,
H.No.26-162 Buttaipet,
MACHILIPATNAM - 521001

14th December 1981

The Secretary,
A. P. Sahitya Akademi,
H Y D E R A B A D

Dear Sri Krishnamurthy garu,

Sub : MINUTES OF EXECUTIVE BOARD MEETING HELD ON 22.11.1981.

Namaskarams.
I am in receipt of your covering letter d/7.12.1981 therewith enclosing the minutes of the 12th meeting of the Executive Board of the Akademi held on 22.11.1981 and thank you for the same.

While going through the minutes I have noticed some discrepancy in connection with Item No.4 in Page 2 of the minutes. This item relates to "Award of prizes for Modern Telugu Literature 1981". In the minutes it is noted that the award will contain a purse of Rs.1116/-only. I have also noticed from some of your press releases which were published in various newspapers that the amount of award is Rs.1116/- only. But this is contrary to our earlier decision taken in our Nizamabad meeting held on 21.6.1981 to enhance the prize amount from RS.1116/- to Rs.2500/- vidé our Resolution No.7(iv) of the minutes of that meeting.

It is true that the Whole Item No.7 except 7(iv) was revoked in our next Executive Board meeting vide our resolution No.5 of the min-

utes of the Board meeting held on 30.8.1981. In this resolution it was clearly mentioned that the decisions taken except 7(iv) were rewoked.

As such the enhancement of Award amount from Rs.1116/- to Rs.2500/- stands valid. But you have wrongly noted the amount as Rs.1116/- instead of Rs.2500/- vide Item No.4 of the minutes of the Executive Board meeting held on 22.11.1981.

As such I would like to advise you to give a press release again correcting the mistake and also send a detailed amendment to the minutes to all the members of the General Council. In this connection I would also like to request you to mention my name as the proposer for this correction of minutes.

Secondly it is noted in Item No.6(b) of the minutes of the Board meeting held on 22.11.1981 that the President was authorised to select two Judges for the two subjects announced for the year 1980. But there was no such authorisation given to the President in this matter. I remember that the matter was discussed and deferred for the next meeting because there is still time upto 31st December t981, to receive the entries in this regard. As such I request you to change the text of the minutes of the above item as "Deferred for the next meeting".

Lastly, I request you to acknowledge receipt of this letter and oblige.

With regards,

Yours friendly,

Copy to :
Dr.Bezwada Gopala.Reddy,
President, A.P.Sahitya Akademi,
Sudarshana Mahal, NELLORE . .For information and necessary action.

Cepy sent to all the members of the General Council
of A.P. Sahitya Akademi.



ఈనాడు ప్రయోజకులైన కుమార్తెలు ఆనాడు చిట్టిపాపలుగా వున్నప్పుడు...



జీవన సహచరి శ్రీమతి రామరత్నం గారితో...



వాషింగ్టన్‌లో ఎయిర్‌ఫోర్స్
మ్యూజియంలో చంద్రుని
దగ్గరకెళ్లొచ్చిన రాకెట్ దగ్గర



ఏ దేశమేగినా గ్రంథాలయ దర్శనం ఒక ముఖ్య కార్యక్రమం
కాలిఫోర్నియాలోనని ఒక గ్రంథాలయంలో...




శాన్‌ఫ్రాన్సిస్కో గోల్డెన్‌గేట్ స్థూపం దగ్గర

వాషింగ్‌టన్‌లో అమెరికన్
సెనేట్ భవనం ముందు...





వాషింగ్‌టన్‌లో అబ్రహాంలింకన్ మెమోరియల్ లోపలి భాగంలో



న్యూయార్క్ నగరంలో ఐక్యరాజ్య సమితి సమావేశ మందిరం వెలుపల



మొట్టమొదటిసారి కంప్యూటర్ కీబోర్డు మీద చెయ్యి వేసిన దృశ్యం



సుబ్బారావు గారి తల్లిదండ్రులు గుత్తికొండ రామనాథం, ఇందిరా దేవి




"మనిషి కోసం" ఆవిష్కరణోత్సవ వేళ పూర్ణచందు నుండి కానుకలు స్వీకరిస్తూ...




గుడివాడలోని ఉన్నత పాఠశాలలో తెలుగు భాషాదినోత్సవ కార్యక్రమంలో పాలుపంచుకుని....




డా॥ జి.వి. పూర్ణచంద్ రచన 'తెలుగే ప్రాచీనం'కు తుర్లపాటి రాజేశ్వరి ఆంగ్లానువాదం "Antiquity of Telugu Literature" ను ఆవిష్కరిస్తున్న శ్రీ మండలి బుద్ధ ప్రసాద్ వేదికపై యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, శ్రీ విహారి, శ్రీ పూర్ణచంద్, డా॥ తుర్లపాటి రాజేశ్వరి



హైదరాబాదులో... ఒక వేడుకలో శ్రీ అవ్వారు రామకృష్ణ, శ్రీ ఎ.వి.నారాయణ IPS, శ్రీ పెండెం రవీంద్రరావు, శ్రీ గుత్తికొండ వెంకటరాములు గార్లతో




ఎల్.ఐ.సి. ఎంప్లాయిస్ కోపరేటివ్ బ్యాంకు అధ్యక్షునిగా ఉన్నప్పుడు మాజీ మంత్రి,
ఆనాటి మచిలీపట్నం అర్బన్ బ్యాంకు అధ్యక్షులు
శ్రీ నడకుదిటి నరసింహారావు గారితో...



మచిలీపట్నం ప్రజాప్రతినిధులకు అభినందన కార్యక్రమంలో...



ఆత్మీయుడు జి.వి. పూర్ణచంద్ వివాహ సందర్భంగా...




గుడివాడ భారతీ సమితి వారి అభినందనలందుకుంటూ...




శ్రీ తూములూరి రాజేంద్రప్రసాద్ రచన ఆవిష్కరణ సభలో...
వేదికపై ఆనాటి ఆకాశవాణి డైరెక్టర్ శ్రీ ఆదిత్యప్రసాద్ తదితరులు



బందరు ముచ్చట్లు ఆవిష్కరణ సభలో శ్రీ మండలి బుద్ధప్రసాద్,
ఆచార్య మైనేని కేశవదుర్గా ప్రసాద్, శ్రీ కొనకళ్ల బుల్లయ్య,
శ్రీ తిక్కిశెట్టి రామమోహనరావు ప్రభృతులతో...



శ్రీమతి ఇంద్రగంటి జానకీబాల, శ్రీమతి డి. సుజాతాదేవి,
శ్రీ పూర్ణచంద్, శ్రీ డోకల నారాయణరావు గార్లతో




డా॥ పట్టాభి కళాపీఠము వార్షికోత్సవ కార్యక్రమంలో...



పశ్చిమ గోదావరి జిల్లా రుద్రరాజు ఫౌండేషన్ వారి కార్యక్రమంలో...




కో-ఆపరేటివ్ బ్యాంకు అధ్యక్షునిగా పదవీ విరమణ చేస్తూ...



ఆనాటి జిల్లా కలెక్టర్ శ్రీ ఎ.వి.ఎస్. రెడ్డి గారి సతీమణి శ్రీమతి ఇందిరా రెడ్డి గారితో
సుబ్బారావు గారి కుటుంబము, పూర్ణచందూ....



గుంటూరు అరసం వారి మినీ కవితా సదస్సులో
గుత్తికొండ, పూర్ణచంద్, రావి రంగారావు

## అనురాగమనం

ఏ అనురాగం
అనంతగీతమై
పల్లవీ చరణాలుగా
మన సాహితీ సాహచర్యాన్ని
శాశ్వతం చేసిందో...

ఏ 'గమనం'
మరోప్రస్థానమై
దరీదారులుగా
మన సాహితీ సహజీవనాన్ని
సుస్థిరం చేసిందో...

ఏ స్నేహబంధం
లోహబంధమై
గురుశిష్యులుగా
మన సాహితీబాంధవ్యాన్ని
కీర్తిమంతం చేసిందో...

ఏ సహృదయం
దీక్షావ్రతమై
దీక్షావృతమై
కార్యకర్తలుగా
మన సాహితీకలాపాల్ని
మూర్తిమంతం చేసిందో...

నేస్తం సుబ్బారావూ...
నలుబదేళ్ల చెలిమికి
తీపిగుర్తుగా
ఈ 'గమనం'...
ఇది -
నీతో కలిసి నడిచిన
నా 'గమనం'
ఇది - మన 'గమనం'
ఇది
'అనురాగమనం'

డా॥ జి.వి. పూర్ణచందు

162

